# సేతు రామేశ్వర మాహాత్మ్యం



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్ర శాస్త్రాది గ్రంథములకు


mohan PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
www.mohanpublications.com

grantha nidhi
THE TREASURE OF PAGES
www.granthanidhi.com

WWW.Granthanidhi.Blogspot.in

www.mohanpublications.com

శ్రీరస్తు.

శ్రీగణాధిపాయనమః.

అనేక పుణ్య కథాంతర్భూతంబును

శ్రీ స్కాంద పురాణాంతర్భూతంబును

నగు

# శ్రీ సేతురామేశ్వర మహాత్మ్యము.

ఇందు తీర్థముల మాహాత్మ్యము,
పుణ్యకాల వివరము, మహా సంకల్పము, మాఘస్నాన,
సముద్రస్నాన, క్షేత్రపిండ, సర్వప్రాయశ్చిత్తములు, దశ
దానవిధులుచేర్చి యాత్రాపరులకు సులభోపాయంబుగా
తెలియునట్టుల వచనరూపంబుగ
వ్రాయబడి,
పండితులచే పరిష్కరింపబడి,

రామేశ్వరం, బుక్కుషాపు
మ. నాగలింగం పిళ్లెగారి
కొమారుడగు
మ. చెల్లయా పిళ్లెగారిచే

చెన్నపురి,
హిందూరత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రచురింపబడియె.
1923 వ సం॥

రిజిస్టర్డుకాపీరైటు.

దీని వెల) (12 అణాలు.



శ్రీరస్తు.

శ్రీమహాగణాధిపతయేనమః.

# శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.



వచనకావ్యము.

శా॥ నిగమములెన్నజాలవట నిశ్చయబుద్ధినిజూడజాలక ।
య్యగణితసుప్రభావమహిమాబ్ధిగురించివరించునెవ్వడే ।
జగములబ్రోవలీలగుణసంగతినొంగతలక్ష్మిగూడున ।
య్యగుణుభజింతుమాధవుని యంబుజనాభునిరక్షణాక్షమున్ ॥



వ॥ అవధరింపుడు శౌనకాదిమునులారా నాడు వ్యాసపుత్రుండును నిఖిలపురాణకథకుండునునగు సూతుండు వెంచేయఁబూజించి సుముఖుంజేసి సేతుమహాత్మ్యంబడిగిన సూతుండిట్లనియె.

పూర్వకాలంబున శ్రీరామచంద్రులచే సేతువు బంధించబడిన దక్కడ స్నానంబుజేసి శ్రీరామనాథస్వామిని దర్శించినవారికి జన్మరాహిత్యంబని చెప్పిన సూతా యాకథాక్రమంబువక్రమించి సక్రమంబుగా జెప్పవలయునని ప్రార్థించిన.

మునీంద్రులారా సేతుయాత్రా ప్రకారంబు లనేకవిధంబులు తాముయాత్రసలిపి సేతుదర్శనంబుజేసి స్నానదాన తర్పణాదులుజరిగించె నేని పాపంబులచేబాయు జన్మరాహిత్యంబు గలుగును. యాత్రాపరునకు సహాయంబుజేసి తనశక్తికొలది ధనంబిచ్చి పంపించినవారికి పాపక్షయం

www.mohanpublications.com
బునకు సందేహములేదు. యాత్రజేయలేనని ప్రయత్నంబుజేసి మనో వాక్కాయ కర్మంబుల సేతు స్నానాశ క్తిగలిగెనేని వాడు పవిత్రుండగు సేతువులో శ్రాద్ధంబుజేసి పిండప్రదానంబుజేసిన నతనిపితృదేవతలుబ్రహ్మ లోకంబుజేరుటకు నిస్సందేహంబు సేతుస్నానం బొనరించినవాఁడు వైతరణి, శ్వభక్ష, కాలసూత్ర, తప్తసూల, పురీష, ప్రాస, శిలావృష్టి, మూత్రపాన, రేతకపాన, తప్తపాషాణభోజనాది, మహానరకంబులలో బాధనొందడు.

మరియు సేతుదర్శనంబు జేసినవారలు మార్గచ్ఛేది, గృహదాహి, పార్థివృథక్పాకి, బ్రాహ్మణదూషక, వేదవిక్రేతా, భోజనప్రతిబంధి, జలపానప్రతిబంధి, స్వర్ణస్తేయీ, సురాపాయీ, బ్రహ్మద్రోహి, మిత్ర ద్రోహి ఇత్యాది మహాపాతకులైన పాపములగుదురు, మునులారా యీసేతు మాహాత్మ్యంబు స్కాందపురాణంబులో విస్తారంబుగా జెప్పబడియున్నది మీరు సకలయాత్రాచరిత్రలు విని నిశ్చయించినవారు గనుక సకలకథా విస్తారంబులు సూక్ష్మంబులుగా ముఖ్యంబుగ వినుపింతును తథాచ స్కాందపురాణే.

శ్లో॥ సేతుస్నానేన ధర్మస్స్యాత్ సేతుస్నానాదఘక్షయః ।
సేతుస్నానంద్విజశ్రేష్ఠా స్సర్వకామ ఫలప్రదం ।
సేతుస్నానేనసర్వేషాం సత్యం తేపాపనాశనం ।
వర్ధతేధర్మరాశిశ్చ శుక్లపక్షే యథాశశీతి ॥

సూక్ష్మముగా సూచించితి సేతుస్నాన మాహాత్మ్యం బమ్మ తంబు బుద్ధిమంతులు సేతు స్నానంబుజేసి తరింతురని తలచెదనని సూతా సేతుబంధనం బెందుకయ్యె తత్ప్రకారంబు వినగోరెదమని యడిగిన సూతుం డిట్లనియె.

www.mohanpublications.com

## సేతుబంధన చరిత్రము.

కృతయుగంబున దశరథమహారాజు బహుకాలము రాజ్యంబు జేసి పుత్రసంతానంబు లేమింజేసి పుత్రకామేష్టి చేసి యాగపాయసంబును భార్యాత్రయంబగు కౌసల్యా సుమిత్ర కైకలకొసంగిన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను నలుగురు పుత్రులుదయించిరి. వారు బాల్యావస్థ యందు లీలావిలాసులుగానుండునప్పుడు విశ్వామిత్ర మహర్షి జేయు సత్రయాగంబును రాక్షసులుబాధించి చెరుచుచుండ యోగ దృష్టివలన నామహర్షి శ్రీమహావిష్ణు ముందు దశరథునకు శ్రీరాములను పేర నవతరించి రాక్షసులను నశింపజేయుదునని వరమొసంగియుండె. ఇప్పుడాయన యవతరించి దశరథునింటనుండె. నేనిప్పుడా దశరథునికోరి శ్రీరాములను తీసుకొని రావలయునని వచ్చి దశరథుని జూడ సమ్మతించి శ్రీరాములను విశ్వామిత్రునితో నంపిన వచ్చి విశ్వామిత్రుని యాగమును సాంగోపాంగమగువరకు రాక్షసబాధలేకుండ కాపాడిరి. అప్పుడు విశ్వామిత్రుడు సంతసించి శ్రీరాములకు అనేకములయిన దివ్యాస్త్ర ప్రయోగంబు లుపదేశించె.

అంత జనకమహారాజు తనపుత్రియగు సీతాదేవికి వైవాహిక ప్రయత్నంబాచరించి స్వయంవరంబు చాటించిన నాస్వయంవరంబునకు శ్రీరాములు పోయి జనకమహారాజునకు శివుడొసంగిన విల్లును వచ్చిన రాజులు నెక్కువెట్టలేకయుండ రాఘవుండవలీలగా నావిల్లునెక్కువెట్టి మత్స్యయంత్రంబును దెగవేసి సీతనుబెండ్లియాడి అయోధ్యను సుఖస్థితి నుండునప్పుడు దశరథుండు తనకు వృద్ధాప్యంబు వచ్చెనని కుమారునకు పట్టంబు గట్టునటుల మంత్రి సామంతులతో ఆలోచించి ముహూర్త నిశ్చయంబొనర్చి పట్టాలంకారంబు చేయ నియమించె.

www.mohanpublications.com

అట్టి ప్రయత్నాదుల పడంపడి కైకదాసియగు మంథర విని కైక దగ్గరకుపోయి యోయమ్మా, దశరథుండు నీపై విశేషప్రీతిగలవాడనియు రెండువరంబులు నీకునొసంగెననియు జెప్పుచుంటివే యిప్పుడు రాములకు పట్టాభిషేకం బొనరింప బ్రయత్నింబగుచున్నది. ఇక నీ కుమారుండును నీవును నాయన యాజ్ఞాబద్ధులయిన వారుగ నుండవలె యట్టి బ్రతుకు బ్రతుకే.

ఈసమయంబున దశరథుని నిర్బంధించి నీకొసంగిన రెండువరంబులకు నొకటికి రాముని నరణ్యంబునకు బంపుటయు రెండవదానికి నీ కుమారుండగు భరతునకి పట్టాభిషేకము సేయుటయు నేర్పాటు జేసుకొనుమని ప్రోత్సాహపరుప నామె భర్తను నాప్రకారముకోరగా దశరథుండు విఫలమనోరథుండై జీవన్మృతుండువోలెయుండె.

అంత పట్టాభిషేకంబున కాయత్తంబగుడు. దశరథుండు రామింజూచి ఋష్యాదులు రాఘవుం బోయి నీజనకునిం దోడ్కొనిరమ్మని యనుప రాముండు తండ్రిసమీపంబునకు వచ్చి నడచిన సంగతి విని పితృవాక్య పరిపాలనకై కానరణ్యగమనోద్యోగుండై నసీతాలక్ష్మణులు వెంటనంటిరి. అంత గొంతకాలంబునకు దశరథుండు పరలోకగతుండైన భరతుండు రాము పాదుకలు నందిగ్రామంబున బూజించుచు రాజ్యం జేయుచుండె.

అట్లు శ్రీరాముండు సోదరభార్యా సమేతుండై పంచవటీ తీరంబున పర్ణశాలయందు వశించునపుడు రావణుండా సీతను దోడుకొనిపోయెను. అనంతరము భార్యాన్వేషణకు బయలువెడలి బంపాతీరంబుజేరవచ్చుటకు సుగ్రీవుని బంటగు నాంజనేయుండువచ్చిన రాముండు సంతోషిత స్వాంతుండై నీవెవ్వండ వేమిటికొచ్చితివనియడిగిన యాంజనేయుండు

www.mohanpublications.com
సుగ్రీవుని వృత్తాంతంబంతయుం జెప్పి యీసతని భృత్యుండ భగవత్సంఖ్యంబునొంది నన్నంపిన వచ్చినాడననియె.

రాఘవుండును లక్ష్మణసహితుండై యావానరశ్రేష్ఠుని వెంటం బోయి ప్రమాణికంబుగా వాలివధ ప్రతిజ్ఞుండయ్యె. సుగ్రీవుండును సీతాన్వేషణా పరుండయ్యె. అంత సుగ్రీవుండు వాలితో బోరాడు సమయంబున భేదాభేదంబులం దెలియకాలక రాముండూరకుండిన సుగ్రీవుండు పలాయనుండై రాములనిందించిన మరుసటిదినంబున పూపులమాల ధరించుకొని యుద్ధంబుజేయ నియమించి రాఘవుండు యొక శరంబున వాలిం గూల్చి సుగ్రీవునకు బట్టంబుగట్టె, తదుపరి సీతాన్వేషణంబునకై వానర శ్రేష్ఠుల నలుమూలలకు బంప నందు నాంజనేయుం డంగదాది సమేతుండై లంకాపురాశోకవనంబున వైదేహింగాంచి లంకయంతయు దహించి శ్రీరాములానవాలుగా నిచ్చిన యంగుళీయకము భూమిజ కిచ్చి యామె చూడామణిం దెచ్చి శ్రీరాములకొసంగె. అంత లక్ష్మణ సుగ్రీవాంగద హనుమదాది వానర సమేతుండై మహేంద్రపర్వత సమీపస్థిత చక్రతీర్థోపాంతంబున నివసించునపుడు రావణానుజుండగు విభీషణుండు మంత్రిచతుష్టయంబుగా రాముల శరణొందిన సుగ్రీవాదులు శంకించుచుండినను యభయంబొసంగి రాక్షస రాజ్యంబున నభిషిక్తుంజేసి యిట్లనియె.

ఓ వానరశ్రేష్ఠులారా నీసముద్రము మహాభయంకరంబు నొందించుచున్నది. మనలకుత్తరోపాయమెట్లున్నది యని సంశయించుచుండ విభీషణుం డేతెంచి.

ఓరఘువీరా! ఈరత్నాకరుండు యుష్మద్వంశ సముద్భవ సగరతనయసమూహాన్వితుం డగుటంజేసి సాగరుండను ప్రసిద్ధినొందెను. కావున శరణంబువేడ నస్మత్కార్యానుకూలుండగు ననిన నంగీకరించి ఓకపివరులారా నతిభీషణంబగు నీసముద్రంబు స్నసాదులు దరింప నశక్యంబు విభీషణోక్త

www.mohanpublications.com

ప్రకారంబున మార్గసిద్ధింగోరి వరుణాలయంబు నుపాశించెద. ఏనుపాసించినం దుర్మదుండగు నేని దహించెదనని సౌమిత్రిసహితుండై యాచమనంబుచేసి దర్భశయనంబున స్వహస్తంబు దలగడగ నిడికొని దర్భశయనంబున శయనించె.

ఇవ్విధంబున త్రిరాత్రంబులు సకలధర్మవేదియు నియమ సమన్వితుండునగు రామచంద్రుండు యథార్థంబుగా ననేకవిధంబుల వేడినం దుర్మదుండగు సాగరుండు దర్శనం బొసంగకపోయె. నంత నృపోత్తముండు లక్ష్మణుంగాంచి, సౌమిత్రీ ఈసముద్రుండు క్షమాయుక్తుండగు నన్ను నసమర్థుంగాదలంచె నాశీవిషోపమంబులగు బాణంబులనొసంగుము నితని నమోఘాస్త్రంబులచే శోషింపంజేసి నిర్జలుండగునట్లు గావించెద. వానరసమూహంబుల పాదంబులచే గృతగమను లగుదురని ధనుర్ధారియై క్రోధపర్యాకులేక్షణుండగుచుఁ ద్రిపురాంతకుం బోలె ధనురాకర్షణము గావించి సమస్తజగంబులు కంపంబునొంద నుగ్రంబులగు బాణంబులం బ్రయోగించె. నంత రామప్రేరితంబులయిన బాణంబుల తోయంబులం బ్రవేశింప సాగరుండు పాతాళోద్ధతుండును నతిభీతుండును కంపమానదేహుండు ననన్యశరణుండును కృతాంజలియగుచు కైవల్య పదకారణుండగు రాఘవు శరణంబునొంది యిట్లని స్తుతించె.

ఓరఘునాయకా నీవుతటాకాంతకుండవు కౌశికయాగరక్షకుండవు మహాదేవశరాసనవిదారివి భక్తాభీష్టఫలప్రదాయకుండవు దేవకార్యార్థివి రఘువంశముద్భవుండవు, మహానుభావుండవు, నిన్నుగొనియాడ నాతరంబగునే నీకనేక వందనంబులొనరించెద శరణార్థియగు నన్ను గావుము, కోపంబునసంహరింపుము, క్షమింపుము భూమ్యాదులు పరమేష్ఠికల్పితంబులగు స్వగుణంబుల నెట్లువిడువ దట్లయేను నగాధంబగు మత్స్యభావంబునూననేర మన్నింపుము. యుష్మత్సేనావతరణంబునకుం దగిన సహాయ్యంబు చేసెదనని విన్నవించిన సంతసించి రామచంద్రుండు ఓ రత్నా

www.mohanpublications.com

కలా మత్తైన్యా సమూహంబులకుంబోవలయుంగాన శోషణంబు నొందుమనిన సముద్రుండిట్లనియె. ఓనృపోత్తమా నీవు సైన్యసమేతంబుగా లంకకుంబోవ నుపాయంబువచించెద నాకర్ణింపుము. యుష్మదాజ్ఞా గౌరవంబున శోషణంబునొంది నన్నుంగాంచి జనంబులు ధనుర్బలంబునకు భీతినొందినవాడనైతినని వచింపుదురుగాన మరియొక్క యుపాయంబు జెప్పెద నాకర్ణింపుము.

విశ్వకర్మపుత్రుండగు నలుండు కాష్ఠంబైన తృణంబైన శిలయైన నాయందుంచిన నవియన్నియునుధరించెద. అదిసేతుబంధనంబడునాసేతువుచే రావణపాలితంబగు లంకాపురంబునకుం బొమ్మనివచించి సముద్రుండంతర్హితుండయ్యె నదివిని రామచంద్రుండు నలునిచే సేతుబంధనంబు గావించి వానరసమూహంబుతో దాటె నదియొదర్భశయనం బనంబడు. తదుక్తం సేతుమహాత్మ్యే.

శ్లో॥ నలశ్చక్రేమహాసేతుం మధ్యేనదనదీపతేః దశయోజనవిస్తీర్ణం
శతయోజనమాయతం ॥ సర్వపాతకకినోమర్త్యా । ముచ్యంతే
సర్వకిల్బిషైః । వ్రతదాన తపోహోమైర్యత్న తథాతుష్యతే
శివః ॥ సేతుమజ్జన మాత్రేణయథాప్రీణాతిశంకరః ॥ఇతి॥

వింటిరామునులారా సేతుమాహాత్మ్యం బనర్ఘ్యంబు సేతుస్నానంబున మహాపాపంబులు నశించును హరిహర సంతోషకారణం బాసేతువు నావరించుకొని యనేకకోట్ల తీర్థంబులుగలవుగాని యందులో మహా ముఖ్య తీర్థంబులు జెప్పెద.

## సేతువులో నుండు ముఖ్యతీర్థంబులు.

వినుండుధర్మపుష్కరిణీయనుచక్రతీర్థంబు, వేతాళవరదంబు, పాపవినాశినీ, సీతాసరస్సు, మంగళతీర్థంబు. అమృతవాపియుబ్రాహ్మకుండంబు హనుమత్కుండంబు, అగస్త్యతీర్థంబు, రామతీర్థంబు, లక్ష్మణతీర్థంబు,

www.mohanpublications.com

జటాతీర్థంబు, లక్ష్మీతీర్థంబు, అగ్నితీర్థంబు, చక్రతీర్థంబు, శివతీర్థంబు, శంఖతీర్థంబు, యామునతీర్థంబు, గంగాతీర్థంబు. గయాతీర్థంబును, కోటితీర్థంబును, సాధ్యనామామృతంబును, మానసతీర్థంబును, ధనుష్కోటియు నన నివి యిరువదినాలుగు తీర్థంబుల మాహాత్మ్యంబులు మునీంద్రులారా యీ అధ్యాయంబు పఠించినవారికి జన్మరాహిత్యంబని చెప్పియుండగా నీతీర్థంబులలో యథాశాస్త్రంబుగా స్నానాది క్రియలు జరిగించు వారికి నుత్తమలోకంబులు దొరకుటకేమి యాశ్చర్యంబని చెప్పినవిని సూతా యిరువదినాలుగుతీర్థంబులలో నుత్తమతీర్థంబులెవ్వియో వినుపించుమని యడిగినమునులారా సమస్తతీర్థంబు లుత్తమంబులే యందులో ప్రధానతీర్థంబనేకుల పవిత్రంబు జేసెననియు వారి వారలందరును పాత్రంబై నది గొప్ప విరివిగలది సేతువుకన్న మొదటిది ధర్మపుష్కరిణి యను చక్రతీర్థంబు దానిప్రభావం బద్భుతంబు వినిపించెద ముందు వినుండు.

## ధర్మపుష్కరిణియను చక్రతీర్థ మాహాత్మ్యము.

అనిసూతుండు చెప్పిన మహాసంతోషభరితులై మునీంద్రులు సూతా అట్టిమహాతీర్థంబునకు నామధేయంబు గల్గుటకు కారణంబేమి యని యడిగిన సూతుండు మునీంద్రులారా సేతువునకు మూలకారణంబు దర్భశయనంబు నాస్థలంబున మహాపాతకనాశనంబగు చక్రతీర్థంబుగలదు.

పూర్వకాలంబున విష్ణు పరాయణుండును వేదవేదాంత విదుండును మహాబ్రహ్మచర్యవ్రతనిష్ఠాగరిష్ఠుండును మహాతపస్వియగు గాలవుండను మహాముని దక్షిణసముద్రతీరంబున హాలాస్యంబను మీనాక్షీ సోమసుందర క్షేత్రంబగు మధురాపురికి సమీపంబున ఫుల్లగ్రామంబునకు కొంచెపుదూరంబులో క్షీరసరోవరంబునకు దాపున ధర్మపుష్కరిణీ తీరంబున మహాహ్లాదితంబగు దీక్షతో జీర్ణపర్ణాశనుండై కొన్నిదినంబులు

www.mohanpublications.com

జలాహారుండై తదుపరి వాయుభక్షణంబుచేయుచు తదనంతరంబు నిరాహారుండై ప్రణవమంత్రంబు జపించుచు పదివేల సంవత్సరంబులు ఘోరంబగు తపంబొనరించి తదుపరి అష్టాక్షరీ మంత్రంబు నారాయణు నుద్దేశించి చేసిన భగవంతుండగు నారాయణమూర్తి ప్రత్యక్షంబై సంతుష్టినొంది వరంబిచ్చెద గోరుమని పరమేశ్వరుం డానతిచ్చిన గాలవుండు సంతోషించి.

వేదాంతవేద్యా నాథా వైకుంఠవాసా వాసుదేవా త్రివిక్రమాదీనార్తిహరణా నారాయణా నీపాదంబులకనేక నమస్కారంబు లొనరింతునని స్తోత్రంబులుచేసిన జనార్దనుండు సంతోషించి చతుర్భుజంబుల గాలవుని కౌగలించి వరంబులుగోరుమని యాజ్ఞయొసంగిన గాలవముని మహాప్రీతుండై నారాయణపీతాంబరధర జగన్నాథ గోవింద నిమ్ముల బ్రహ్మనులు గానజాలరు వేదంబులు గనుగొనజాల వట్టి పరమాత్ముని పాదపద్మంబుల దర్శనంబు నాకు లభించె యోగీంద్రుల కందరాని సుందరానంద కందళితుండవైతి నాకు దురితంబు లెందుకు దేవరవారి చరణారవిందంబులపై వదలని భక్తికృపసేయుమని గోరిన పరమేశ్వరుండు సంతసించి॥

శ్రీభగవాన్ ॥శ్లో॥ మయిభక్తిర్దృఢా తేస్తు నిష్కామి న్గాలవాధునా। పతత్యారబ్ధదేహంతే మత్స్వరూప మవాప్స్యసి ॥వ॥ అనుచునివ్విధంబున భగవంతుం డాజ్ఞయిచ్చి గాలవా యీయాశ్రమంబుననే నీవు నివాసంబుజేయుము యిది ధర్మపుష్కరిణిమహాపుణ్యతీర్థంబుపూర్వకాలంబున ధర్ముండిచ్చట మహాదేవు నుద్దేశించి బహుకాలంబు తపస్సుచేసి స్నానార్థంబిచ్చట నొకతీర్థ నిర్మాణంబుచేసినందున ధర్మ మహామునిచే నిర్మించబడుటవలన ధర్మపుష్కరిణీ యనునామంబు సార్థకంబయ్యె॥

www.mohanpublications.com

తదనంతరంబున మహాదేవుండు ప్రత్యక్షుండయ్యె నతడు స్తుతించెను॥

శ్లో॥ ప్రాదురాసీత్స్వయంచాపి ప్రత్యక్షో విభాసయన్ । తదాశ్రమమనుప్రాప్తం మహాదేవంఘృణానిధిం॥ పరమసంతుష్టస్తుష్టావ పరమేశ్వరం ధర్మప్రమాణామి జగత్కర్తా,

మితీనాంప్రణవాత్మకం।సమస్తదేవతారూప మాదిమధ్యాంతవర్జితం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపం నమామ్యహం।సమస్తజగదాధార మనంతమజమవ్యయం । యమామనంతయోగీంద్రా సంవందేపుష్టివర్ధనం॥నమోలోకాధినాథాయవంచతేపరివంచతే। నమోస్తునీలకంఠాయ పశూనాంపతయేనమః। నమోరుద్రాయదేవాయజగద్రుద్రాయప్రచేతసే॥

వ॥ ఇవ్విధంబున ధర్ముండుస్తోత్రంబుచేసిన మహేశ్వరుండతిప్రీతుండై వరంబువేడుమనిన ధర్ముండుసంతసించి మహాదేవా దేవరకునేను వాహనంబుగాగలకోరిక గలిగినది గావుననేను వృషభ స్వరూపుండనై నినువహించెడి శక్తిగలిగి విలసిల్ల వరంబుకృపసేయుమని కోరిన మహేశ్వరుండా స్తోత్రంబుచే ప్రీతుండై ధర్మా యీతీర్థంబు నీచే కృతంబగుట దీనికి ధర్మపుష్కరిణి యనునామంబు జగద్విఖ్యాతియగు నీతీర్థంబులో నెవరైన స్నానంబు దానంబు సంధ్యయు జపంబుమొదలగు సత్కర్మములు జరిపినవారికి పుణ్యం బనంతంబగుననుచు వరంబొసంగి వృషభస్వరూపంబునొంది ధర్మునిపై నెక్కి కైలాసంబునకేగె.

గావున గాలవా మాయజ్ఞచే శరీరాంత పర్యంత మీధర్మపుష్కరిణీ తీరంబులో తపంబుగావించుచుండుము మునిశార్దూలా తదుపరిమాలో సాయుజ్యంబుగాగలవు నీకిక్కడ నేవిధంబులైన యాపాయంబులు సంభవించినగాని మాచక్రంబునచ్చి దుష్టనిగ్రహంబు గావించి నన్ను రక్షించగలదని శ్రీవిష్ణుదేవుండాజ్ఞ నొసంగి యంతర్హితుండయ్యె.

www.mohanpublications.com

వింటిరా మునులారా యివ్విధంబున విష్ణుదేవుండానతిచ్చిన ధర్మపుష్కరిణీకథవిని భగవంతుని యాజ్ఞప్రకారంబచ్చటనేతపంబొనరించుచు నిశ్చలభక్తుండై యుండునొకకాలంబున మాఘశుద్ధయేకాదశి దినంబున నుపవాసంబుచేసి రాత్రికాలంబున జాగరణంబుజేసి మరునాడు ద్వాదశిదినంబు నరుణోదయంబున స్నాన సంధ్యా ద్యనుష్ఠానంబులుజేసి తులసీపుష్పాదులచే కృష్ణునింబూజించి నిశ్చలధ్యానంబుతో విష్ణుస్తోత్రంబు చేసెను.

తదుక్తంస్కాందే॥గాలవః॥ శ్లో॥ సహస్రశిరసంవిష్ణుంమత్స్యరూపధరం హరిం। నమస్యామిహృషీకేశం కూర్మవారాహరూపిణం। నారసింహంవామనాఖ్యం జామదగ్న్యంచ రాఘవం। బలభద్రంచ శ్రీకృష్ణం కల్కింవిష్ణుంనమామ్యహం। వాసుదేవమనాధారం ప్రణతార్తివినాశకం। ఆధారంసర్వభూతానాం ప్రణమామిజనార్దనమితి॥ ఇవ్విధంబున ననేకవిధంబులశ్రీవిష్ణుస్తోత్రంబుసేయుచు ధర్మపుష్కరిణీ తీరంబులోనున్న సమయంబున మహాఘోరాకారుండు క్రూరుండు రాక్షసుండొకండుక్షుధార్తిపీడితుండైయనేక విధంబుల విష్ణునామస్మరణంబుజేయుచు మొరలుబెట్టిన కరివేల్పుకామొరజెవి సోకినంతమాత్రంబులో విరవీగి చరున చక్రంబు బంపినది వచ్చుటజూచి రాక్షసుండుభీతుండై పలాయనంబునొందిన చక్రంబువెంబడించి తత్క్షణంబ వానిశిరంబు ఖండించిన రాక్షసుండు మృతుండైన గాలవుండు సంతోషించి విస్తారంబుగా సుదర్శనస్తోత్రంబుజేసె.

గాలవః॥ శ్లో॥ విష్ణుచక్రనమస్తేస్తు భక్తరక్షణదీక్షిత। నారాయణకరాంభోజ భూషణాయనమోస్తుతే। రక్షమాంభయ సంవిఘ్నం సర్వస్మాదపికల్బిషాత్ ॥ వ ॥ ఇవ్విధంబున గాలవుండును సుదర్శనస్తోత్రంబు గావించిన సంతోషించి గాలవావెరవకు యీధర్మపుష్కరిణి దేవీపట్టణపర్యంతంబుమునుపుధర్మునిచే నిర్మింపబడియుండే నేనంతపర్యంతం తీర్థంబును రక్షించుచుండుదు నంతవరకుతీర్థంబునకు చక్రతీర్థంబని పేరు.

www.mohanpublications.com

హితంబుగావున వ్యర్థంబుగాదు మీరు స్వర్గంబునకు బోవలయు వీను పది యారుసంవత్సరంబులు రాక్షసుండై క్రూరుండై సంచరించుచు చక్రతీర్థ సన్నిధానంబున గాలవమునిని భక్షింపబోయి గాలవస్తోత్రప్రీతుండగు రమానాథుచే ప్రేరేపించిన చక్రంబుచే భిన్నశిరస్కుండై నిజస్వరూపంబు ధరించి దివంబునకేతెంచి మిమ్ముఁబొంది సుఖించుచుండనని వచించిన నిరాశులై పతినిం గౌఁగలించుకొని రోదనంబులు జేయుచు స్వర్గంబునకు పోయిరి.

అంతట నాగంధర్వుండు వికృతాకారుండు మహాదుష్టుండుడు రాక్షసుండు మహానిర్దయుండై సంచరించుచు చక్రతీర్థసమీపంబున తపం బొనరించు గాలవునిభక్షించబోయి చక్రంబుచే ఖండితమస్తకుండై దివ్య దేహధారియై విమానారూఢుండై సంజలిబద్ధుండై చక్రంబును స్తోత్రంబు సేయుచు నాకాశమార్గంబున దుర్ధరుండు స్వర్గంబునకేగెనని చెప్పిన యాశ్చర్యంబునొంది చక్రతీర్థప్రభావంబు చెప్పశక్యంబుగాదు మాహాత్మ్యంబు సూతా దేవీపట్టణపర్యంతంబు విస్తీర్ణంబైన చక్రతీర్థంబే విధంబున విభక్తంబయ్యె జెప్పుమని యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున పర్వతంబులు రెక్కలుగలవై హిమగిరిప్రజాక్షోభంబు గావించిన దేవేంద్రుండలిగి పక్షచ్ఛేదనంబులు సేయుటచే నదిరి పర్వతంబులు సముద్రప్రవేశంబులగుటచే చక్రతీర్థంబు నిండి విభక్తంబయ్యె.

ఇదిగాక నీచక్రతీర్థంబులో విధూముండనువసువు బ్రహ్మచే శప్తుండై మనుష్యయోనియందుజనించి భార్యయుతాను స్నానంబుచేసి పవిత్రులైరని చెప్పినను సూతా యావృత్తాంతంబు మాకువినుపించుమనియడిగినమునులారా పూర్వకాలంబుననొకనాడు బ్రహ్మదేవుండు సత్యలోకంబులో సావిత్రీసరస్వతి సహితుండైన సనకసనందన సనత్కుమార నారదాది మునిజనంబులు సేవింప సిద్ధవిద్యాధర గంధర్వాదిగణంబులు నష్టవసువులు గొలువ నూర్వశీప్రముఖసర్వవేశ్యలునాట్యమాడ నిండుగొలువలో

www.mohanpublications.com

నుండ నలంబునాయను నప్సర స్త్రీ బహువిలాసంబుతో సాష్టాంగంబుచేయు చుండ వాయువశంబున వస్త్రంబుదొలిగిన మానుషమూలంబు ఎదుటై గానవచ్చిన సర్వజనులు ముకుళిత నేత్రులై యుండిరి.

అప్పుడాయువతిం జూచి విధూముండను వసువు హర్ష పులకాంకితశరీరుండై కామాతురుండై జూచిన బ్రహ్మగనుగొని నీవు లోలుండవు గాన మనుష్యయోనియందు జనియించుము ఈయువతియును మనుష్య స్త్రీయై నీకుభార్యయగును, మీరిద్దరు బహుకాలంబు సుఖించి ప్రభుత్వంబుచేసి లోకవిశ్రుతుండగు కొడుకును గని పుత్రునికి రాజ్యాభిషేకంబుచేసి మీరిరువురు చక్రతీర్థంబులో స్నానంబాచరించి ముక్తులగుదురని బ్రహ్మశాపాంతంబును కృపచేసె.

ఆవిధంబున వారుమనుష్యులై కౌశాంబీ నగరంబులో ప్రభుత్వంబుజేసి చక్రతీర్థస్నానంబున పవిత్రులైరని చెప్పిన సంతోషించి సూతా చక్రతీర్థంబు దేవీపట్టణ పర్యంతంబుగలదని చెప్పితివి ఆపట్టణంబునకా నామంబెట్లు సంప్రాప్తంబయ్యె నాకథావిస్తారంబు వినుపింపుమని యడిగిన మునులారా శ్రీరామచంద్రుండు సేతుప్రారంభకాలంబున నవగ్రహస్వరూపంబులగు నవపాషాణంబుల నెచ్చట ప్రతిష్ఠచేసెనో యక్కడనే చక్రతీర్థంబునకు చివర.

అక్కడా తీర్థంబులో స్నానంబుజేసి నవపాషాణ దర్శనంబుల జేసినవారికి సకలకార్య దిగ్విజయంబును పుణ్యలోకంబులు గలుగుట సందేహంబు లేదు.

ఆపట్టణంబునకు దేవీపట్టణంబని నామం బందుకు వచ్చినదనిన.

www.mohanpublications.com

పూర్వకాలంబున దితిపుత్రుల దేవతలయాలోచనచే విష్ణుదేవుండు జంపిన దని దుఃఖించి తన బిడ్డతో జెప్పుమని బిడ్డా దేవతల దుర్మార్గంబుచే విష్ణుని వివిధంబున జరిగించెను. ప్రభుత్వంబు దేవతలపాలాయెను నీవు తపంబుగావించి ప్రబలుండగు కొమారుని బడసి వానిచే దేవధ్వంసంబు గావింపుమని యనేకవిధంబుల నేడిన దితిపుత్రిక మహిషరూపంబు దాల్చి ఘోరంబగు తపంబు గావించిన సుపార్శ్వుండను మునిని సంతోషించి నీకోరిక ప్రకారంబున సకలదేవతానాశకుండును మహాబలవంతుండగు పుత్రుండు జన్మించును.

వానికి ముఖంబు మహిషముఖంబును శరీరంబంతయు మనుష్యాకారంబునై యుండును వానికి మహిషాసురనామంబు సార్థకంబు పొమ్మని చెప్పిన తదుపరి వరప్రసాదంబున మహిషాసురుండు పుట్టిన విప్రసిద్ధ కుమారుండగు విద్యున్మాలి మొదలగు రాక్షసులీకథనిని మహిషాసుర నీవు వరప్రసాద పరాక్రమ ప్రవీణుండవుగాన దేవతలు సుఖంబుగా స్వర్గరాజ్యంబనుభవించుచున్నారది మనమాక్రమించకనుండిన నీబల తేజస్సాహసంబులకు వినియోగంబేమని కోపంబెక్కించిరి.

అంతట వాడు రాక్షససమూహంబుతోగలిసి స్వర్గంబుపై దండెత్తిన దేవదైత్యులకు నూరువత్సరంబులు ఘోరయుద్ధంబైన దేవతలోడి స్వర్గంబువిడిచి దీనులై బ్రహ్మకడకుజని తమకష్టంబు చెప్పుకొన్న బ్రహ్మకు సాధనంబుతోచకను మారమాపతులున్న యడవికేగి దేవతలబాధలుబోధజేసిన హరిహరులిద్దరు మహాక్రోధతామ్రాక్షులై యాకాశముపై జూచిన నత్యంత క్రోధదుర్ధరమగు విష్ణుముఖంబుచే నొకతేజస్సు వెడలె.

వెంటనే శివముఖంబుచే నొకతేజస్సు వెడలె నంతట బ్రహ్మమొదలగు దేవేంద్రాది దేవతలెందరో నందరి ముఖంబులనుండి యొక్కొక తే

www.mohanpublications.com

జన్ము బయలుదేరి యా తేజస్సమూహంబు మేరుపర్వతము భంగి యాకాశంబు నుట్టిముట్టి యుండ నందుండి వేరు స్త్రీస్వరూపంబు నిర్మించెను.

అదెట్లనిన శంభుతేజంబున ముఖంబును విష్ణుతేజంబున భుజంబులు బ్రహ్మతేజంబున చరణంబులు ఇంద్రతేజమున నడుము మధ్యమునై యమతేజమున కేశంబులు చంద్రతేజంబున కుచంబులు వరుణతేజంబున జంఘోరువులు పృథ్వీతేజంబున నితంబంబు సూర్యతేజంబున పాదాంగుళులు వసుతేజంబుల కరాంగుళులు కుబేరునితేజంబున నాసిక ప్రజాపతుల తేజంబుల దంతపంక్తు లగ్నితేజంబున నేత్రద్వయంబును వాయుతేజంబున స్కంధ భ్రూశ్రవణ యుగళంబులయ్యె. ఇతర దేవతల తేజస్సులచే సమస్తావయవ పరిపూర్తియై మహాజ్వాలజ్వలమాన తేజోవిరాజితయై యొకదేవి వెడలి మహిషాసుర మరణకారణంబై యీ మహాదుర్గాదేవి యుద్భవించిన దని దేవతలఖండంబగు సంతోషంబునొందిరి.

తదుపరి ఈ దేవికి వస్త్ర ధనవస్త్రభూషణాదులు సమర్పించిన సమస్తభూషణాలంకారభూషితయై మనోహరాకారంబుతో నతిభీషణంబగు నట్టహాసంబుగావించి సకలలోకంబులు కంపంబులొందె పరిచారకలందరు నంజలిబద్ధులై యెదుటనిలిచిరప్పుడు రుద్రాది దేవతలందరు స్వకీయంబులగు నాయుధంబులలో శూలాది సాధనంబు లొక్కొక్కటి యొసంగిరి.

అంతట నాయుధంబులు గ్రహించి సింహవాహనారూఢయై సుర ముని విద్యాధర గంధర్వాది దేవబృందంబు జయజయపూర్వక స్తోత్రంబులు జేయుచుండ నప్పుడు మహాప్రళయ ఘోషభీకర సింహనాదంబు జేసిన దైత్యులువిని మూర్ఛిల్లి కొందరు దప్పునకు ధైర్యంబులు దెచ్చికొని యాయుధంబులు గైకొని మహిషాసురుని ముందునిడుకొని యుద్ధసన్నద్ధులై నిలిచి భైరవనాదంబు లొనరించుచుండిరి.

www.mohanpublications.com

అనంతరమా దేవి త్రిలోకవ్యాప్త తేజోవిశిష్టయై నాదకంపిత స్వర్గ మర్త్య పాతాళయై మహాభీషణాకారయై నిల్చిన మహాసంకుల సమరంబయ్యె నప్పుడు లక్షకోటి సహస్ర పరిమితులగు రాక్షస నాయకులొక్కపెట్టున దేవిపై నడరి చుట్టిముట్టి బాణవర్షంబు గురిపించిన నద్దేవి చలింపక నా బాణంబుల తన బాణపంక్తిచే ఖండంబులుజేసి దైత్యుల శరీరంబులు ఖండంబులుగావించె నా ప్రచండాఖండంబులు చండిక బాణ పాతంబులకోర్వక రాక్షసులు పలాయనంబునొందిరి.

పిమ్మట నసురులనిర్మూలనంబుగావించి మహిషాసురుడు క్రోధ సంరక్తలోచనుండై చాపంబుగైకొని దేవేంద్రునిమీద దశసహస్ర బాణంబులును యమునిపై పంచసహస్రంబులుబరపిన దేవకోటిలో నొక్కొక్కనిపై పదేశవేల లెక్కచే నందరిపై బాణంబులు బరగించిన దేవతలందరు భీతులై మహిషాసురు నెదురునిలువజాలక పలాయనులై మహాదేవిని శరణంబుజొచ్చి రప్పుడు భద్రకాళి మహాసారవంతమగు శరాసనంబుగైకొని యతనిసమానమగు బాణంబులు బరగించినమహిషాసురుని మంత్రులు, మహానాదుండును, సుచక్షువు, మహాహనుండును మహాచంద్రుండును, మహాభక్షుండును, మహోదరుండును, మదోత్కటుండును, పంచాస్యుండును, పాశచూడుండును, బహునేత్రుండును, ప్రబాహుడును, యేకాక్షిక పాద బహుపాదులు మొదలగువారు యుద్ధసన్నద్ధులై జగదంబకెదుటనిలిచిరి.

అంతట దేవివారిని కాలాగ్ని రుద్రనేత్ర సదృశంబులగు నేత్రములతో చూచి వజ్రసమానంబులు కాంచన పుంఖితములగు శరములు విగుడించి యామమాత్రములో నందరిని రూపుమాపినచండకోప, బాష్కళ మదోన్మత్త, ప్రభృతిసేనానాయకులు వచ్చినవందరిని క్షణంబులో యమాలయంబునకనిపిన మహిషాసురుండు క్రోధయుక్తుండై

www.mohanpublications.com

ప్రళయకాలయముఁడునుఁబోలె సైన్యంబులదూలదోలి దేవీ వాహనం బగు సింహంబును హరింప నిశ్చయించి సన్నద్ధుఁడై పైకివచ్చె.

ఆమహాదేవి కోపోద్దీపిత మానసయై ప్రచండమగు ఖడ్గంబు గైకొని బరిమూర్చ సింహంబుసడరించిన మహిషాసురుఁడును సింహస్వరూపుఁడై నెమర్కొనియెఁ నప్పుడు దేవి వాని పాశబద్ధునిఁగావించిన ఖడ్గహస్తుఁడయి యెదుటనిలిచె నప్పుడు దేవి బాణవర్షంబు గురిపించి వాని చీకాకు పరిచిన బెదరి గజస్వరూపుఁడయి పైకురికిన దేవీ వాహనమగు సింహంబు వానిశరీరంబు ఖండంబులుజేసిన నప్పుడు మనుష్యరూపుండైన దేవి ఖడ్గంబుచే వానిబాహువు నరికిన వాఁడు నిజస్వరూపంబు గైకొని శైలశృంగంబులతో సరియగు తనశృంగంబులు విదళించుచు పైకివచ్చెను.

ఓరాక్షసాధమా నేను మధుపానము జేయు నింక నీగర్వంబును మాపుచుండుమని యదల్చుచు క్షీరపానంబునరించు కృపాణంబుచే బూనినవాఁడు కార్యవశీకుఁడయి పలాయనుండయిన జగదంబ సింహము నురికించి నిబిడతరంబగు ముష్టిప్రహరంబు గావించిన వాఁడు నిర్దళిత హృదయుఁడయి మహాభయపరిభ్రాంతుండయి ధైర్యంబుజాలక దక్షిణ సముద్రతీరంబున మహాలాకధిప్రాంతంబునకు పారిపోయెను.

దేవియు మహావేగముతో సింహంబు నురికించిన నిలువజాలక దశయోజనాయామమగు ధర్మపుష్కరిణిలో దేవీపట్టణ సమీపంబున నంతర్హితుండయిన భద్రకాళీదేవియుఁగూడ నురికిచూచిన మహిషాసురుఁడు గానరాక యుండిన నాలోచించుచుండ నాకాశవాణి యోజగన్మాతా ఈ సన్ముష్టి ప్రహారంబుచే వాఁడు వెరచి ప్రాణరక్షణ తత్పరుండై ధర్మపుష్కరిణీజలంబులో దాగియున్నవాఁడని పల్కవినవచ్చెను.

www.mohanpublications.com

అందుకాహె సంతసించి తన వాహనమగు సింహంబున కాజ్ఞాపించిన నది క్షణంబులో పదియామడవెడుపుగల జలంబుపానంబు గావించె సలిలంబు నిశ్శేషంబయిన గాంక్షునుండు దీనుండయి వచ్చుచున్న మహిషాసురుంగని దేవిశూలంబుచే బొడిచి భూమిపైఁబొర్లించి శిరంబు పాదంబుచేఁద్రొక్కి కృపాణంబుచే శిరంబు దెగఁగ్రేసిన మృతుండయ్యె నప్పుడు దేవవిద్యాధర కిన్నర కింపురుషాది దేవసంఘంబులు మహానంద భరితులై మహాదేవిని స్తోత్రము లనేకవిధంబులజేసిరి.

అప్పుడా దేవేంద్రాది దేవతలు దేవియాజ్ఞాప్రకారంబున నమృతంబుతో ధర్మపుష్కరణికింసిరాసమీపంబున తననామంబుతో దేవీపట్టణమని యొక్కగొప్పపురము నిర్మాణంబుగావించె నందుచే నది దేవీపట్టణమని ప్రసిద్ధమయ్యె.

తదుపరి శ్రీరామచంద్రుండు సేతుబంధన తత్పరుండయి మంచి ముహూర్తమున విఘ్నేశ్వరపూజ లొనరించి తిలకస్వామి పూజ లొనరించి నమస్కరించి నవపాషాణంబులు స్వహస్తంబుచే స్థాపించె నక్కడ స్నానంబుజేసినవారికి పాపక్షయమగుటకు సందేహంబులేదు సత్యమ్ సత్యమ్ పునస్సత్యమ్.

తదుక్తమ్ స్కాన్దపురాణే సేతుమహాత్మ్యే॥ దేవీపట్టణమారభ్య సుముహూర్తే దినేద్విజాః। విఘ్నేశ్వర ప్రణమ్యామి తిలకస్వామి నమ్తథా। మహాదేవ్యాభ్యనుజ్ఞాతో రామచంద్రోతి ధార్మికః స్థాపయిత్వాస్వహస్తేన పాషాణనవకంయథా। సింహాసనం సమారుహ్య రామోనలంకృతంశుభం వానరైః కారయామాససేతుమబ్ దాజలాదిభిః।దశయోజనవిస్తీర్ణమ్। శతయోజనమాయుతమ్। సేతోశ్చపశ్చిమాః కోటిర్దర్భ

www.mohanpublications.com

శయ్యాప్రకీర్తితా । మహ్లాపురీచ ప్రాక్కోటిర్దర్భశయ్యా ప్రకీర్తితా ॥ దుర్గాపురీచ ప్రాక్కోటి రఘయుమ్ సేతుమూలకమ్ । దేవిపురేతిభాదర్భశయ్యాయామపిభూసురాః । చక్రతీర్థేశివేస్నానం పుణ్యం పాపవినాశకమ్। స్మరణాదథయత్రాపి చక్రతీర్థస్యవై ద్విజా। భస్మీభవన్తిపాపానిజన్మలక్షార్జితాన్యపి। జన్మాంతరవిలయంయాతి ముక్తిశ్చాపికరేస్థితా । చక్రతీర్థసమం తీర్థం భూతిలేనభవిష్యతి । క్షేత్రేపిండంతతః కుర్యాచ్చక్రతీర్థేతథైవచ ॥

ఇవ్విధంబున దేవిపట్టణమున దర్భశయనమున స్నానదాన పిండ ప్రదానాది సత్కార్యంబులు జరిగించి

శ్లో॥ రఘువీరపదన్యాసపవిత్ర కృతపాంసవె। దశకణ్ఠశిరచ్ఛేదహేతవెసేతవెనమః । సేతవెరామచంద్రస్య మోక్షమార్గైకహేతవె । సీతాయామానసాంభోజభానవెకామధేనవె ॥

శ్లో॥ సాష్టాంగప్రణిపత్యాదౌ మంత్రేణానేనసై ద్విజాః । శ్వేతాశ్వవరదంతీర్థం తతోగచ్ఛేన్మహాజలమ్ ॥

మునీంద్రులారా యీశ్లోకంబులు జదివి సాష్టాంగప్రణామంబాచరించి పిదపశ్వేతాశ్వ వరదతీర్థంబునకు బోవలయు నిక్కడికి చక్రతీర్థ మాహాత్మ్యంబు సంపూర్ణము.

శ్లో॥ యోధ్యాయమేనంపఠతే ద్విజేంద్రాశ్శృణోతివాభక్తియుతో మనుష్యః । స్వర్గాపయాతస్యనదుర్లభాస్యుఃరికైవల్యమపవరకరస్థమేవ ॥

ఇవ్విధంబున చక్రతీర్థంబులోస్నానంబు జేసినవారికి కైవల్యంబు లభించును.

www.mohanpublications.com

## శ్వేతాశ్వతరద తీర్థమహాత్మ్యము.

మరియు చక్రతీర్థకథవిని సంతోషించి సూతా చక్రతీర్థంబునకు దక్షిణంబున శ్వేతాశ్వతరదంబను తీర్థంబు గలదని జెప్పితివా తీర్థం బెచ్చటనాతీర్థోద్భవ కారణంబెట్లు నావృత్తాంతంబు సవిస్తరంబుగా జెప్పుమని యడిగిన సంతోషించి మునీంద్రులారా పూర్వకాలంబున పార్వతీదేవికి పరమేశ్వరుండు జెప్పె నాకథ మీకువినుపింతు సావధానచిత్తులరై వినుండు.

పూర్వకాలంబున గాలవుండను మహర్షి పరబ్రహ్మోపాసన జేసి మహాధన్యుండనై తివి కన్యక కాంతిమతియను చిన్నది బహుయోగ్యురాలు పితృసేవ సేయుచు నాశ్రమంబులోనుండి దేవతార్చనకు పుష్పంబులుగోయు కొరకు వనంబులో దిరుగుచు వెదకుచుండ నింతట సుదర్శన సుకర్ణులను వారలిద్దరు గంధర్వ పుత్రు లాకాశమార్గంబున విమానారూఢులై సంచరించుచు నాసమయంబున గాలవపుత్రిని మహాసౌందర్యశాలిని లావణ్యవతినిజూచి మోహించి మనస్సు నిలుపజాలక విమానంబునుంచి దిగి యోకన్యకా నీవెవ్వరి కూతురవు నీ పేరెయ్యదీయరణ్యంబులో నొక్కరైవు సంచరించుటకేమి హేతువ జెప్పుమని యడిగెను.

అయ్యా నేను గాలవమహాముని తన యనుకాంతిమతియని నా పేరు, దేవతార్చనంబుకొరకై పుష్పంబులు గోయుచున్నానని జెప్పినవిని నేను గంధర్వపుత్రుండను సుదర్శనుండను నాపేరు నీయందు నాకు మక్కువ గలిగినది నిన్నువరించవలయునని యడిగిన నాచిన్నది మీరు దేవతలు మీరెరుగని ధర్మంబులు లేవు కన్యక లస్వతంత్రలుగాన తండ్రి యెవ్వరికిచ్చితె వారు నాకు పతియగు మాతండ్రిగారి నడుగవలయును పూజాకాలంబు మిగిలినది పోవలెనని చెప్పెను.

www.mohanpublications.com

దెచ్చి జ్వాలగావింపుమనుచు దీనుండై దుఃఖించిన తండ్రిగ్రామం బంతయుదిరిగి పుత్రా గ్రామంబెల్ల ద్రిమ్మరితి నర్ధరాత్రియెక్కడ నగ్ని హోత్రంబు దొరకలేదని చెప్పిన వినక నాక్రోశించి చూచి యోతండ్రీ యదిగో నగ్నిహోత్రంబాకాశంబుముట్టి మండుచున్న దందులో నింత జ్వాల దెమ్మనిన పుత్రా యది శవగహనజ్వాల చితాగ్నియ పవిత్రంబు గాన నంటగూడదని జెప్పెను.

తండ్రీ యగ్నిహోత్రంబున నంటున్నబా లేదని తాను లేచి నడిచిన తండ్రియును గోవిందస్వామియు వెంటనంటపోయె. నిద్దరు చితాగ్నిదాపునపోయి కూర్చుండి శీతబాధ తీరినపిమ్మట శిరోభాగంబుకై కూర్చుండి నాయనా యిది గుండ్రటిమంట మహాతేజస్సుగలిగి యత్యుగ్రంబై రక్తంబుపగిది నెఱ్ఱనై వెలుగుచున్నది దేమనిన తండ్రి జూచి తనయా యది కపాలంబున తాకిన మాంసరక్తాది మిళితంబై రక్తతమలంబురీతిని మండుచున్నది. దానికి నీవు దూరంబుగానుండుమని తండ్రిజెప్పియు వినక స్ఫోటంబగు కాష్ఠంబుచే బొడిచిన రక్తంబును మెదడును స్రవించుటచే మంటయెక్కుడైన నావిడయదత్తుండు రెండు చేతులనెత్తి యీజ్వాలపానముచేసి తండ్రిజూచుండగానే నచట కుటిల కఠినమహాజ్వాల భీషణాకారుండై భూనభోంతరాళంబులు బగుల భయంకరారావంబుజేసి మహాదంష్ట్రలు నవ్వులుచు నాకాశంబుపై కెగిరి భేతాళ స్వరూపంబునొంది భూమిపైకివచ్చి తండ్రిని గబళింప బోయిన మహార్తినొంది యేడ్చుచున్న వలదువలదని యాకాశవాణి వార్త వినబడ్డ తండ్రినొదిలి మహావాయువేగంబున నతిక్రమించి నట్లాకాశంబు కెగిరి భేతాళబృందంబులో గలిసినవారందరితని పూర్వోత్తరంబు పరీక్షించి కపాలస్ఫోట భేతాళనామము నిర్ణయించిరి.

అందుపై యీతడు విజృంభించిన నాస్థిభూషణుండను భేతాళ రాజుతో గలిసి తనప్రాబల్యంబు గనపరచిన సంతోషించి సేనానాయకునిగ

www.mohanpublications.com

జేసిన యనేకయుద్ధంబులలో నుద్ధండుఁడై మెప్పునొందుచునుండె. అంగట చిత్రసేనుండను గంధర్వునితో యుద్ధసన్నద్ధుఁడై ఘోరయుద్ధములోన నాస్థిభూషణుఁడను భేతాళరాజు ప్రాప్తిపొందిన నికపాలస్ఫోట [illegible] పీఠంబు నధిష్ఠించి తానురాజై నిలిచెనని చెప్పిరి.

సూతా! యాతని తల్లిదండ్రులు భార్యయు నేమైరనియడిగిన వారును లారా! యతఁడాకాశంబునకు నెగిరిపోయిన పిమ్మట తండ్రి దుఃఖించుచు శయస్థలంబునకువచ్చి భార్యకు రెండవ కుమారుండగు నశోకదత్తున కీవృత్తాంతంబు తెలియ వినిపించిన వారందరు మహాదుఃఖాక్రాంతులై యుండ కాశీక్షేత్ర నివాసుఁడగు సముద్రదత్తుండను నొకవైశ్యరత్నంబు వారినిజూచి దుఃఖోపశమన వాక్యంబులు చెప్పి తన యింటికి దోడ్కొని పోయి వారిని సంరక్షణజేయుచు కొన్నిదినంబులకు తనధనభాండా గారంబులకు గోవిందస్వామిని ముఖ్యకార్యకర్తగా నొనర్చి సమస్త కార్యంబు లతనిచే నడిపించుచుండెను.

అనంతరము తన రెండవకొమరుం డశోకదత్తుండు శస్త్రశాస్త్ర ప్రవీణుండై మల్లయుద్ధంబులయందుండై విఖ్యాతుండైన నంతలో కాశీ దేశాధీశ్వరుండగు ప్రతాపముకుట మహారాజునికడకు ప్రచండుండను నొకమల్లుండువచ్చి ద్వంద్వయుద్ధంబుగోరిన నారాజతని బిలిచి ద్వంద్వ యుద్ధంబున గొప్పించిన బహుసంతోషంబుతో సవ్యాపసవ్యంబుల కేశా కేశి ముష్టాముష్టి బాహాబాహి ప్రభృతి మల్లయుద్ధంబులో ప్రవీణుండయి యామల్లుని బడగొట్టిన రాజు మహాశ్చర్యము నొందిన ప్రాణతుల్యు నిగాజూచుచు సమస్తకాలంబుల తనసన్నిధానంబులో వసలతుండెను.

మరికొన్ని దినంబులకు గ్రామంబునెలుపల సాయంకాలంబున విహరించుచు పాదచారియై యశోకదత్తుడు దానును సంచరించుచుండ నాలుదిశలనుండి శూలహస్తుండనై ప్రాణంబులకై తృష్ణాపీడితుండనై

www.mohanpublications.com

యున్న నాకు శీతలజలంబిచ్చు పుణ్యాత్ములెవరని గానన్నైతినని యాక్రోశించు దీనధ్వనివినబడెను దానికారాజు కరుణాదరణీయ హృదయుండై చాలనొచ్చుకొని యశోకదత్తా నీవు మహాధైర్యశీలుండవు బ్రాహ్మణుండవు దీని నరయుటకర్తవ్యము నీవే యాతనికష్టముదీర్చి రమ్మని వినయముతో జెప్పిన రాజాజ్ఞశిరసావహించి తత్క్షణమేగి జూచిన శ్మశాన వాటికలో భూతప్రేత భేతాళసంకులస్థలంబున శూల పోతునిం గాంచి జలంబిచ్చు నుపాయము జూచుచుండెను.

ఆసమయములో నాశూలంబుక్రింద నవయౌవనశాలిని సుందరాంగిని రతీదేవిని మించిన కాంతిగలుగు నొకస్త్రీనిజూచి ఓసుందరీ యీశ్మశానవాటికలో నొంటిగా నంధ్యాకాలంబునయుండితి నీ వెవ్వరు నీపేరేమని యడిగిన నోశూరా యీశూలస్థుడు నావల్లభు డితనిరాజు శూలస్థాపితుని గావించె నితని నొగలజాలక దుఃఖించుచున్నదాన మాటిమాటికి దాహంబునకు నీరడుగుచుండిన నుదకమందివ్వ శక్తిజాలక దుఃఖించుచున్నానితని ప్రాణంబులుబోవు, నేను జలంబులు బోయజాల ననుచు వ్యథపడుచుంటిననెను.

ఓతల్లీ నాభుజంబుపై నీవెక్కి జలము లతనికందివ్వమని జెప్పి నంతలో బహువేగమున స్తంభమువలె నిలిచియున్న నతని స్కంధముపై నెక్కి జలములందించి సమయములో రక్తంబు స్రవించిన యశోకదత్తుండు దానిముఖంబుజూచి రాక్షసిగానెరిగి దీని విడవగూడదని దానిపాదమునయున్న నూపురము తనహస్తమున బిగబట్టిన నాసుందరి నూపురంబులోనుంచి పాదంబూడల్చుకొనిపోయిన ననేకరత్నచిత్రితమగు నామాపురంబు గైకొని రాజువద్దకివచ్చి యావద్వృత్తాంతంబు విన్నవించిన మహాశ్చర్యంబునొంది దేవతలైన నిట్టి సాహసంబులు జేయజాలరని మన్నించి యామాపురంబు తనవద్ద నుంచుకొనెను.

www.mohanpublications.com

తదనంతరము మగని రేఖయను తనగూతురునిచ్చి వివాహంబు జేసి సుఖంబుగానుంచి కొన్నిదినంబులకు నల్లునిబిలిచి యీనూపురము నకు జతిజోడైన నూపురంబెన్ను లభ్యంబౌనని యిష్టాగోష్ఠిలో నాలో చించిన నశోకదత్తుండు చింతించి యిది శ్మశానవాటికలో నాస్త్రీయిచ్చిన దొకటది దీనికి సమ్మతంబెక్కడ దొరకునని విచారించి శ్మశానవాటికలో మనోహరమగు మాంసమునిమ్మీతనని మాంసాశిను మునుపటి యుద్ధియు నేగుదెంచు నప్పుడా నూపురంబుహరించు సాధనంబు గావించవచ్చునని మహాధైర్యంబుతో భూతప్రేతపిశాచ భేతాళాదుల తృణీకరించి సాహసంబుతో నామె విక్రయంబుజేయుచుండి దిక్కులు పిక్కటిల్లునట్లు మంచి మాంసంబు గొనుచుండని చాటంబుజేసెను.

భేతాళంబులన్ని గుమిగూడివచ్చుచుండ నారాక్షసియువచ్చి యిచ్చిన నొకపాదంబున నూపురముండుటచే యానువాని ముదిగిలి యాచే డియా మునుపొక్క నూపురం బోగొట్టితివి దయచేసి రెండవయందే నివ్వుమనియడిగిన యామాటలువిని భీతిచి తొలగి యేమాటా బొమ్మని యానూపురంబొసగి విస్మృత్పృద్ధయము తనకుమారును వొక్క హేమకమలంబునుమొనగిజనిన నావిప్రసుకుమారుడు కన్యాసహితుండై నూపురంబు గైకొని పట్టణంబునకువచ్చి కథా వృత్తాంతమంతయు సత్యసూచకముల నెఱిగించిన రాజు పరమానందభరితుండై యల్లుని పరాక్రమంబున కచ్చెరువందుంచు మహాస్తోత్రంబుచేసె.

మఱియు కొన్నిదినంబులు జరిగినపిమ్మట యశోకదత్తుండు నెలి యా యీసువర్ణకమలంబు నీయత్తగారి కెక్కడిదోనికె నీపుట్టుకస్థలం బునందున్నవి నా కెఱిగింపుమనియడిగిన నోనాయకా యీహేమకమలంబు కపాలస్ఫోటన భేతాళనాయకుని జలక్రీడా సరోవరంబులో మాయమ్మ యక్కడికిబోయినప్పుడు దెచ్చినదనిచెప్పిన నోప్రియురాలా నాపరమ్మనే జూడ నిశ్చయించితి నన్ను దోడ్కొనిపొమ్మని బహువిధంబులబీడనంబు

www.mohanpublications.com

జేసిన సంతోషించి తనభర్తయగు యశోకదత్తుని నాకపాలస్ఫోటన భేతాళనాయక జలక్రీడాసరోవర సమీపంబులకు దోడ్కొనిపోయెను.

నతండా పాదపద్మంబులు గ్రహించ నిశ్చయించిన నక్కడి కావలి యున్న భేతాళాదులు వెరపించి బెదరించవచ్చిన నందర నీయశోక దత్తుడు దురంతంబులగు తాడనంబులుజేసి విచ్ఛిన్నులంజేసిన విని కపాల స్ఫోటభేతాళనాయకుడు గొబ్బునజనుదెంచి యశోకదత్తుని నిగ్రహింప సమకట్టిన నతండు విజృంభించి నీసైన్యంబునుజంపిన విధంబున నిన్ను జంపుదు జూడుమని సన్నద్ధుండై కపాలస్ఫోటన భేతాళనాథునిబట్టి నిర్బంధించి జంపనిశ్చయించెను.

అంతలో నచ్చటికి విజ్ఞప్తికౌతుకుండను గంధర్వపతి విమానా రూఢుండై వచ్చి యోయశోకదత్తా సాహసంబు జేయకుమని నివారించిన నాకాశస్థుండగు విద్యాధర నాయకునింగాంచి నశింపబోవునంతలో శాప విముక్తుండై మానుషస్వరూపంబువిడచి దివ్యరూపంబునొంది విమానా రూఢుండై సకలభూషణ భూషితశరీరుండై నిలచినజూచి విజ్ఞప్తికౌతు కుడో విద్యాధరకుమార మాదర్శనంబున నీకు శాపాంతంబు గలిగె గావున నీవు స్వర్గంబునకుబొమ్ము నీయగ్రజుండగు నితడు మహాపాతక మొనరించె గావున గాలవశాపంబు దుస్తరంబు కొంతలో నితనికి శాపాం తంబుగాదిరదని జెప్పిన శాపవిముక్తుండగుటచే పూర్వజ్ఞానంబు నొంది వృత్తాంతమంతయు జ్ఞప్తిచేసుకొని సుకర్ణుండిట్లనియె.

ఓవిద్యాధరోత్తమా మదియ్య జ్యేష్ఠభ్రాతనొదిలి నేనొక్కరుడ స్వర్గంబునకు బోనొల్లనని యనేకవిధంబుల స్తుతించిన యాతం డాలో చనగావించి దుర్నివారణ మగు నా శాప మోక్షణంబు సేయ నెవరికి శక్యంబుగాదది మహాత్తరమగు పాపంబు దానికి సారంబు దొరకదైన నొక్కయుపాయంబుజెప్పెద దక్షిణోదధితీరంబులో చక్రతీర్థంబుమాహా

www.mohanpublications.com

త్తమంబగు తీర్థంబుగలదు అతీర్థ దర్శన మాత్రంబున సకల పాపములు నశించునని చతుర్ముఖుండు సనత్కుమారాది మునీశ్వరులకు చెప్పెను, కావున నాతీర్థంబులో స్నానంబుజేసినవారికెంత ఫలంబుసంభవించునో నాకు తెలియదు గావున నీయుగ్రజుండచ్చటికిబోయి దర్శన స్నానంబులు జేసిన నీయుగ్రజునకు భేతాళనివృత్తియై విద్యాధరుండగునని నతడు విజ్ఞప్తికాతుకుని వెంబడించుకొని తనయుగ్రజుడగు సుదర్శనుని దోడ్కొని దక్షిణసముద్రప్రాంతంబునకుంబోయి గంధమాదనపరువత చక్రతీర్థంబు లోనుండు తీర్థంబునకుజేరి కూర్చుండి యీయుగ్రజా గాలవముని శాప ముక్తికొరకు నీతీర్థంబులో నవగాహనంబు సేయుమని పలుకుచుండెను.

అంతలో దైవానుగ్రహంబున నాయుగ్రజుని యొక్క వశీకరంబు కపాలస్ఫోటభేతాళనాయకుని శరీరంబుప్పు బడిన భేతాళుడు తపంబుమాని విజయదత్తుండనే బ్రాహ్మణస్వరూపంబునొంది దానంతట పునః యథా శాస్త్రవిధిసంకల్పంబుతో స్నానంబుచేసిన బ్రాహ్మణనిగ్రహంబుబోయి తత్క్షణంబున దివ్యస్వరూపంబునొంది విమానారూఢుడై సకలాభరణ భూషితుండై తేజోమయస్వరూపముతో దేవస్త్రీసమూహ పరివృతుండై విజ్ఞప్తికాతుకుని చక్రతీర్థంబును ననేకవిధంబుల స్తోత్రంబుచేసి తన తమ్ముం డగు సుకర్ణుని దోడ్కొని స్వర్గంబున కరిగె. నాతీర్థమంబు భేతాళవరద మని ప్రసిద్ధినొందె.

ఎవరుసైన నాతీర్థరాజంబులో స్నానంబుగావించిన పుణ్యుండై జీవన్ముక్తుండగు నచ్చట పిండప్రదానంబుచేసిన వారిపితృగణంబులు బ్రహ్మలోకప్రాప్తులగుదురు. ఇతి స్కాందే సేతుమహాత్మ్యే॥

శ్లో॥ భేతాళవరదంతీర్థం సభూతంనభవిష్యతి ।
స్వర్గంప్రయాంతి తేసర్వే పితరశ్చాపితస్యవై ॥

www.mohanpublications.com

శ్లో॥ యఃపఠేః మమధ్యాయం శ్రుణుయాద్వాసమాహితః ।
ముచ్యతే సర్వపాపేభ్య స్స్వర్గలోకంగనగచ్ఛతి॥ ఇతి॥

వింటిరా మునీంద్రులారా దాని మాహాత్మ్యమగమ్యంబు యాత్రికు లక్కడ స్నానాది కృత్యంబు దీర్చుకొని గంధమాదన పర్వతంబునకు బోవలయును.

గంధమాదన పర్వత పాపవినాశ మహాత్మ్యము.

మహాపుణ్యస్థలంబు గంధమాదన పర్వతంబు సముద్రంబులో సేతువునకు మార్గరూపంబై యున్నది గావున నాపర్వతంబు నెక్కరేని వారికి బ్రహ్మలోక గమనమార్గంబున కదియె సాధనంబని విశ్వకర్మచే విఖ్యాతంబయ్యె శతసహస్ర లక్షకోటిగణనలు గలిగిన సరస్సులలోగాని నదులలోగాని సముద్రంబులలోగాని వేదారణ్యాది పుణ్యక్షేత్రంబుల లోగాని యాపర్వతంబుపై నెక్కినమాత్రంబున నగమ్యాగమున బ్రహ్మహత్యాది పాపంబులు నివర్తించునట్లు కొదువవాటిలో నశించవు.

మునులారా నేనేమి జెప్పుదును శ్రీదేవి భూదేవి సహితుండయి విష్ణుదేవుండును సావిత్రీ సరస్వతీ సహితుండై బ్రహ్మదేవుండును గణపతి షణ్ముఖాదులును దేవేంద్రాది దేవతలు నాదిత్యాది నవగ్రహంబులు వశిష్ఠవాలఖిల్య విశ్వామిత్రాది మహామునులును సేవించి యుందురు. సతతంబును మహాదేవుండు గౌరీసమేతుండై విహారంబుచేయుచుండు.

అధరాధరంబనాదియు సర్వమునిగణసేవ్యంబును తుంగ తరంగాభిలసముద్రసేవితంబై యొప్పుచుండు తదీయమారుతస్పర్శ మాత్రంబున కోటిమహాపాతకంబులు అగమ్యాగమనాగ సీపర్వత ప్రతిమహాపాతక కోటులు దేహకలితంబులగు నవియును నశించు అందు వానరసేనా

www.mohanpublications.com

నాయకుండగు నలుండు రామాజ్ఞచే సేతువొనర్చె నా సేతుగంధమాదనంబుల దర్శించు వారాధరాధరంబునకు వందనంబులుగావించి ఓ ధరాధరేంద్రోత్తమా నీవు బ్రహ్మ విష్ణ్వాది సమస్తదేవతా సేవితుండవు నిన్ను మదీయపాదంబుల ద్రొక్కుటచేతం గలుగు పాపపుంజజంబు విదళించి దక్షిణపు ముఖవచ్చి ఖరాగ్రవాసియగు శంకరు దర్శింపుమని యివ్విధంబునం బ్రార్థించి సేతురూప తన్నవగాహణంబు గావించి తత్తీరంబున సముద్రస్నానంబు లొనరించి సక్తుమాషత్రికంబులు శమీదళసదృశంబులగు పిండంబులిడిరేని వారిపితరులు కల్పాంతయపర్యంతంబును తృప్తినొందుదురు మరియు వారలు స్వర్గస్థులై యున్న మోక్షంబును నరకగతులై యున్న స్వర్గంబునొందుదురు.

ఆపర్వత రాజంబునందులో ప్రసిద్ధంబును సర్వతీర్థోత్తమంబును పుణ్యతమంబును పాపవినాశంబను నొకతీర్థంబుగలదు తత్తీర్థస్మరణంబు గాంచినవారలు గర్భవాసంబునొందనోప రందు స్నానంబు గావించిన వారలు నిర్మలులగుచు వైకుంఠపదంబు నొందుదు రిందుకుసందియంబు లేదనిన పౌరాణికుంగాంచి ఋషులిట్లనిరి.

ఓ మహాత్మా పాపవినాశనాఖ్య తీర్థప్రభావంబును వచింపు నీవు వ్యాసబోధితుండవుగాన సకలంబు నెరుంగుదువనిన నతండిట్లనియె.

ఓ మహర్షులారా వినుండు హిమవత్పర్వత సమీపంబున బ్రహ్మాశ్రమంబునందు జరిగిన వృత్తాంతంబు దెలిపె సమీపంబున బహులగులతాకీర్ణంబును క్రూరమృగ సంకులంబును మదగజ పరివారితంబును సిద్ధచారణసేవితంబును రమణీయంబును పుష్పిత కాననంబును నియమవ్రతపరాయణ బ్రాహ్మణపరిశోభితంబును సూర్యప్రకాశ తపోబలలయ ప్రకాశితంబును యజ్ఞదీక్షిత వేదాధ్యయన సంపన్నశోభితంబును బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాద్యాశ్రమనిష్ఠ విభాసితంబును మరీచి

www.mohanpublications.com

వాలఖిల్య పరివేష్టితంబై యొప్పు నొకయాశ్రమంబుగల దచ్చటికి సాహసవంతుండగు దృఢమతియను శూద్రుండరుదెంచి దేవకల్పులగు సప్తమహాఋషులకు వందనంబులంగావించి వారలచే బూజింపంబడి వారలుచేయుచుండు యజ్ఞాదులంగాంచి దానుం దపంబుగావింపగోరి యమ్మునిమండల శ్రేష్ఠుండగు లవతియను మహాత్ముంగాంచి యో తపోధనా నీకు వందనంబు నొనర్చెద నన్ను గరుణాదృష్టిచేతం గావుము నేనవరవర్ణ జాతుండ మీకు శుశ్రూషణంబు గావింపనేతెంచితి బ్రసన్నుడవై నాచేత యజ్ఞాదులంగావింపుమని యివ్విధంబునం బలికిన దృఢమతి వాక్యంబు లాలించి యత్తపోధనుం డిట్లనియె.

ఓ దృఢమతీ హీనవంశజుండగు శూద్రుండు యాగదీక్షితుండగుటకు శాస్త్రపాఠకంబు నభ్యసించుటకుం దగదు గాన బ్రాహ్మణశుశ్రూష గావింపుము జాతిహీనున కుపదేశింపఁబడగ దట్లుపదేశించిన యుపాధ్యాయుండు దోషంబులం బొందుంగాన నాయుపదేశించునట్టి బ్రాహ్మణుని విప్రులు చండాలునింబోలె పరిత్యజింపవలయు మరియు మన్వాదులచే శూద్రకులజులకు ధర్మంబు ద్విజశుశ్రూషణంబని చెప్పబడియున్నది గాన నట్లు గావింపుమనిన విని యాశూద్రుండు శ్రద్ధాసహితంబుగా తపంబుచేయంగోరిన నిత డంగీకరించక బోయె నైనను నేతపంబు గావించెదనని నిశ్చయించి కొంతదూరంబుబోయి యచ్చట నొకపర్ణశాలంగావించి దేవతాగారం బొనర్చి తత్సమీపంబున నొక తటాకంబు ద్రవ్వి యొకపుష్పారామంబు గావించి తపస్సిద్ధింగోరి శ్రద్ధాయుక్తుండై తపంబుగావింపుచు దేవపూజలు సేయుచు నియమోపేతుండును జితేంద్రియుండును కందమూల ఫలాశనుండు నతిథి పూజకుండునై యుండ గొంత కాలంబాయె నట్టియెడ గర్గవంశ సద్భూతుండును జితేంద్రియుండును నగు సుమతియను మునీంద్రుడాతని యాశ్రమంబున కేతెంచిన యతండా మహామునినిం బూజించి ఫలాదులచే సంతుష్టుం గావించి కుశలంబడిగిన నతండా శూద్రునాశీర్వదించి నాశ్రమంబునకుం

www.mohanpublications.com

బోయి ప్రత్యహం బడసియుండు విద్యార్థులంబుచే వారియాత్రవహంబునకు వచ్చుచుండెపుడు యతండు నాశ్రమ యతనిచే యజ్ఞములనేయించి రహస్య మంత్రోపదేశంబులంగావించి యాహారవృత్తిచే పోషితుండై యుండె నిట్లుండి కొంతకాలంబున నా బ్రాహ్మణుండు మృతుండై యమ కింకరులచే నరకంబులం ద్రోయబడి యనేక కల్పసహస్రవర్షంబు లాబాధల ననుభవించి పిదప భూమియందొక వృక్షంబై పుట్టి పిమ్మట గర్దభ విస్వ రాహ సారమేయ రూపంబులనొంది తరువాత చండాల శూద్ర వైశ్య క్షత్రియ యోనులందుద్భవించి కడపట విప్రుండై యవతరించి జన్మాష్టమంబునందు పునీతుండై వేదాధ్యయనంబొనరించుచుండె నొకా నొక కాలంబున బ్రహ్మరాక్షసునిచే పీడితుండై విలపించుచు భ్రమించుచు వేదబాహ్యుండై కర్మహీనుండై యుండు నతని జనకుండు దుఃఖాక్రాంతుండై యబ్బాలుందోడ్కొని యగస్త్యమహాముని సమీపంబున కుంజని నమస్కరించి యోమునీంద్రా నా కీపుత్రుండు దప్ప పిత్రృణం బవమోచింప మరియొకండు లేదు భవాదృశులగు వారలు పరోపకార శీలురై యుందురుగాన నితనింగాంచి రక్షింపవేయని యనేకవిధంబుల వేడిన నాబ్రాహ్మణుంగాంచి యగస్త్యుండిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా, యీబాలుండు పూర్వ జన్మంబున సుమతి యను బ్రాహ్మణుండితండు వయిదిక కర్మంబులను మంత్రంబుల శూద్రున కుపదేశించి మరికొన్ని దినంబులకు మృతుండై తత్కారణంబున యనేక సహస్రవర్షంబులు నిర్ణయ బాధలంబొంది పిమ్మట స్థావరాది జన్మంబులం బొందియిప్పుడు బ్రాహ్మణుండై భవత్పుత్రుండయ్యె నితండు పూర్వజన్మ కృత పాపంబుచే బ్రహ్మరాక్షసగృహీతుండై యున్నవాడు గాన నొక యుపాయంబు వచించెదవినుము. దక్షిణ సముద్రతీరంబున సేతురూపకంబును సమస్తదేవయసేవ్యంబును పాపనాశనంబగు గంధమాదనంబును నొకపర్వతరాజంబు గలదు. తన్మార్గంబున నొకతీర్థంబున్నయది.

www.mohanpublications.com

అక్కడ దర్శనంబులు జేసుకొని తదుపరి పాపవినాశినీతీర్థంబునకు బోవలయునని చెప్పెను.

## పాపవినాశినీతీర్థ మహాత్మ్యము.

ఓసూతా యాతీర్థమాహాత్మ్యంబు సక్రమంబుగా వినుపించుమని యడిగిన సూతుండు సంతోషించి మునీంద్రులారా పూర్వకాలంబున హిమవత్పర్వత సమీపములో బ్రహ్మ శ్రయమునజరిగిన వృత్తాంతంబు జెప్పెదవినుండు. ఆయాశ్రమంబులోననేకులు పండితులు వేదవేదాంతవేత్తలు నాహితాగ్నులు దివాకరప్రభాభాసురులగు భూసురులనేకమంది తపోనిష్ఠాగరిష్ఠులు బ్రహ్మధ్యానాసక్తులునుండ బహుసాహసుడు దృఢమతియను శూద్రు డొకడచ్చటికి పోయెను.

వాఁడా బ్రాహ్మణోత్తములచర్యలుజూచి మహానందభరితుఁడయి వారిననేకదినంబులననుసరించి పరిచర్యసేయుచు తనకుమహామంత్రంబునుపదేశించవలయుననికోరిన వారు నీవు శూద్రుడవు వేదమంత్రంబుల కర్హుడవుగావు శూద్రులకు బ్రాహ్మణసేవ కరవ్యమని బ్రహ్మ నిర్మితమై యున్నదిగాన బ్రాహ్మణసేవ జేయుచునుండుమని జెప్పిన వాని మనస్సు సంతోషించక పునఃపునః ప్రణామంబులుజేసి బ్రహ్మకర్మలు తనచేజేయించుమని వేడిన నచ్చటి సభాపతి యిట్లనియె.

ఓరీ మూర్ఖుడా నీకువేదంబు జదివె యధికారంబు లేదుగదా నీకు వేదోక్తక్రియలు జెప్పిన బ్రాహ్మణుండు చండాలుండగుననికోపించి చెప్పిన నిరాశుడయ్యెను విడవక శ్రద్ధాగరిష్ఠుడయి నచ్చటకికొంతదూరంబున నొకపర్ణశాల గల్పించుకొని దేవతాగారం బేర్పరచుకొని తత్సమీపంబున తటాకంబు నారామంబును కల్పించి తపసిద్ధిగోరి శ్రద్ధాయుక్తుడయి దేవపూజలు సేయుచు కందమూలఫలహారంబులే గావించుచు

www.mohanpublications.com

బ్రాహ్మణు లెవరు వచ్చిన వారికి ఫలాదులు సమర్పించి మహాభక్తిని పూజించుచు బహువిధములగు వ్రతంబులు సలుపుచుండె.

కొంతకాలంబునకు గర్గవంశ సంభూతుండగు సుమతియను మునీంద్రుడు వచ్చిన బహువినయంబుతో దండప్రణామంబు లాచరించుచు వారికనేకవిధంబుల పూజలు సలుపుచు కందమూల ఫలాదులు సమర్పించుచు సంతోషింపజేసి యొకనాడు రహస్యంబుగా మహామంత్రంబులు చెప్పవలయునని ప్రార్థించిన వానికి వేదమంత్రంబులుపదేశించి వేదోక్తకర్మలు చేయించి వానిచే లాభంబు నొందుచుండి కాలవశంబున మృతుడయి శూద్రునికి వేదోక్తవిధులు జరిగించిన పాపంబుచే ననేక వత్సరములు రౌరవాది మహానరకంబులో యాతన లనుభవించి పిదప రాక్షస శునక విడ్వరాహ జన్మంబులొంది తదనంతరమున చండాలశూద్ర వైశ్య క్షత్రియజన్మములెత్తి కడపట విప్రుడుగా జన్మించి యుపనీతుండయి జనకుని యొద్ద వేదంబు జదువుచుండె.

అంతట దైవగతిచే బ్రహ్మరాక్షసుచే పీడితుడయిన నతని తండ్రి దుఃఖితుడయి యగస్త్యమహామునికడకు దోడ్కొనిపోయి శ్రమలన్నియు జెప్పుకున్న దయాళుండగు మహాముని దివ్యదృష్టిచే జూచి యో బ్రాహ్మణోత్తమా నీపుత్రుండు పూర్వకాలంబున జేసినకృత్యంబు నివిధంబున బాధించుచున్న దిందుకు సాధనంబు గనపడదైనను యాలోచించి జెప్పెద క్షీరసముద్రతీరములో సేతుమూలంబున సమస్తదేవతా బ్రాహ్మణసేవ్యంబును పాపనాశనమగు గంధమాదన పర్వతంబుగలదు దానిపై యొక్క తీర్థంబున్నయది భూతప్రేత పిశాచాదులవలన గలుగుబాధలు మాన్పునుగాని దానికి పాపనాశమను పేరుప్రసిద్ధి గల్గియున్నది. గావున భూసురాగ్రణీ నీతనయు నచ్చటికి దోడుకొనిపోయి ప్రతిదినమచ్చట నివాసంబుజేసి యథాశాస్త్రంబుగా స్నానాదిక్రియలు జరిగించితివేని పావనుడయి బాగుపడునని జెప్పెను.

www.mohanpublications.com

ఆయన నగస్త్యమహామునికి సాష్టాంగ ప్రణామంబులాచరించి కుమారుని గొని నతని పాపనాశతీర్థంబులో సంకల్పపూర్వకంబుగా మూడుదినంబులు స్నానంబులుజేయించిన బ్రహ్మరక్షస్సుచే విడువబడి పరిశుద్ధుడయి తదుపరి స్వస్థచిత్తుడయి సర్వభోగంబులనుభవించి దేహాంతంబున ముక్తిబొందె నతనిజనకుడును కైవల్యంబునొందె.

మరియునతనిచే వేదమంత్రోపదేశంబు నొందిన శూద్రుండును మృతుండయియనేక యాతనలనుభవించుచు ననేక నీచజన్మంబులెత్తి చివరజన్మంబున గృధ్రమై కాలవశంబున గంధమాధన పర్వతంబుపై వాలి పాపనాశతీర్థంబులో జలంబుద్రావి పూర్వజన్మస్మృతిగలగిన తీర్థ మహాత్మ్యంబున కచ్చెరువందుచు నందులోశరీరంబునుంచిన గృధ్రాకారంబుమాని మహాతేజోమయ శరీరుడయి దేవకాంతలు వింజామరలు వీచుచు బరివేష్టించియుండ దేవలోకంబునకుబోయె కాన నాతీర్థంబునకు పాపనాశన తీర్థంబని లోకవిశ్రుతనామంబుగలిగె తదుక్తం స్కాందే॥

శ్లో॥ స్వర్గదంమోక్షదంపుణ్యం ప్రాయశ్చిత్తకరంతథా।
బ్రహ్మవిష్ణుమహేశాద్యైస్సేవితం సురసేవితం।
పాపానాశనాంనాశనా ద్విప్రా॥ పాపనాశాభిధంహితే॥ ఇతి॥

వింటిరా మునులారా యదిమహోన్నత తీర్థంబుమరియును.

## సీతాసరోవరతీర్థ మహాత్మ్యము.

పాపనాశనతీర్థంబులో స్నానంబు గావించి సీతా కుండంబున కేగవలయు నాతీర్థములో లోకంబునగల తీర్థంబులయంశంబు లన్నియు నంతర్భూతములై యున్నవి పూర్వకాలంబునదేవేంద్రునకు బ్రహ్మహత్యాదోషనివృత్తియైన స్థలమని చెప్పిన సూతా దేవేంద్రునకు బ్రహ్మహత్య

www.mohanpublications.com

యెట్లు సంభవించె స్వర్గములోనుండి భూలోకంబున కతండెట్లువచ్చె నాకథావృత్తాంతమంతయు వినుపించుమని కోరిన నిట్లనియె.

మునీంద్రులారా పూర్వకాలమున కపాలాభరణుడను రాక్షసు డతనిమంత్రి శవభక్షకుడని వైజయంతీ పట్టణమున రాక్షసులుగొలువ రథగజాశ్వాది సహితమగు దశాక్షౌహిణీ సైన్యంబులుగొలువ రాజ్యంబు సేయుచు నొకనాడు మంత్రినిపిలిచి భూలోక సౌఖ్యం బనుభవించితిమి నిక యమరావతిపై దండెత్తి దేవేంద్రుని బరిమార్చి స్వర్గరాజ్యంబు నేలుచు నందననాద్యారామంబుల నప్సరస్సమూహంబుతో క్రీడింత మని యాలోచించి కపాలాభరణుండు దుర్మేధనుండను పుత్రుని పట్టాభిషిక్తునిగావించి సకలసైన్యంబులతో నమరావతిజేరిన బలభేదియుత సైన్యంబులతో నెదుర్కొని సంకుల సమరంబుగావించి ద్వంద్వయుద్ధంబులొనరించి దేవబలంబులు రాక్షసుల నేలంగూల్చిరి దేవేంద్రుండును కపాలాభరణునకు ఘోరఘోరతరంబగు నానావిచిత్రంబులగు యుద్ధంబులు పరుగజరుగ నయ్యామినీచరుం డైదువేలపారువుల బరువుగలిగి శతహస్తంబుల పొడవుగల యుక్కుగదచే నింద్రుని వక్షస్థలంబుమీద వ్రేసిన నింద్రుండు మూర్ఛిల్లి బృహస్పతిచే సంజీవనీ మంత్రంబువలన తెప్పరిల్లి లేచి సాహసంబు దెచ్చుకొని యింద్రుండైరావతారూఢుండయి వజ్రాయుధంబున వానిప్రక్కలుజేసిన వాడు మృతిబొందెను.

ఆబ్రహ్మహత్య గాఢతరంబై పాకారిని బట్టి బాధపెట్టె ననిన సూతా మహాదురాత్ముడు లోకబాధకుడగువాని లోకోపకారంబుకొరకు నింద్రుడు జంపిన నాతనికి బ్రహ్మహత్య యెట్లు సంభవంబయ్యె. ఈవింత తెలుపుమన్న సూతుండు నవ్వి మునీంద్రులారా యిది బహు రహస్య మడిగితిరి చెప్పెదవినుడు.

www.mohanpublications.com

పూర్వకాలంబున వింధ్యాద్రి ప్రదేశంబున త్రికృడను రాక్షసుడు గలడతనిభార్య సర్వలక్షణ సంపన్న సౌందర్యశాలిని యట్టి కాంతామణి వింద్యపర్వత ప్రాంతంబుల సంచరించుచు వేదాధ్యయన తత్పరుండును మహాపండితుండగు శుచియను బ్రాహ్మణు నాశ్రమంబునకుజేరిన నాతడు దానిరూపనయో సౌందర్యలావణ్యంబులకచ్చెరువందుచు మోహితుడై యున్న నాచేడియమందగమనంబున నాశ్రమంబులోకి జొచ్చిన నా మునీంద్రుండు మహానందంబుతో మహాగౌరవంబున దానిబలుకరించి కులమడిగి యీయరణ్యంబులో దిరిగినొచ్చితివి కొంతదడవు మాయాశ్రమంబులోనుండి సేదదీర్చుకొని పొమ్మనిచెప్పిన సుశీల యిట్లనియె.

ఓమునీంద్రా నేత్రవక్త్రుండను రాక్షసేంద్రుని భార్యను పుష్పాపహరణార్థమై యీయరణ్యంబునకు వచ్చినదాననే ననపత్యనై యున్న దాన నాభర్త సుచియను మునీంద్రుంబొంది పుత్రుంబడయుమని యాజ్ఞాపించిన వచ్చితిననిన బహుసంతోషించి నీయందు నాకుండే మోహంబు చెప్పతరముగాదనిన ప్రసాదించి నాకు పుత్రు గృపసేయు మనిన నుత్సహించి దాని మనోరథంబుదీర్చి యిద్దరు మహావినోదంబుల సకల సౌఖ్యంబు లనుభవించ మూడు దినంబులయ్యె.

అంతట నోవనితామణీ నీయుదరంబున కపాలాభరణుడనుపుత్రుం డుదయించి సహస్రవర్షంబులు రాజ్యసుఖం బనుభవించగలడు దేవేంద్రునిచేతప్ప నితరులకు సాధ్యుడుగాడని జెప్పి కాశీపట్టణంబునకుబోయె. అంతట కొన్నిదినంబులకు కపాలాభరణునిగనియె నతని నింద్రుండు వధించెగాన బ్రహ్మబీజ సముద్భవుం డగుటంజేసి బ్రహ్మహత్య నింద్రుని జుట్టుకొనియె.

అంతట నింద్రునియె దీనుడై చతుర్ముఖుని సన్నిధికిబోయి విన్నవించిన విరించియు విచారించి యోబలభంజనా దక్షిణసముద్రతీరంబున

www.mohanpublications.com

సీతాకుండంబను తీర్థంబునందు నెవ్వరు స్నానంబు గావించి శివప్రీతికరమగు యాగములు గావించిన బ్రహ్మహత్యాపాతక నివారణమగు నని చెప్పి యాతీర్థమాహాత్మ్యంబును వైకుంఠంబునుండి దారుకావను స్నానంబుచేసినవారికని చెప్పిన బ్రహ్మయజ్ఞప్రకారంబున దేవేంద్రుండు జపించి పునీతుండై యమరావతికేగె.

ఓ మునీంద్రులారా యీతీర్థంబు మహాపాతకనివారణము ముక్తి ప్రదంబు సర్వదారిద్ర్య దుఃఖప్రశమనంబు పుణ్యలోక ప్రదంబు సీతా సరోవరంబున స్నానం బొనరించిన వారికి అష్టైశ్వర్యంబులు లభించు మునులారా మహాపతివ్రతయగు సీతామహాదేవి శ్రీరామ ప్రీత్యర్థ మగ్ని ప్రవేశంబై నిర్దగ్ధాంగియై యీసరోవరంబులో బయలుదేరె గాన సీతా కుండమని లోకవిశ్రుతంబయ్యె నెవ్వరు స్నానంబుగావించిన వారికి సర్వాభీష్ట సిద్ధిగల్గును.

## మంగళతీర్థ మాహాత్మ్యము.

సీతాసరోవరంబున స్నానదానంబుచేసి యచ్చట మంగళతీర్థంబు నకుబోవలయు నాతీర్థములో లక్ష్మీదేవి సర్వదా నివసించియుండును. భాగ్యంబుగోరి దేవేంద్రాదులాతీర్థంబునకు సమసరించియుందురు. పూర్వ కాలంబున చంద్రవంశోద్భవుండగు మనోజవుడను రాజేంద్రుండు చతు స్సముద్రముద్రాంకితంబగు ధరాచక్రంబునేలుచు దేవతాప్రీతికరంబులగు యాగంబులు సేయుచు బ్రాహ్మణోత్తములకు నన్నదానముచేసి సంతుష్టి గావింపుచు హవ్యకవ్యంబులు నడుపుచు వేదత్రయాధ్యయనంబును సార్థకంబుగా శాస్త్రాధ్యయనంబునుగాంచి పరాక్రమంబులచే సకల శత్రు నాశనంబు గావించి శివకేశవ నామస్మరణంబులు వదలక మన్వాది నీతి శాస్త్రోక్తప్రకారంబున ప్రజాపరిపాలనంబు సేయుచుండె.

www.mohanpublications.com

అంతట కొన్నిదినంబుల కఠినాంతఃకరణుడై దురహంకారుడై అర్థ మోహాబద్ధుడయి బ్రాహ్మణ జీవనములకు పన్నులేర్పరచి దేవాలయంబుల కున్న వృత్తులను విరోధంబు లేర్పరచి క్రూరుండై జరుపుచు కొన్నిదిన ములకు హూణదేశాధిపతియగు గోలభుడు బలవంతుండయి మనోజవుని పట్టణము విరోధించిన నారుమాసంబులు ఘోరయుద్ధంబయ్యె మనోజ వుండు జరిగించిన దేవబ్రాహ్మణ ద్రోహంబులు నెరిగి యతని తేజోబలై శ్వర్యంబులు నష్టంబుచేసిన కష్టములపాలై యాదుష్టుడు కష్టశోక దగ్ధుండై పనిచెడి పరాజయుడయి సింహవ్యాఘ్ర భల్లూకము దుష్ట మృగ సందష్టంబగు నరణ్యంబులో తాను భార్యయు కుమారుండును సంచరించుచు నిలువనీడలేక గోడునేడ్చుచు బాధలబడుచుండెను.

గోలభుడు రాజ్యంబాక్రమించుకొని సంతోసంబుతో ననుభ వించుచుండెను.

అంతట మనోజవుండును భార్యయు పుత్రుండును బాధలబడుచు కుమారుడన్నంబులేక సొక్కి మూర్ఛపరవశుడై తల్లినిబట్టుకొని పల వింపుచుండ తండ్రినిజూచి శోకసముద్రంబులోమునిగి దుఃఖింపుచు పూర్వ కాలంబున తాను మదించి చేయని సత్కార్యములను చేసిన దేవ బ్రాహ్మణ ద్రోహములను దలచుచు భార్యతో నిట్లనియె.

హేసుమిత్రే నేనొకనాడయినను శివకేశవుల పూజగావించనైతి వారినామములైన స్మరించనైతి బ్రాహ్మణుల వృత్తులకు పన్నులుగడితి దేవాలయంబులు వృత్తులు హరించితి తల్లిదండ్రులకు శ్రాద్ధంబులు విడ చితి చైత్రమాసములో చిత్తానక్షత్రయుక్తదినంబున నొక్కఫలంబైన నెవ్వరికివ్వనైతి నింతపానకంబైన దానంబు నివ్వనైతి యొక్కఛత్రం బైన నొక్కవ్యజనంబైన పాదరక్షలైన నెవ్వరికి నివ్వనైతి యింత క్రూరుండనైతిని వేసవికాలంబున నొకరికి పుష్పంబైన ఫలంబైన చంద

www.mohanpublications.com

నంబైన దాహంబైన నివ్వనైతి సకల జంతువుల సుపయోగంబౌ నట్లొక్క తటాకంబైన బావినైనం ద్రవ్వించనైతి చలివేంద్ర పెట్టించ నయితి తులసీవనంబయిన వేయించనైతి నొకనాడైన హరికేశవుల యుత్సవంబులు చేయనైతి పెద్దల బ్రాహ్మణోత్తముల పండితులజూచి గర్వంబుచే దండంబైన బెట్టనైతి పట్టెడన్నంబెవరికి బెట్టనైతినంతదురా గతుడ కఠినుడ గర్వగ్రస్తుడ మోహగ్రస్తుడ దురాచారపరుండ దురా శాపరుండ నేనిక నుండజాల యీబాలుని సంరక్షణమెట్లయిన జేయుము నేచేయననిన భార్యయగు సుమిత్ర దుఃఖించి నిట్లనియె.

భర్తా యిన్నికష్టంబు లనుభవించితిని నీసన్నిధానంబున నుండు టకు ధైర్య మింత గలిగియుండె నేను స్త్రీని పసిబాలుం డీయరణ్య ములో క్రూరమృగంబుల నోటిలో బడుదుము యీకష్టములు బడనోప నేను శరీర త్యాగంబుజేతు నీబాలునిసంరక్షించుకొమ్మని భార్యజెప్పిన మూర్ఛాక్రాంతుడై కాలుగదల్పక బడియుండె.

భార్యయు కొమారుండును మహాశ్వరంబుతో రోదనము జేయు చుండి రంతట దైవయోగంబున జటావల్కలధారియు భస్మోద్ధూళిత విగ్రహుండునుతిర్యక్త్రిపుండ్రాంకిత ఫాలభాగుండును రుద్రాక్ష మాలా లంకృతుండును ధవళయజ్ఞోపవీతుండునగు పరాశరముని యా యార్తస్వ రంబాలించి యచ్చటికరుదెంచిన సుమిత్రలేచి పాదంబులపై బడిన నోప తివ్రతా నీవెవ్వరు మూర్ఛాగతుడునీకేమిగావలె నెందుకీరీతి బడియున్న వాడనియడిగిన మహాత్మా యితడు నాభర్త మనోజవుడను రాజేంద్రుడు హూణదేశాధిపుండగు గోలభుడనువానిచే పరాజితుండయ్యె మాశత్రు వుడు రాజ్యపాలనంబుసేయుచు సుఖంబున నున్నాడు.

ఈకష్టంబుల కోర్చక నాభర్త యీగతి మూర్ఛాగతుడయ్యె నీ బాలుడు మా తనయుడు క్షుత్పిపాసా పరీతుడై దుఃఖించుచున్నాడో

www.mohanpublications.com

మహాత్మా మీరు దీనరక్షణ విచక్షణులు మీపాదంబుసోకిన వారుపవి త్రులయి భాగ్యవంతులగుదురు మమ్మురక్షింపు రక్షింపు మనుచు తన పుత్రుని చంద్రకాంతిని పాదములపయి పడవేసి దుఃఖింప నమ్మహాత్ము డు పరిపూర్ణ కటాక్షంబుచేజూచి యోమానవీ దుఃఖింపకు జగద్రక్షకుడు మీకు మంచిమార్గంబు జూపించునని యమ్మునీశ్వరుడు తనకరంబున నారాజేంద్రుని శరీరంబంటి సదాశివ మంత్రంబు స్మరించిన వసుధ రాధీ సుండు దిగ్గునలేచి పరాశరుని పాదంబులపై బడెను.

మునీంద్రా భగవత్సాధు సేవకుడ మీపాదరజస్సుచే నాపాపం బులుదూరంబులయ్యె మాపుణ్యంబున మీదర్శనంబుగలిగె రక్షింపురక్షిం పుడనుచు సాగిలమ్రొక్కిన దయాపరిపూర్ణుడై రాజేంద్రా మీరుశత్రు జయంబై నీకు రాజ్యంబుగలిగి సుఖించెడి యుపాయంబు జెప్పెదవినుము.

మహాపుణ్య ప్రదంబగు రామసేతుసమీపంబున గంధమాధన పర్వతంబునందు సర్వైశ్వర్య ప్రదాయకంబగు మంగళతీర్థంబు గలదు శ్రీరామదేవుడు సీతాసమేతుడై సన్నిధించియున్న తీర్థంబుగావున నీవు కళత్రపుత్రసమేతుడవయి యచ్చటికిపోయి స్నానంబు చేసిన క్షేమంబు గలుగును నీకుమాంగల్యంబు దొలగిపోయి పరిశుద్ధుడవయి పాపంబుల బాసి సుఖంబుల ప్రాపించుదువు దుష్టుడగు నీశత్రుడుకష్టంబు వాలగు వశిష్టానుగ్రహంబున నీనష్టరాజ్యంబు నీకువచ్చి సుకింతువనిజెప్పి రాజా నేనువచ్చి నిన్ను కృతార్థునిచేయుమనిన కళత్రపుత్రసమేతుడైన రాజ న్యుని దోడ్కొని క్రమక్రమంబున దేశంబులుదాటి దుస్తరములగు నదులరణ్యంబులదాటి గంధమాధనంబుచేరి యచ్చట మంగళతీర్థంబున యధాశాస్త్రంబుగా నతినికి నకుటంబముగా స్నానంబుచేయించి పితృ ప్రీతికరంబులగు శ్రాద్ధంబులుజేసిన రాజునిర్మలుడైనప్పుడు తారకమంత్రంబే కాక్షరంబుపదేశించిన నారామమంత్ర మతడిరువదినాల్గుదినంబులు నిశ్చల బుద్ధితో జపముచేసెను.

www.mohanpublications.com

తత్ప్రభావంబున బహుళాస్త్రశతరమగు బాణాసనమును నక్షయ తూణీరంబులను మెరియు ఖడ్గంబును చిత్రగదా ముసలాది సాధనంబులును మహానాదంబుగలుగు శంఖంబును సంజీవిసారథి తతాశ్వాదిశోభితంబగు రథంబును దివ్యంబులగు వస్త్రంబులు భూషణములును మహాత్ముడగు పరాశర మహాముని ప్రసాదంబున మంగళతీర్థంబునన్నిదిలో నెదుట నిల్చిన జూచి నృపాలుడు సంప్రీతుండై పరాశరామునికి పాదాక్రాంతుడై సనుగ్రహించిన తీర్థోదకంబుల నతని నభిషేకంబు గావించిన నా భూమీశుండు శోభాయమాన శరీరుండై మకుటంబు ధరించి సమస్తాభరణ భూషితుడై దివ్యమకుటాంబరంబులు ధరించె.

అంతట పరాశరమునీంద్రుడు బ్రహ్మాస్త్రాది దివ్య సాధనంబులు ప్రయోగోప సంహారపూర్వకంబుగా ప్రసాదించిన నుపదేశంబు నొంది సిద్ధుండై మనోజవుండా మహాముని పాదంబులకు ప్రాంజలొనరించి తదాశీర్వచనంబులు గైకొని తదనుజ్ఞనొంది భార్యాపుత్రసహితుండై నిజపురంబునకుబోయి శంఖధ్మానంబు జేసిన గోలభుండను గుండెలవిసి సైన్యంబు దెచ్చుకొని సేనాసమేతుండై మనోజవు నెదుర్కొని యతి ఘోరంబగు యుద్ధంబుగావించి జయించలేక పలాయనంబునొందె.

మనోజవుండు కళత్రపుత్రసమేతుండయి పురంబుసొచ్చి రాజ్యభారంబుబూని నిరహంకారుండయి బ్రాహ్మణద్వేషంబుమాని ధర్మంబుదప్పక సహస్రవర్షంబులు సుఖముగా భోగ్యమనుభవించి విరక్తుడయి తనకుమారుండగు చంద్రకాంతునికి పట్టాభిషేకంబుజేసి భార్యాసహితుడయి మంగళతీర్థంబు జేరి పంచాక్షరీమంత్రంబు జపంబుజేసి కొన్ని దినంబులకు శివలోకంబు జేరె.

మునీంద్రులారా మంగళతీర్థ ప్రభావంబిట్టిది వింటిరా యని చెప్పి సంతోషించిరి.

www.mohanpublications.com

## అమృతవాపి తీర్థమహాత్మ్యము.

తదనంతరంబు మంగళతీర్థంబులో స్నానాదికృత్యంబులు దీర్చుకొని యేకాంతరామనాథ క్షేత్రసమీపంబున నమృతవాపికి పోవలయు నచ్చట స్నానంబుగావించి సీతాలక్ష్మణ హనుమానుమదాది వానర సహితుండగుచు లోకరక్షణార్థంబు మహానుగ్రహంబున శ్రీరామచంద్రుని సన్నిధియుంచు నాతీర్థంబుల స్నానంబుజేసినవారలు శంకరప్రసాదంబున నమృతంబునొందగలరని జెప్పిన సూతా యాతీర్థంబున కమృతవాపియను నామంబెట్లు సంభవించె చెప్పుమనియడిగిరి.

మునులారా హిమవత్పర్వత ప్రాంత్యంబులో సకలముని సిద్ధగంధర్వ విద్యాధరాది సేవితంబును మృగసంకులంబు ననేకతరులతాకుంజనికుంజాది శోభితంబున పద్మకైరవాది విలసిత సరోవరబాసితంబగు నొకరుష్యాశ్రమంబుగల దక్కడ నగస్త్యమహామునీంద్రుని భ్రాత బహునిష్ఠాగరిష్ఠుడయి త్రికాలంబుల వర్షాతావ శీతలంబులకోర్చి తపంబుసేయుచు త్రికాలంబు శివపూజ లొనరించుచు నూర్ధ్వబాహుండై నిరాధారుండై నిరాహారుండై మౌనవ్రతంబున నిశ్చలుండయి పాదాంగుష్ఠంబుపై నిల్చి యత్యుగ్రతపంబుగావించి దయాసముద్రుండగు మహాదేవుండు మహాతేజస్సుచే దశదిశాంతరంబు నింపుచు వృషభవాహనా రూఢుండయి పార్వతీసమేతుండయి ప్రత్యక్షంబయిన మునీంద్రుండులేచి సాష్టాంగదండప్రణామంబొనరించి స్తుతించె. పార్వతీ హృదయేశ భవవినాశ నీలకంఠ మహేశ కఫాలలోచనీశ్వర సర్వగీర్వాణార్చ్య సన్నుతాంఘ్రిదక్షాధ్వర ధ్వంసదైత్య దానవశిక్షా శిష్టావనోద్దిష్ట శిపివిశిష్ట శూలాయుధాఖీల శోషితరిపుజాలా హాలాహలాహారా యనుచు నివ్విధంబున ననేకస్తుతులుజేసి యోమహాధీశా సంసారార్ణవమగ్నుండనగు నన్నుద్ధరించి మోహాయత్త చిత్తునింజేయనేయని ప్రార్థించిన సదాశివుండు సంతోషించి మో యగస్త్యభ్రాతా నీకు ముక్త్యుపాయంబు జూపెద సేతుమధ్యం

www.mohanpublications.com

బున గంధమాదనపర్వతసమీపంబున మంగళతీర్థసన్నిధి నొకతీర్థంబున్నది దాని మహిమ మహోన్నతంబు నీవచ్చటికిబోయి ముక్తిబొందుమని సూచించి పరమేశ్వరుం డంతర్హితుండయ్యె.

అంతట నాముని గంధమాదన పర్వతంబుజేరబోయి నేకాంత రామనాథ క్షేత్రాలంకృతంబున ముక్తిప్రదంబగు నాతీర్థసన్నిధి నీశ్వ రాజ్ఞాప్రకారంబునస్నక యమనియమాన్వితుండై మూడువత్సరంబులు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు సలుపుచు సమాధినిష్ఠచే బ్రహ్మనాడిని ప్రాణంబులగలిపి ధారణావశంబున శిరంబునకుజొచ్చి బ్రహ్మరంధ్రంబు భేదించి ప్రాణంబువెడలించి శరీరత్యాగంబుచేసె.

నాతీర్థప్రభావంబున నాముని శ్రేష్ఠునకమృతత్వసిద్ధిగలిగె గావుననా తీర్థంబున కమృతవాపి నామంబు సార్థకంబయ్యెనో మునీంద్రులారా శ్రద్ధా భక్తియుక్తులై తన్మార్గంబున నిష్ఠాగరిష్ఠులగు సత్పురుషులచ్చట స్నానాది సత్క్రియలు జరిగించిరేని వారల కమృతంబు దొరకుటకేమియాశ్చర్యంబు లేదనినవిని సూతా యేకాంతరామనాథక్షేత్రంబనివచించితి వాక్షేత్రంబున కా పేరెట్లు సంభవించె కృపజేసి మాకు జెప్పవేయని యడిగిన.

మునీంద్రులారా పూర్వంబున శ్రీరామచంద్రుండు లక్ష్మణహను మత్సుగ్రీవ విభీషణ జాంబవత్ప్రముఖులంగూడి సేతునిర్మాణ ప్రయత్నా లోచనగ్రస్తులయి సీతను మనంబునదలచి దుఃఖించుచు నేకాంతంబున నున్న సమయంబున సముద్రుండు తుంగతరంగంబులచే ఘోర భయంకరారావంబుచేసిన పరస్పరరహస్య సంభాషణంబులు వినరాకుం జేసి శ్రీరాముండతిక్రుద్ధుండై తీక్ష్ణదృష్టిచే నాజలనిధింజూచుటయు సము ద్రుండు భంగంబులొంగ గ్రుంగి నిస్సబ్దుండయ్యె నిప్పటికి నక్కడ సముద్రంబు నిశ్చలంబైయుండు నేకాంతంబున నుండుటచే నేకాంత

www.mohanpublications.com
రామనాథమని ప్రసిద్ధమైనది యీయమృతవాపియను తీర్థంబున స్నానంబు చేసిన యెట్టి జ్ఞానవిహీనులయిన యమృతత్వంబు నొందుదురు.

తదుక్తంసేతుమహాత్మ్యే॥ శ్లో॥ అద్వైతవిజ్ఞానవివేకహీనావిరక్తి శూన్యాశ్చ సమాధిహీనాఃయోగాద్యనుష్ఠాన వివర్జితాశ్చ। స్నాత్వా త్రియాన్త్యం త్వమృతం ద్విజేంద్రాః॥ ఇతి॥

వింటిరా మునీంద్రులారా మహోత్తమంబగు తీర్థంబు మరి యక్కడ బయలుదేరి గంధమాదన పర్వతంబుననుండు బ్రహ్మకుండంబు నకు బోవలయు. ఓమునులారా మహాదరిద్ర నాశనకరంబగు బ్రహ్మ

## బ్రహ్మకుండ మహాత్మ్యము.

తీర్థంబిది దీనిదర్శనంబున ననేకబ్రహ్మహత్యాది సకలపాపపరిహారంబు గలుగు నాబ్రహ్మకుండంబులోనున్న భస్మంబుధరించినవారు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ననుసరింతురు. బ్రహ్మకుండ దర్శనంబుసేయ శక్తి జాలని వారలా బ్రహ్మకుండ భస్మంబెవ్వరైన కించిన్మాత్రంబు దెచ్చి యిచ్చిన నాభస్మంబు దాచుకొని మరియొక భస్మంబులో గలిపి ధరించు కున్నను వారు భాగ్యవంతులగుదురు పవిత్రులగుదురు యోగ్యులగు దురు బ్రహ్మయజ్ఞంబుజేసిన స్థలంబిది మహాదేవునివరంబుచే మహో న్నతంబగు తీర్థంబయ్యెనని చెప్పెను.

ఓసూతా యీతీర్థంబునకు బ్రహ్మకుండంబని పేరెట్లుగలిగె నక్కడ భస్మంబుపుట్టుట కేమిహేతువని యడిగిన మునులారా యిది బహుచిత్రంబయినకథ యొకానొక సమయంబున బ్రహ్మకు విష్ణువునకు గొప్ప కలహంబయినదేమనగా లోకకర్తను నేనేగాని నాకుమించిన వారులేరని చతుర్ముఖుండు బలికిన జగత్కర్తను నేనుగాని నీవుగావని

www.mohanpublications.com

విష్ణుదేవుండనియు నీవిధంబున నన్యోన్యకలహం బధికంబై అహంపూర్వ మృషాపూర్వంబని దరిలేక కలహంబుసేయుచు సేయుచుండ నాయిద్దరి మధ్యసంతాగ్ని సముద్రభంబగు నొకలింగంబు మిన్నుముట్టనిలిచిన బ్రహ్మవిష్ణుశక్రాది లైశ్వర్యమునొంది యీలింగంబున కాద్యంతంబులు గన్నవారు లోకకర్తలనిపించుకుందురని దేవబృందంబు నిశ్చయించెను.

అంత చతుర్ముఖుండు నేనంతంబుగనినట్టి నీవానిగనుటకేగుమని విష్ణువుతో ననిన రమావల్లభుండు సమ్మతించి వరాహరూపంబుదాల్చి పాతాళంబునకుపోయివచ్చి శివునియెదుటనిలిచె బ్రహ్మ హంసస్వరూపుడై యాకాశంబునకు పోయివచ్చి మహాదేవునెదుట నిలిచె నాయిద్దరినిగాంచి విశ్వేశ్వరుడు బహువత్సరంబులేగితి రాద్యంతంబులు గని వచ్చితిరాయని యడిగిన విష్ణుదేవుండు లింగంబున కాదియెచ్చట నున్నదో నాకుగానరాలేదని స్పష్టంబుగాజెప్ప బ్రహ్మకై జూచిన నేనంతంబు కనుగొంటిననుచు నసత్యంబు పలికిన శివుండవ్వ నీవు మృషావాదివి గావున నీకు భూలోకంబున పూజలేకపోవునని శాపంబిచ్చె.

అంత చతురాననుడు విషణ్ణుడై యోయీశా నాప్రభువులయిన వారు యపరాధంబు క్షమింతు రిది ప్రథమాపరాధంబు గావున మన్నించి శాపనివృత్తికంపించుమని రక్షింపుడని యనేకవిధంబుల వేడుకున్న నీశ్వరుండు ప్రసన్నుడయి పరితాపతిపుండగుచున్న విరించిని జూచి కరుణించి పద్మగర్భా నావాక్యం బనృతంబుగాదైనను నీవింత వ్యసనబడుటచే నొక యుపాయంబు జెప్పెద గంధమాదన పర్వతంబునకు జని యందు యజ్ఞంబు లాచరించితివేని యీమిథ్యావాద దోషశాంతి యగును వానిచే పాపంబును బాసి శ్రౌత స్మార్తాది కర్మలయందు బూజకర్హుడ వగుదువు. ప్రతిమార్చనంబు నీకు గలుగ నేరదని స్పష్టంబుగాజెప్పి తదనంతరంబు విష్ణుదేవుంగాంచి నీవు సత్యవాదివి గావున లోకంబులో పూజగలుగుచుండు ననియును గ్రహించిన విష్ణుదేవుండునంతోషించెను.

www.mohanpublications.com

అంతట మహాదేవుండింతరి తుండయ్యెనని చెప్పిన సూతా యీ కథ యేపురాణంబులోనున్నదని యడిగిన మునీంద్రులారా స్కాందపురాణంబులో యీకథ విస్తరింప బడియున్నదని వినిపించెను.

శ్లో॥ సూతః॥ పురాభూవకలహెంబ్రహ్మావిష్ణుఃపరస్పరం॥అహం కర్తానమత్తోన్యహః తర్త్రాత్రిజగతీతలే।

ఏనమానాహారిం బ్రహ్మాబ్రహ్మాణం బెహారిస్తదా । ఏనంవివాద స్సుమహాన్ప్రావర్తకపురాతయోః॥

మధ్యేప్రాదుతభూల్లింగస్వయంజ్యోతి స్సనాతనం। తౌదృష్ట్వావి స్మితౌలింగం బ్రహ్మావిష్ణుపరస్పరం॥

సమయంచక్ర రిత్వాహఃదేవానాం సన్నిధ్ధౌపురా । అనాద్యంతం మహాలింగం యదేవతద్ద్రశ్య తేపురః॥

అనంకాదిత్యసంకాశ మనంతాగ్ని సమప్రభం । అనయోరస్యలిం గస్యయోః తమాదిచపస్యతి॥

అహమూర్ధ్వం గమిష్యామి లింగస్యాం తంగవేషయన్ । గవేష ణాయమూలన్య త్వమధస్తాద్ధ్రేవ్రజ॥

ఇతితస్యవచస్శ్రుత్వా తథేత్యాహారుమాపతి । ఎవంతౌ సమయం కృత్వామార్గణాయవినిర్గతౌ॥

విష్ణుర్వరాహరూపేణ గతోదస్తాద్గవెషింతు । హంసతాం భారతీ జానిస్సి వక్త్రతోర్ధ్వపరినిర్ణయా॥

అధోలోకాన్వితద్వాధో విష్ణుర్వర్ష గణాన్బహూన్ ॥ యధా స్థానం సమాగత్య ప్రిబావేదేన సన్నిదా ॥

శ్రీవిష్ణుః॥ అహంలంగస్యనాదాన్తిఃష మాదిమస్యేతిసత్యవాక్ । ఊర్ధ్వంగవేషయిత్వాద బ్రహ్మాస్యాగచ్ఛదత్రసః । అగత్యచ వచఃప్రాహ బద్మనా చతురాననః॥

www.mohanpublications.com
సార్థకర్మలయందే నీకు పూజదొరకును విగ్రహపూజ నీకు లోకంబులో దొరకదు.

నీవు యజ్ఞంబులు చేసినందువలన దీనికి బ్రహ్మకుండంబని పేరు గలుగునని శివుండంతర్ధానంబునొందె వింటిరా కథావృత్తాంతం బివ్విధంబున జరిగిన దప్పటినుంచి బ్రహ్మకుండంబని ప్రసిద్ధంబై మహా పాతక నాశక తీర్థంబని ప్రసిద్ధంబయ్యె మునీంద్రులారా మహా పుణ్యమైన తీర్థంబక్కడ స్నానంబుచేసి హనుమత్కుండంబునకు పోవలయు.

## హనుమత్కుండ మహాత్మ్యము.

ఈతీర్థంబు సర్వోత్తమంబు మహాపాప నాశనకరంబు పూర్వకాలంబున ధర్మసఖుడనురాజు నక్కడ బుత్రగామేష్టిజేసిన నూరుమంది బుత్రులు బుట్టిరనిన సూతా యాకథా వృత్తాంతంబంతయు వినుపించుమనిన మునులారా ధర్మసఖుండను రాజు బహు ధర్మశీలుండు ప్రజాపాలన తత్పరుండు మహాపండితు డతనికి నూరుమంది భార్యలు నందరు మహాయోగ్యలు పతివ్రతాశిరోమణులు భార్యలుతాను సంతోషంబున సుఖించుచుండ నొకరికిని సంతానంబు గలుగక చింతించుచుండ దైవానుగ్రహంబున పెద్దభార్యకు నొకపుత్రుడుగలిగె నాచిన్నవానిని నూరుమంది భార్యలు తమతమగర్భజనకుగా నేప్రేమచే బెంచుచుండిరి యందుకు రాజును బహుసంతోషించుచుండ నొకనాటిరాత్రి యాచిన్నవాడు నిదురబోవ నొకవృశ్చికంబు కాలిపై గరచిన వాడు తాపంబునొందినదిజూచి నూరుమందిభార్యలు దాస దాసీజనంబులు దుఃఖించిరి.

ఆధ్వని కొలువుకూటంబునకు వినబడ నారాజు వకదూతనుబంపి వర్తమానంబు దెప్పించుకొని తానుబోయి విషవైద్యుల కనేక ధనంబు లిచ్చి మంత్రౌషధంబులచే శాంతిబొందించి సంతోషించి బ్రాహ్మణులకు

www.mohanpublications.com

దీనులకు కొల్లగా ధనాంబరాభరణాదు లిచ్చి బ్రాహ్మణోత్తముల పిలిచి యొక్కకొడుకు కొడుకుగా నొక కన్నుకన్నుగాదని లోకవాడిక వింటిరి గదా నాకు నూరుమందిభార్యలు భార్యకొకకుమారుండు గలుగునట్లు యత్నంబుజేయించుమనికోరిన నాడు గంధమాదన పర్వతంబుమీద హనుమంతుకుండంబడియున్నది లోకోపకారంబుకొరకు హనుమంతుండు నిర్మించెనని చెప్పినసంతోషించి హనుమత్కుండసమీపంబున పుత్రకామేష్టిచేసె. బ్రాహ్మణోత్తములు నూరుగురుభార్యలకు పాయసంబు బంచియిచ్చిన నందరికొక్కొక్క తనయుఁ డుద్భవించి సుఖంబుండిరి. ఈరాజు నందరు తనయులలాలనంబుసేయుచు బహుకాలంబుజీవించి తనపెద్దకొమరుడగు సుచంద్రునికి రాజ్యభారంబిచ్చి తపోవనంబునకేగి కొన్నిదినంబులకు శివలోకంబుచేరె. మునీంద్రులారా యిట్టి మహాత్మ్యతీర్థంబచ్చట స్నానాది క్రియలుజరిగించి రుద్రదర్శనంబుచేసి యగస్త్యతీర్థంబునకు బోవలయు.

## అగస్త్యతీర్థ మహాత్మ్యము.

ఈతీర్థంబు మహాత్మ్యాన్వితంబగు తీర్థంబనిన సూతా యాతీర్థప్రభావంబు మాకు కృపచేసి చెప్పవేయనిన మునీంద్రులారా పూర్వకాలంబున మేరుమందర పర్వతంబులతో వింధ్యపర్వతంబు కలహించుకొని వారికంటె పొడవుగావలెనని యెదిగిన సూర్య చంద్ర గతుల కష్టంబుగ దేవేంద్రాది దేవతలు కైలాసంబునకుబోయి వింధ్యాద్రి గర్వంబు సర్వంబు నివేదించిన సర్వజ్ఞుండాలించి యగస్త్యునింబిలిచి నీవేగి లోకోపకారంబుకై వింధ్యాద్రిపని చక్కచేయుమని యాజ్ఞయిచ్చిన మహాదేవా పార్వతీవివాహ సంభాషణార్థంబు వసిష్ఠు లేగియున్నారు వివాహంబు సన్నిహితంబయియున్నది.

పార్వతి కల్యాణోత్సవ విశేషంబు నాకన్నులజూడ వేడ్కగలదు దేవరవారు పెళ్ళికొడుకగుటజూచిపోదునని మహావినయంబుతో వేడిన

www.mohanpublications.com

కుంభసంభవా నీయంతరంగంబు మాకుదెలుసు నీకోర్కెగలది పెళ్ళి కొడుకు పెళ్ళికూతును వేషంబులతో పార్వతీ సహితుండనయి వేదారణ్యంబులో నీకు సన్నిధించెద నమ్ము నమ్ము మని యగస్త్యు నోదార్చి పంపించెను.

తదుక్తం స్కాందే ॥ శ్లో ॥ అగస్త్యః । ఉద్వాహ వేషంతేదేవ నద్రక్ష్యామి కథంవిభో । ఇతివిజ్ఞాపి తశ్శంభుః ప్రదః కుంభజః మబ్రవీత్ ॥

శ్రీశివః॥ కుంభజోద్వాహ వేషంతె పార్వత్యాలహితో హ్యహం। వేదారణ్యే మహాపుణ్యే దర్శయిష్యామ్యసంశయః । తద్గచ్ఛశీఘ్రంవింధ్యాద్రింనిగృహీతుం మునీశ్వర ఇతి॥

ఇవ్విధంబున భగవంతుడైన శివుండు సమాధానంబుజెప్పి నగస్త్యుంబంపిన వింధ్యాద్రినుంచి దక్షిణదేశంబులెల్ల సంచరించి గంధమాధనపర్వతంబునకుబోయి నచ్చట స్వభావంబుతో విలసిల్ల నొకతీర్థంబు నిర్మించె నది ఈశ్వరానుగ్రహంబున బహుపుణ్యతరంబను మహాపాపనాశకరంబగు తీర్థంబునయ్యె నాతీర్థంబులో ననేకులు కృతార్థులైరి యనుచు జెప్పిన సూతా దాని ప్రభావంబు సంపూర్ణంబుగా దెలుపు మని మునులడిగిన.

మునులారా నేనెంతని వర్ణింతు నొక్క కథజెప్పెద వినుండు పూర్వకాలంబున దీర్ఘతాముసుండను నొకమునీంద్రుడతనికి శక్తివంతుడను నొక పుత్రుండుగలిగి బహుబుద్ధివంతుడై శాంత స్వభావుండయిన నబ్బాలుని కుపనయనాది సంస్కారంబులు నిర్వర్తించిన బ్రహ్మచర్య వ్రతంబునడుపుచు విద్యార్థియై యుదంకుడను మహర్షి సమీపంబున నాల్గువేదంబులు నారుశాస్త్రంబులు సార్థకంబుగా జదివి సకలపురాణోపనిషత్తులను జదివి యిరువదివర్షంబులు గురుప్రునింట నివసించి సకల

www.mohanpublications.com

విద్యావిచక్షణుఁడయి గురువగు సుదంకునకు సాష్టాంగ దండ ప్రణామంబుగావించి స్వగృహంబునకుఁబోవ నుద్యోగించిన సుదంకుండు సంతోషించి యతనిభావంబు గ్రహించి కక్షీవంతుని యనుగ్రహించి నీవుసేతుమూలంబగు గంధమాధనంబునకుఁబోయి యచ్చట నగస్త్యకుండంబు గలదు మహాపుణ్యాకర్యంబు భుక్తిముక్తిప్రదంబు మనోభీష్టప్రదంబచ్చట మహానిష్ఠతో మూఁడుసంవత్సరంబులు పంచాక్షరీమంత్రంబు జపంబు సేయుము నీతపస్సుఫలించి నాలుగోసంవత్సరంబు ప్రవేశించు ప్రథమదివసప్రాతఃకాలంబున మహాకాయంబును చతుర్దంతంబులు సర్వాంగపాండురంబునగు మహోన్నతిగజం బుద్భవిల్లు.

ఆగజారోహణంబుగావించి స్వనయుఁడనే రాజర్షి పట్టణంబునకు బొమ్ము నిన్నుఁజూచి యతఁడు ప్రత్యుత్థానాభి వందనంబులు జరిగించి మన్నించి యతనికన్యకను నీకిచ్చి వివాహంబు చేయునందువలన నీవు బహుశుభంబుతోఁ డఁగూడుదువని యుపదేశించిన సంతోషించి పాదాభివందనంబులుగావించి గంధమాధన పర్వతంబునకుఁబోయి తీర్థదర్శన వందనంబులుగావించి స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి యాదినంబు క్షేత్రోపవాసంబుచేసి మరునాఁడుసూర్యోదయకాలంబున యథాకృత్యంబులుజరిపి పారణముచేసి యవ్విధంబునచేయు వర్షత్రయ మగుటయు తృతీయసంవత్సరాంత దివసంబున సాయంసంధ్యా వందనంబొనరించి సుఖనిద్రఁజెందియుండ నారాత్రిప్రహరత్రయ సమయంబున మహా కలకల ధ్వని వినంబడెను.

అదికక్షీవంతుఁడు లేచి చూచిన నాసమయంబున దైవవశంబున స్వనయుండనురాజు వేటమార్గంబునకై గంధమాధనపర్వతంబునకు వచ్చె నంతట కక్షీవంతుండు దంతధావనాది కాలోచితకృత్యంబులఁదీర్చి యున స్నానము సంకల్పపూర్వకంబుగాచేసి సంధ్యావందన దేవర్షిపితృతర్పణాదులు యథాశాస్త్రంబుగా జరిగించి పంచాక్షరీ జపంబు సేయుచుండ

www.mohanpublications.com

వంతలోనగస్త్యతీర్థంబులోనుంచి చతుర్దంతంబులుగలదియు కైలాస పర్వతంబు వగిదిమహాకాయంబుగలదియు పండువెన్నెలభంగి ధవళశరీరంబు గలమహాగజంబొకటి నిర్గమించిన యుదంకుండిచ్చిన వరంబు ప్రత్యక్షం బయ్యెనని సంతోషించెను.

పిమ్మట గజసమీపంబునకుబోయి నిలిచి తన గురువును వరప్రదాతయునగు నుదంకునిదలచుకొని నమస్కరించి యగస్త్యతీర్థంబునకు సాష్టాంగ ప్రణామంబాచరించి మాటిమాటికి తీర్థశ్లాఘన చేయుచు కక్షీవంతుడు గజారోహణంబుచేసి స్వనయుడనురాజు పట్టణంబునకుపోవ నుద్యుక్తుండై యున్న వేటమార్గంబుకై వచ్చియున్న స్వనయుండు చతుర్దంతగజారూఢుండగు కక్షీవంతునిజూచి పూర్వకాలంబున నారదమహాముని తనకుజెప్పినమాటలు దలచుకొని తనపుత్రికచేసుకున్న ప్రతిజ్ఞచెల్లెనని మహానందభరితుడై ధవళగజారూఢుండగు కక్షీవంతుని సముఖంబునకుబోయి హేబ్రాహ్మణోత్తమా నీవెవరికుమారుండవు నీనామధేయంబెద్ది నీవెవరికిశిష్యుండవు యీగజంబెక్కి యెక్కడికిబోదలచితివని స్వనయుండను రాజడిగెను.

తదనంతరము దీర్ఘతమస్సుయొక్క కుమారుడ కక్షీవంతుడని నాపేరు స్వనయుడనే రాజర్షిపట్టణంబునకుబోయి యారాజుకొమార్తెను మనోరమయను కన్యకను వివాహంబగు నిచ్చగలిగి పోవుచున్నానని కక్షీవంతుండు జెప్పిన స్వనయుండు సంతోషించి కృతార్థోహం కృతార్థోహమనుచు వచించుచు హేపండితోత్తమా నీవు పోదలచిన స్వనయుండను నేనేమనోరమయను కన్యక నాదూతియె బహుకాలంబునుంచి నారదవాక్యంబులునమ్మి యెదురుజూచుచున్న నాకునీదర్శనంబొసగుట యదృష్టంబేకదా మధురాపట్టణంబులో నాచిన్నది యున్నది. మీరు విచ్చేసి వివాహంబుగావలయునని కోరెను.

www.mohanpublications.com

అందుకాయన నోరాజోత్తమా మాగురువాక్యప్రకారంబు సమకూడె సంతోషించితిగాన వేదారణ్యంబులో మాతల్లిదండ్రులున్నారు వారికడకొకవిప్రునంపి వారిని దోడ్తెచ్చి నాకు వివాహంబొనరింపుమనిన రాజుసంతోషించి సుదర్శనుడను బ్రాహ్మణోత్తముని సమస్తసైన్యంబులు తోడుయిచ్చి వేదారణ్యంబునకంపించిన వాడేగి తామువచ్చిన వర్తమానంబంతియు వినిపించిన దీర్ఘతమనుండు సంతోషించి సుదర్శనునకాసనార్ఘ్యపాద్యాద్యుపచారంబులుసలిపి యన్యోన్యంబు కుశలప్రశ్నలైనపిమ్మట భోజనంబులొనరించి వాహనారూఢులై సమస్తసైన్యంబులు తోడరాగ సుదర్శనసహితుండై యారుదివసంబుల కగస్త్యతీర్థతీరసమీపంబున కేతెంచిరి.

అంతట తండ్రినిజూచి కక్షీవంతుండు పాదాభివందనంబు గావించిన దీవించి యాలింగనంబుచేసుకొని మూర్ధాఘ్రాణంబుచేసి సంతోషించుచున్న నెడ సుదర్శనుండు జెప్పుటచే దీర్ఘతమనుండువచ్చుట విని స్వనయుండేగి దీర్ఘతమమునకు పాదాభివందనంబుచేసిన లేచి కౌగలించుకొని యన్యోన్య కుశలప్రశ్నలైన పిమ్మట వివాహాదులు జరుగుచున్న సమయంబులో కక్షీవంతుని గురువగు నుదంక మహాముని విచ్చేసిన సమస్తజనులు ప్రత్యుద్ధానంబులుచేసిరి కక్షీవంతుండెదురేగి గురువు పాదంబులపైబడి గోత్రనామోచ్చారణంబుసేయుచు సాష్టాంగంబుచేసిన యాశీర్వదించి గ్రుచ్చియెత్తి మూర్ధాఘ్రాణంబుచేసి వత్సానీమనోరథసిద్ధియాయనాయని కుశలంబడిగి కూర్చున్నయెడ దీర్ఘతమా రుషియు వచ్చి యుదంకునికి నమస్కారంబులుచేసి ప్రత్యుద్ధానంబుగావించి పునర్నమస్కారంబుచేసి యన్యోన్యకుశల ప్రశ్నలుజరిగి పిమ్మట యందరు గూర్చుండిరి.

అప్పుడు స్వనయుండువచ్చి వారిద్దరికి నమస్కారంబులు గావించి కుశలంబడిగి తనకన్యను కక్షీవంతునికివ్వ నిశ్చయించినమాట నెరిగించిన

www.mohanpublications.com

సుదంకుండు సంతోషించి తనవాక్యసంసిద్ధికానందించి వివాహప్రశంస ప్రసంగంబు జరిగించి రాజోత్తమా కక్షీవంతుని వినాసగిరంబునకు దోడ్కొనిపోయి వివాహంబుచేసుటకంటె నీయగస్త్యతీర్థ సన్నిధిని మా యెదుట వివాహంబు చేసితివేని యిహపరంబులకన్నిటికిని సర్వోత్తమంబు గాన నీతనయ నిచ్చుటకై దోడితెప్పించుమని జెప్పిన పెద్దలవాక్యంబు ముద్దుగాగైకొని సమస్తసైన్యంబులబంపి తనకుటుంబంబును మధురా పట్టణంబునుంచి రప్పించి శుభముహూర్తంబున కన్యాదానంబుచేసి కక్షీ వంతునికి మనోరమను పాణిగ్రహణంబుచేయించి చతుర్దంతిగజంబుపై గూర్చుండబెట్టి పూరేగించి వివాహశోభనంబుగడిపి బ్రాహ్మణోత్తముల కగణ్యంబులగు ధనంబులు ననేకంబులగు రత్నకంబళంబులు దుకూల వస్త్రాభరణంబులు యథేచ్ఛగా గొల్లబెట్టి అల్లునకు బిడ్డకు కట్నంబు లొసంగి ధవళగజంబుపై గూర్చుండబెట్టి వేదారణ్యంబునకు శుభంబుగ దోలించె.

ఈయగస్త్యతీర్థప్రభావంబున సుదంకుని వరంబు సఫలంబయ్యె మనోరమ ప్రతిజ్ఞజెల్లె సకలజనంబులకు సంతోషంబయ్యె వింటిరా యగస్త్యతీర్థంబు మహిమాన్వితంబు.

అందు భుక్తిముక్తిప్రదుడగు వేదాటవీనాథుసేవింపుచు చిరకాలంబు సుఖంబుండె నంతిప్పనయ్యుం డగస్త్యతీర్థంబునం గృతస్నానుండై నిజసైన్యంబులగూడి పురంబునకుంజని సుఖంబుండెనో మునీంద్రులారా యిట్లగస్త్య తీర్థస్నానప్రభావంబును కక్షీవంతుం డనన్యదుర్లభంబగు రాజకన్యకా పరిణయంబుగావించె నీయితిహాసంబు వేదసిద్ధంబును పుణ్యప్రదంబును యశస్సౌభాగ్య కారియునై వెలయుచుండు.

అక్కడ స్నానంబు గావించి తదుపరి రామ కుండంబునకు బోవలయును.

www.mohanpublications.com

## రామకుండ మహాత్మ్యము.

మునులారా రామతీర్థంబువంటి మహాతీర్థంబు లోకతీర్థంబులలో లేదు సుండీ రామతీర్థంబు సన్నిధి నొకతృణంబు దానంబుచేసిన కోటి గుణితఫలంబు నొసగును. అగస్త్యమహాముని శిష్యుండగు సుతీక్ష్ణుండను మహాముని రామకుండంబు సన్నిధిలో శ్రీరామమంత్రంబును ప్రతిదివసంబును పంచసహస్రంబులు జపంబుసేయుచు భిక్షాహారియై నియతప్రతిష్ఠుండై బహుకాలంబు తపంబుచేసి సీతాసమేతుండగు శ్రీరామదేవుని మనోధారణచే ధ్యానంబుచేసి ననుగ్రహించి ప్రత్యక్షంబైన సుతీక్ష్ణుండు శ్రీరామచంద్రుల స్తుతించెను.

తదుక్తం సేతుమాహాత్మ్యే॥ శ్లో॥ సుతీక్ష్ణః॥ నమస్తే జానకీ నాథ నమస్తే హనుమత్ప్రియః॥ నమస్తే కౌశిక మునియాగరక్షణ దీక్షిత నమస్తే కౌసలేయాయ విశ్వామిత్రప్రియాయచ॥ ఇది॥

ఇవ్విధంబున ననేకవిధంబుల గొప్పగా స్తోత్రంబు గావించుచు నీప్రకారంబున ప్రతిదినంబును జపంబుసేయుచు బహుదినంబులు గడచిన రామచంద్రునికటాక్షంబున నేనద్వైతజ్ఞానంబును ప్రత్యగాత్మైక్య లక్షణంబును త్రయీధర్మవిచారంబున ననేకవిద్యా ప్రసంగకర్తృత్వంబును పరకాయ ప్రవేశంబును వియద్గమనవిహారంబును సర్వకళా విచక్షణత్వంబును బ్రహ్మ విష్ణు మహేశ్వరాది లోకంబులకు పోకడ రాకడయు పిపీలికాది సమస్తజంతు భాషాపరిజ్ఞానంబును యింద్రియాగమ్య వస్తు దర్శనంబును మొదలగు విశేషంబు లాతీర్థస్నాన మహాత్మ్యంబున దొరికెను.

ఓమునీంద్రులారా శ్రీరామకుండతీర్థమహాత్మ్యం బఖండంబని చెప్పి మరియు నాతీర్థంబున శ్రీరామచంద్రుండు స్థాపించిన లింగంబు మహా

www.mohanpublications.com

పాతక నాశనంబు భుక్తిముక్తిప్రదంబు నాలింగంబునకు నభిషేక పూజ లొనర్చినవారికి సకలైశ్వర్యసిద్ధిగలుగు. మరియొక్కవిశేషంబు జెప్పెద వినుండు కురుపాండవ యుద్ధంబులో భీష్ముండుచెల్లిన పిదప ద్రోణాచార్యులకు సేనాధిపత్య పట్టాభిషేకముగావించిన దుర్యోధనుని భక్తికి సంతోషించి ధనురాచార్యుడు మహా శౌర్యంబున సకల సైన్యంబుల నేల గలుపుచు నప్రతిద్వంద్వ యుద్ధంబునేయుచున్న పాండవులోర్వక శ్రీకృష్ణమూర్తితో మంత్రాలోచనంబు నేయుచు ద్రోణాచార్యుండు మృతిబొందు నుపాయంబులు వెదకుచు నవశులై యుండిరి.

అంతట నొకనాడు భీమునికి ద్రోణాచార్యులకు యుద్ధంబగుచుండ భీముండోర్వలేక హేధనురాచార్యా లోకంబులో బ్రాహ్మణ ధర్మంబులు వేదాధ్యయనంబు శ్రౌతస్మార్తనిత్యానుష్టానం బహింసయు మీరు బ్రాహ్మణధర్మంబువిడచి శస్త్రాస్త్రధారణంబుజేసి బహుజనంబుల హింసింపుచు కళత్రపుత్రసంరక్షణకొరకేగదా వ్యాధుఁడు బహుమృగంబులజంపి దారాపుత్రాదుల పోషించినవిధంబు నడుచుటయుక్తంబుగానైనను నీకుమారుండగు యశ్వద్ధామ యుద్ధంబులో మృతుడయ్యె నింక యుద్ధంబుజేసి యెవ్వరిని బ్రతికించుకొరకు గావున శౌర్యంబుమాని బ్రాహ్మణ ధర్మంబు స్వీకరింపు మన్నను యశ్వద్ధామ మృతిబొందెననిన మనోవైకల్యంబునొంది యాలోచించి నీమాట నాకు సత్యంబనితోచదు. ధర్మసుతుండగు యుధిష్ఠిరుండు సత్యవాక్యపరిపాలకుండు గావున నతండు నాయెదట సత్యంబని వచించెనేని నమ్మెదు యుద్ధసాధనంబులు విడుతునని వచించె.

అటుపిమ్మట నందరు కృష్ణునితో జెప్పిన విచారించి కృష్ణునిం దోడ్కొని ధర్మరాజు పాలికింబోయి ఈకథవృత్తాంతంబంతయు నారాజుకు వినుపించి నీవీమాట ద్రోణాచార్యునెదుట బలికితివేని యతడు వస్త్రసన్యాసంబుజేసునప్పుడు మనకు జయంబునకు త్రోవదొరుకునని

www.mohanpublications.com

బహు విధంబుల మాటలు చెప్పినధర్మరాజు వినకున్న శ్రీవిష్ణుం డందుపై
రాజానీవీకార్యంబు జేసిన దోషంబులేదు ప్రాణసంరక్షణార్థమై యసత్యం
బున దోషంబురాదని పురాణంబులు ధర్మశాస్త్రంబులు జెప్పుచున్నవని
యనేక విధంబుల నొప్పించి మెప్పించి మరియొకయుపాయంబుగల దశ్వ
త్థామయనుగజంబు భీమునిచే మృతినొందినమాట సత్యంబుగదాయిదే
తీరున నీవుబలికినదాని యుపాయంబు మీమెరగూర్తుమని శ్రీకృష్ణమూర్తి
నయంబున భయంబున వినయంబున నుపాయంబున బోధపరుపనెట్ట
కేలకు కృష్ణునిమాట మించజాలక నొప్పుకొనియె.

తర్వాత పదుగురు గుమిగూడుకొని ద్రోణాచార్యుల నెదటికి
బోయి నిలిచి ధర్మరాజు ముఖవచనంబున ఈదినంబున భీమునిచే యశ్వ
త్థామ యనువరకు స్ఫుటంబుగాబలికె గజంబు॥ యనుశబ్దంబు॥ మెల్లన
గాబలికె॥ నంతలో భేరీపణవాదులు వాయించిరి॥ చచ్చెననుశబ్దంబు॥
దృఢంబుగాబలికె। నామాటవిని ద్రోణాచార్యుండు ధర్మరాజసత్యంబు
బలకడని నమ్మి ధనుర్బాణంబులువిడిచి యస్త్రసన్యాసంబు గయికొని
విరక్తుండయి మరణాయ చిత్తుండయి గాఢసమాధిచేత హఠయోగంబుచే
ప్రాణత్యాగంబుజేసె.

అంతట దృష్టద్యుమ్నుండు రథంబుపై కురికి ద్రోణాచార్యుని
కేశంబులచేత నమర్చుకొని ఖడ్గంబున శిరంబు ఖండించె నర్జునాదులం
దలంచి రంతట యశ్వత్థామ యీసమాచారంబువిని కోపోదగ్రుండై
కొన్నిప్రతిజ్ఞలంజేసె. తదుపరియుద్ధంబంతయు శాంతంబై ధర్మరాజునకు
ధౌమ్యాదులు శుభముహూర్తంబున పట్టాభిషేకంబుజేసుటకై సంక
ల్పంబు జేసిన నాకాశంబున హోధర్మరాజా నీవసత్యంబుపలికి ద్రోహా
చారూపంబైన ద్రోణవధోపాపంబు గావించితి గావున నిందువలన
నసత్యదోషంబును గురుద్రోహంబు నీమాట నమ్మునుసని విశ్వసించిన

www.mohanpublications.com

దానిచే విశ్వాస ఘాతుకంబును బ్రహ్మహత్యయు నిన్ని జతగూడి యున్నవి. గావున నీపాపములు బాపుకొనుదనుక పట్టాభిషేకంబున కర్హుండవుగావని లోకంబువిన నాకాశంబున మ్రోగెను.

ఆమాటలకు ధర్మరాజు లజ్జాభయాకుల చిత్తుడై ధౌమ్యాదిరుషు లందరు శ్రీకృష్ణమూర్తితో యాలోచించుచు చింతించుచున్న సమయ మున వేదవ్యాసు డచ్చటికి విచ్చేయ సభాసదులందరు ప్రత్యుద్ధానము జేసిరి. యుధిష్ఠిరు డనుజసహితుడై యెదురేగి పాదాక్రాంతుడై తోడ్కొనివచ్చి మణిమయపీఠంబుపై కూర్చుండబెట్టి వివిధోపచారం బులు జరిపి యంజలిబద్ధుడయినిలిచి యోమహాత్మా యశరీర వాణి వ్విధంబున బలికిన దిందుకేమిసాధనంబు మీకంటె ప్రాపకులు మా కెవ్వరులేరుగదా యస్మద్రక్షణోపాయంబు విచారించి రక్షింపురక్షింపు మనుచు ప్రార్థించెను.

అందుకు వేదవ్యాస డాలోచించి రాజోత్తమా వెరువ కొక యుపాయంబుజెప్పెద సేతుమూలంబున గంధమాదన పర్వతంబుమీద రామకుండంబుగలదు. అది మహాపాతకుల పావనులజేసినది నీవు చింతించ కచ్చటికేగి యాతీర్థంబులో యథాశాస్త్రంబుగా స్నానంబు సేయుము నీపాపంబులన్నియు భస్మంబగునని చెప్పిన సంతోషించి తమ్ములు దానును ద్రౌపది తల్లియును ధౌమ్యుండుతోడ రాగబయలు దేరి గంధమాదన పర్వతంబునకుపోయి రామకుండంబులో యథా సంకల్పవిధిగా స్నానంబుజేసి క్షేత్రోపవాసంబుజేసి పార్వణ విధానంబుగా శ్రాద్ధంబు జరిగించి విత్త శాఠ్యంబులేకుండ దానంబులు దీనాంధ కృపణు లకు వస్త్రంబులు లన్నంబులుబెట్టించి యొక్కమాసంబు నియతా హారుండై యక్కడనుండి సత్కథాశ్రవణంబు సేయుచుండెను.

www.mohanpublications.com

అంతట నొకదినంబున నశరీరవాణి ధర్మనందనా నీవు పవిత్రుండ వైతివి రాజర్షుండవైతివి నీవు హాస్తినాపురంబునకుబోయి మంత్రి సామంత పురోహితాదులుగొలువ పట్టాభిషిక్తుడవై యథాసుఖంబున రాజ్యపరిపాలనసేయుమని వినబడ్డ ధౌమ్యాది మహామునులు సంతోషించిరి ధర్మరాజు శ్రీరామప్రతిష్ఠితంబగు లింగమున కభిషేక పూజాదులు జరిగించి యనేకదానంబులు కొల్లబెట్టి తమ్ములు తానును కరినగరంబునకువచ్చి యథాశాస్త్రంబుగా పట్టాభిషిక్తుడయ్యె. మునీంద్రులారా రామతీర్థమహాత్మ్యం బద్భుతంబు వింటిరిగదా యాతీర్థంబునకు పోవ నశక్తులగు వారీయధ్యాయంబు జదివిన వినిన కైలాసవాసులగుదురని చెప్పి యాతీర్థంబులో స్నానంబు జేసి లక్ష్మణతీర్థమునకు పోవలయు.

## లక్ష్మణతీర్థ మహాత్మ్యము.

ఈతీర్థంబు మహోత్తమంబైనది మహాపాతక నాశనకరంబైనది బలరామునకు బ్రహ్మహత్యా నివృత్తిగావించిన తీర్థంబని సూతా బలరామునకు బ్రహ్మహత్య యెట్లు సంభవించె నావృత్తాంతంబు వినిపింపుమనిన మునులారా కురుపాండవులకు యుద్ధసన్నద్ధంబైన సమయంబున బలభద్రుం డొకరిపక్షంబున బొందక మధ్యస్థుండయి యాఘోర కార్యంబు కన్నుల జూడజాలక యాత్రాఫలంబున బయలుదేరి ప్రభాస తీర్థంబునకుజేరెను.

అచ్చట దేవర్షి పితృగణంబులకు తృప్తిగావించి తదనంతరమున సరస్వతీ పృథూదక బ్రహ్మతీర్థంబులు మొదలగు తీర్థంబుల యాత్రలు సలిపి నైమిశారణ్యమునకు బోయి దీర్ఘసత్రంబుగావించుచున్న మునీంద్రులందరు ప్రత్యుద్ధానాభి వందనంబులు స్తోత్రంబులు సేయుచు బహుమానించిన సంతోషించియున్న తాసనంబుపై గూర్చుండి యున్నత గ్రీవుడై లేవకున్న సూతునింజూచి మహాక్రోధంబుతో కర్మనింద్యామును

www.mohanpublications.com

లోమహుడగు నీసూతుడు నేనువచ్చిన లేవక మహాగర్వంబుతో నున్న వాడు వీడు మునులకన్న యెక్కుడకాడుగదాయని క్రోధతామ్రాక్షుడై చేతులోనున్న కుశాగ్రంబుతో మొత్తిన శిరంబుభిన్నంబై సూతుడు మృతుడయ్యె.

అంతట మునీంద్రులంద రాహాకారంబులు సేయుచు బలరామా నీవు సాక్షాచ్ఛేషాంశా సంభూతుడవు మహాత్మునివిధంబున ఘోరాకారంబుజేసితివిగాన బ్రహ్మహత్యా పరీతుడవైతివి దీనికి ప్రాయశ్చిత్తంబు నీకవశ్యంబని నిర్ణయించిన బలభద్రుండు చింతాక్రాంతుడై భూసురేంద్రులారా దీనినిష్కృతి మీరేవివరించి చెప్పదగుదురని ప్రార్థించిన బలరామా నీప్రభావంబులజూడ మృత్యుంజయ పరాక్రముడవుగాన నితని పునర్జీవితునిం గావింపుము నీబ్రహ్మహత్యమానునని సంకర్షణుడు నామాయాబలంబున బ్రతికింతునని పునర్జీవితుని గావించె.

అప్పుడు మునీంద్రులు సంతసించిరి మునులకై జూచి బలరాముడు మరి మీకోరికేమనియడిగిన బలభద్రా మేము సతతంబు యజ్ఞంబులు గావింపుచుండ నిల్వలుండను రాక్షసపుత్రుడు వల్కలుడనువాడు సర్వకాలంబుల హోమసమయంబుల మూత్రపురీష రక్తవర్షంబులు గురిపించుచు యజ్ఞంబులు పాడుజేయు మరివాడెవ్వరికి జేయుడుగాని బాధ తీర్చితివేని మేముసుఖింతుము మనోభీష్టసిద్ధి గలుగునని ప్రార్థించిన సర్వకాలము కూడునంత కక్కడనివసించియుండి పర్వసమయంబున బ్రాహ్మణోత్తములు హోమముచేయుచున్న సమయంబున నారాక్షసుడు నీలపర్వతంబు భంగి మహాకాయుండును కరాళదంష్ట్రుండును విస్ఫృతాకారుడును రక్తాక్షుడు నూర్ధ్వ కేశుడనై వచ్చి యజ్ఞాగారంబుల పవిత్రంబులు సేయుచుండెను. అదిజూచి ముసలసీరంబుల దలంచి సన్నిహితంబులగుటయు ముసలంబుచే నొకపెట్టుబెట్టిన భిన్నశిరస్కుడై నేలగూలి ప్రాణంబులువిడిచె మునులత్యానందంబు నొందిరి. తదుపరి బలరాముండు

www.mohanpublications.com
మునీంద్రులారా నాకేయ్యది కర్తవ్యంబు జెప్పుండని రామా మరియింక నెయ్యది కర్తవ్యంబని యడిగితివి గాన నొకసంవత్సరంబు సకలతీర్థ యాత్రా సమాప్తి జరిగించితివేని లోకంబు నీకుపకారంబగు నీదోషంబు నిశ్శేషంబగు ననిన సంతోషించి కృష్ణాగ్రజుండు సర్వతీర్థంబులు గ్రుంకులాడి నిజ పురంబునకు బోవుచుండెను.

అంతట నాశరీరవాణి మోహాపహంసేయు నీకు యాత్రా పూర్తి కాలేదు బ్రహ్మహత్య నిశ్శేషంబుగాలేదని యొక ధ్వని వినవచ్చిన చింతాక్రాంతుడై మరలి నైమిశారణ్యమునకుబోయి మునీంద్రులకా సమాచారము వినిపించిన బలరామా నీవు గంధమాదనపర్వతంబున శేషాంశావిర్భూతుండగు లక్ష్మణునిచే నిర్మించబడిన తీర్థంబులో స్నానం బొనరించితివేని యాత్రా సంపూర్తిగలిగి దోషంబు నిశ్శేషంబగునని జెప్పిన బలరాముండు తత్క్షణంబున లక్ష్మణతీర్థంబునకుబోయి స్నానంబు జేసిన నాగాశవాణి బలభద్రా కృతార్థుండవైతివి నీపురంబునకు బొమ్మని వినవచ్చిన సంతోషించి ద్వారకానగరంబునకు బోయెను.

కావున లక్ష్మణతీర్థ మహాత్మ్యమిట్టిదక్కడ స్నానమాచరించి జటాతీర్థంబునకు బోవలయును.

## జటాతీర్థ మహాత్మ్యము.

అది మహోత్తమతీర్థం బజ్ఞాననాశన సాధనం బవిద్యానాశన కారి బుద్ధి శుద్ధి ప్రదంబు భుక్తిముక్తిప్రదంబు మనశ్శుద్ధిని గోరినవారు మహాదర్కటంబులగు వేదాంతశాస్త్రంబులు జదివి తర్కములుజేసి క్రియా పర్యవసానంబు నొందజాలరు జటాతీర్థంబులో స్నానమాత్రంబులో పరిశుద్ధులగుదురని జెప్పిన సూతా యాతీర్థంబున కంతమహాత్మ్యం బెట్లు గల్గెనని యడిగిన మునీంద్రులారా శ్రీరామచంద్రుండు చతుర్దశ సంవత్స

www.mohanpublications.com
రంబును జటాధారినై వనవాసంబుజేసి తపస్సుగావించి రావణవధా నంతరము జటామండలం బాతీర్థంబులో ప్రక్షాళనంబు జేసుటచే తపః ప్రభావ రూపాపూర్వఫలంబా సలిలంబులలో మేళనంబగుటచే దానికింత మహాత్మ్యంబు సిద్ధించినది.

వింటిరా మునులారా పుణ్యంబుల తారతమ్యంబులు వినిపించెద షష్టిసహస్ర వర్షంబులు జాహ్నవీనదిలో స్నానంబుజేసిన ఫలంబు దేవ గురుండగు బృహస్పతి సింహరాశి స్థితుడైన సమయంబున నొకదినంబు గోదావరిలో స్నానంబుజేసిన లభించునటువంటి గొదావరి పుష్కరిణీ స్నానంబులు పదివేలు గావించిన ఫలంబు గోమతీనదిలో నొకసంవత్స రంబు స్నానంబుజేసిన ఫలించు నన్ని మహాపుణ్యంబులు గంధమాదన పర్వతంబున జటాతీర్థ దర్శనమాత్రంబున లభించుస్నానంబుజేసినవారి కెంతిపుణ్యముగలదో నేనెంచజాల నాత్రిమూర్తులకే తెలుసును.

పూర్వకాలంబున వరుణపుత్రుండగు భృగువె మనసుద్ధిగోరి తండ్రినడిగిన వరుణుండు వారుణికింజెప్పిన జ్ఞానంబు వినిపించెద వినుండు.

తదుక్తంస్కాందే॥ శ్లో॥ భృగుర్వై వారుణిః పూర్వాం వరుణంపి తరంతదా।బుద్ధిశుద్ధిప్రదోపమయప్పృచ్ఛత్పావనంశుభం ॥

వరుణ॥ రామసేతౌ భృగోపుణ్యే గంధమాదనపర్వతే । స్నాన మాత్రాజ్జటాతీర్థేబుద్ధిశుద్ధిర్భవేద్ధ్రువం॥

ఇవ్విధంబున తండ్రి యాజ్ఞాప్రకారంబున భృగుడు జటాతీర్థంబు లోస్నానంబుజేసి బుద్ధిమంతుడయ్యె నొకనాడు శుకయోగీంద్రుండు జన కుండగు వేదవ్యాసమహాముని యాజ్ఞవలనస్నానంబాచరించి స్వస్వరూ ప్యంతజ్ఞానానంద భరితుండై నిర్మలుండయ్యె గావున జటాతీర్థమాహా త్మ్యంబునచ్చట స్నానంబుగావించి లక్ష్మీతీర్థంబునకు బోవలయు.

www.mohanpublications.com

## లక్ష్మీతీర్థ మాహాత్మ్యము.

ఈతీర్థంబు మహాలక్ష్మీప్రదంబెట్టిదరిద్రులైన కొట్టికష్టభాజనులైన నాతీర్థంబులో స్నానంబుచేసిరేని శ్రీమంతులగుదురు. ధర్మరాజు యీ తీర్థంబులో స్నానంబుచేసి మహదైశ్వర్యాభివృద్ధిగల్గి రాజసూయం బొనరించె రాజ్యాభిషిక్తుండయ్యె శత్రునాశంబు గావించెనని చెప్పిన సూతా ధర్మరాజున కాతీర్థ మహాత్మ్యం బెవ్వరు చెప్పి రతండేరీతి స్నానంబుచేసె కథాక్రమంబు వినుపింపుమనిరి.

ఓమునీంద్రులారా ధర్మరాజాగ్రజుఁడు ధృతరాష్ట్రునిచే వెలువబడి యింద్రప్రస్థంబులో నున్నయెడ శ్రీకృష్ణమూర్తి వారి సర్వార్థంబై కొన్నిదినంబు లక్కడయున్న సమయంబులో నొకనాఁడు ధర్మరాజు కృష్ణమూర్తితో పుండరీకాక్షా దుర్యోధనుండు మహాభాగ్యం బనుభవించుచుండ మేమీరీతి శ్రమలనుభవించుచుంటిమి స్వామి కటాక్షం బుంచి మాకు సుఖోపాయంబుచెప్ప వానికంటె మాకు దీనతెవరుగలరని ప్రార్థించిన వాసుదేవుండు విచారించి యుధిష్ఠిరా గంధమాదన పర్వతంబు మీద లక్ష్మీతీర్థమని యున్నదనేకులాతీర్థంబులో స్నానంబుచేసి శ్రీమంతులైరి గావున నీవు సహోదరసహితుండవై యచ్చటకరిగి కృతస్నానుండవైన నీకష్టంబుదీరును. నీకుశ్రేయస్సు యశస్సు సంభవించునని చెప్పెను.

తత్క్షణంబున భ్రాతృసమేతుండై పోయి యాతీర్థంబులో స్నానంబు చేసిన వచ్చి దిగ్విజయంబుచేసి రాజసూయయాగంబొనరించి మహాప్రాప్తమైన భాగ్యంబును సుకీర్తినిబొందె వింటిరా మునీంద్రులారా ధర్మరాజున కైశ్వర్యకారణం బాతీర్థస్నానంబు నెవరు స్నానంబాచరించిన లక్ష్మీవంతులగుటకు సందేహంబు లేదక్కడ స్నానంబుచేసి తదనంతరం బగ్నితీర్థంబునకు బోవలయు.

www.mohanpublications.com

## అగ్నితీర్థ మహాత్మ్యము.

ఇది మహాతీర్థంబు సర్వపాపహారణంబు పిశాచాది మహా పీడా నివారకంబు మునీంద్రులారా దానిమహాత్మ్యంబు నేను వర్ణించజాలననిన సూతా నీకుదెలిసినంత నట్లాతీర్థ మహాత్మ్యం వినుపించుమని వేడిన మునీంద్రులారా శ్రీరామచంద్రుండు రావణాసురునివధించి విభీషణునకా చంద్రతారార్కంబుగా ప్రభుత్వంబు సేయుకొరకు పట్టాభిషేకంబుచేసి సీతాలక్ష్మణ సహితుడై సముద్రతీరంబున సంచరించుచు సీతా మనో దానర్థ్యం బెటువలెనుండునో యిన్నిదినంబులు రాక్షసునింట నుండెనని మనస్సులో జిజ్ఞాసచేయుచు వచ్చుచున్న నగ్నిదేవుండు లక్ష్మీతీర్థంబునకు సమీపస్థలంబగు సముద్రంబులోనుంచి యూతామ్రలోచనుండును పీత వస్త్రుండును దనుర్ధరుండును సప్తజిహ్వుండును మహా తేజస్సుచే దశ దిశాంతరాళంబులు వెలిగించుచు హనుమదంగదసుగ్రీవ విభీషణాదివసు రిస్తసైన్యంబును విన నీలామానుష విగ్రహుండగు శ్రీరామమూర్తితో నిట్లనియె.

ఓ రాఘవా ఈసీతా పతివ్రతప్రభావంబుచే నీవు రావణాసురుని జయించితివి విదిసత్యంబు సత్యంబు పునస్సత్యంబీ సీతాదేవి సాక్షాల్ల క్ష్మీయంశచే యుద్భవించినది పరశురామావతారకాలంబున ధరణీ దేవియు నీయువతారంబున జానకీదేవియు కృష్ణావతారకాలంబున రుక్మిణీ దేవియు కాగలదు శ్రీమహావిష్ణుండవగునీవు లోకరక్షణార్థంబు దుష్ట శిక్షణార్థం బవతారముదైన యెడల ననపాయినియగు లక్ష్మీదేవి సీతాది స్వరూపంబులతో నుదయించగలదని యగ్నిహోత్రుండు లోకంబులు విన ప్రత్యక్షంబుపాన బలికిన సమస్తజను లాశ్చర్యంబునొందిరి శ్రీరామ చంద్రునికి మనోనిర్మలంబయ్యె.

అప్పటినుంచి యగ్నితీర్థంబని ప్రఖ్యాతంబయ్యెనని జెప్పిన సూతా యాతీర్థంబులో నెవరు కృతార్థురయిరని యడిగిన మునులారా పూర్వ

www.mohanpublications.com

కాలంబున పాటలీపురంబని యొకపట్టణంబుగల దాపట్టణంబులో వసుమతుడను వైశ్యశిఖామణి గలడతనికి ముగ్గురుభార్యలు మహాపతివ్రతలు అతడు మహాధర్మాత్ముడు దానశీలుడు భాగ్యవంతు డతనికి పదుగురు కొడుకులు సుపుణ్యుడు పుణ్యవంతుఁడు చారువణ్యుడు మొదలగు తొమ్మండ్రు సుతులు బహుపుణ్యబుద్ధులు వ్యవహారదక్షులు సంసార రక్షణ దక్షులు సన్మార్గప్రవర్తులుగా నున్నారు.

పదియగునాతడు దుష్పావుండనుపేరును వహించె బాల్యప్రభృతి బహుక్రూరకార్యంబులు సేయుచు పట్టణంబులోనున్న శిశువులరహస్యంబుగాబట్టి బలవత్కారణంబు సేయుచు నీటిలోపడద్రొబ్బు పంకంబులో ద్రొక్కు నడవిలో గొంతుబిసుకు ననేకవిధంబుల శిశుమారణంబగుటచే గ్రామంబుపాడయ్యె నీవార్త రాజువినిబాలవధచేయువాని పట్టితెమ్మని తలవరిప్రభుతల కత్యంతతీక్ష్ణంబైన యాజ్ఞచేసె నంతనెవడికిన దొరక డంతట నొకదినంబున నైదుగురువైశ్యపుత్రుల నాటలపేరుబెట్టి తీసుకొని గ్రామంబునకు నతిదూరంబులోనున్న నొకకొలనులో జలక్రీడవినోదంబు జూపించి వంచి కంఠదఘ్నమగు రొంపిలోదించి తాను గ్రామంబులోనికి జనుదెంచె.

అంతట నావైశ్యులు పిల్లలనెదకుచు పిలుచుచు ఘోషించుచు తిరిగితిరిగి యామడుగు సమీపంబునకుబోయి యాపిల్లల పేరుతో పిలిచిన ప్రతిధ్వనులిచ్చిన జాడతో మడుగులోనికిదిగి తృణశైవాలాది సంకులంబగు పంకంబులో దుముకుచు గ్రుంకుచున్న బాలులంగాంచి వెడలించి దేహప్రక్షాళనంబులుజేసి వేదదీర్చియడిగిన జరిగిన వృత్తాంతబంతయు దుష్పావుని చరిత్రంబంతయు వినుపించినవిని రాజుకొలువునకుబోయి జరిగిన వాస్తవంబెల్ల విన్నవించిరి రాజుచింతాశ్చర్యంబులచే విభ్రాంతుండై దుష్పావుని వానితండ్రి వసుమతుని పట్టితెప్పించి విమర్శింప విమర్శింప గ్రామంబులో మృతిబొందినట్టి బాలులందరు వీనిచే మృతులగుట నిశ్చ

www.mohanpublications.com

యంబై వానితండ్రిని బిలిచి నీకొమారునకేమి శిక్షకావలయునని యడిగిన రాజోత్తమా! వీడు బహుబాలఘాదకుండు గావున శిరచ్ఛేదనంబునకర్హుండిందుకు సందేహంబులేదని చెప్పెను.

అతని నిష్పక్షపాతవాక్యంబున కందరాశ్చర్యపడి రాజాయితను వాస్తవప్రసంగంబుజేసెను గమగ నితనితనయుని గ్రామంబు వెడలగొట్టవలయుగాని శిరచ్ఛేదనంబు మానవలయునని పట్టణాశేషంబుపలికిన రాజు వారిపలుకు మన్నించి తనదేశంబు దాటద్రోయించె. నాదుష్పాపుండు దుఃఖించుచుబోయిపోయి గొప్పయరణ్యంబులో మునిమండవిమండితంబగునగ్రహారంబులో భిక్షాజీవనంబుసేయుచు కొన్నిదివసంబులకుగ్రశ్రవనుండను బ్రాహ్మణుని పిట్టిని పట్టుకొనిపోయి జలంబులముంచి జంపిన నావిప్రుండు దుఃఖించి వోపాపాత్మా నీవిట్టి పాపకృత్యంబు జేసితివి గావున నీవును జలంబులో నుద్బంధమరణంబునొంది రౌరవాది నరకవాసంబు లనుభవించి తదుపరి పిశాచరూపంబుతో నభక్ష్యాభక్ష్యాది కార్యాకార్యంబులు జరిగించుచు ఘోరదుఃఖంబు లనుభవించుతువని క్రూరంబగు శాపంబిచ్చెను.

ఆవిధంబున మృతుండయి పిశాచరూపంబులో బాధలనొందుచు దేశదేశంబు లరణ్యంబులు పర్వతంబులు దిరుగుచు దైవఘటనంబున నగస్త్యాశ్రమ సమీపంబున నో బ్రాహ్మణోత్తములారా నేను పాటలీపురంబనుపట్టణంబులో పశుమంతుండను వైశ్యునికి దశమపుత్రుండ నేను బాల్యప్రభృతియు నొనరించిన పాపంబు లివియు యుగ్రశ్రవనుండను బ్రాహ్మణుని శాపంబుచే జలంబులో నుద్బంధమరణంబునొంది నరకంబు లనుభవించి పిశాచంబునై యీరీతిదుఃఖంబు లనుభవించుచున్నాడ మీరు తపస్సంపన్నులు వేదవేదాంతవేత్తలు మీచెంతకుచేరితిని నన్ను రక్షించి నాపదవిమోక్షణంబు గావించితిరేని సుకించెద మీరుపేక్ష చేయుదురేని శిశుమారణకృత్యంబు నాకుసహజంబేకదా యని యివ్వ

www.mohanpublications.com

థంబున సామ వేదోపాయవాక్యంబులు బలుకుచు దిరుగుచునుండ నందులో కొందరు బ్రాహ్మణోత్తముల హస్తమహాముని పాలికిబోయి విన్న వృత్తాంతంబంతియు విన్నవించి.

అగస్త్యుండు కటాక్షించి తన ప్రియశిష్యుండగు సుతీక్షమునిని బిలిచి మునీంద్రా నీవాపిశాచ నివృత్తికొఱకతని నామంబుతో సంకల్పంబు జెప్పి గంధమాదనపర్వంబుమీద నగ్నితీర్థంబులో స్నానంబుజేసితివేని వానిపిశాచత్వంబుమానునని యాజ్ఞాపించిన విని యాజ్ఞశిరసానమించి సుతీక్ష్ణుం డగ్నితీర్థంబునకుబోయి వానినామోద్దేశపూర్వకంబుగా సంకల్పంబుజెప్పి గంధమాదన పర్వతంబుమీద నగ్నితీర్థంబులో త్రిదినంబు స్నానంబుజేసిన వానిపిశాచత్వంబుమాని మహాసుందర రూపంబుతో విమానంబునెక్కి యగస్త్యునిం గొనియాడుచు స్వర్గంబునకు నేగెనని చెప్పెను.

మునీంద్రులు విస్మయంబునొంది నీవట్టి పుణ్యపురుషుండ వెన్ని పురాణంబు లెఱింగుదువు నీసాంగత్యంబున మేము కృతార్థులమైతిమని స్తుతియించి ముందుకథవినుపింపుమనిన మునులారా యగ్నితీర్థంబు స్నానంబుజేసి చక్రతీర్థంబునకు బోవలయును.

## మునితీర్థమను చక్రతీర్థ మహాత్మ్యము.

అది మహామాన్యతంబగు తీర్థంబు పూర్వకాలంబున సూర్యునిక హస్తంబులు భిన్నంబులైన యాతీర్థంబులో స్నానంబుచేసి సంతమాత్రం బున సువర్ణపాణియయ్యెననిన సూతా యిది యద్భుతచరిత్రంబు మహా మహాశ్చర్యకరంబు గావున నాతీర్థకథాక్రమంబునుం క్రమంబుగా విను పింపుమని కోరిన మునులారా పూర్వకాలంబున నహిర్బుధ్నుండను మహాముని గంధమాదన పర్వతంబుపై నొకయాశ్రమంబు గల్పించుకొని యొకతీర్థంబునిర్మించి నిశ్చలచిత్తుండై తపంబుసేయుచున్న మునితీర్థంబని వానికగల్గి ప్రబలించియుండెను.

www.mohanpublications.com

అట్లుండగా నహిర్బుధ్న్యుండను ఋషీశ్వరునిమీఁదికి రాక్షససంఘంబు గూడివచ్చి మహాఘోరంబగు బాధనొసరించిన నవ్విప్రుండు సుదర్శన చక్రంబు నుద్దేశించి మహాస్తోత్రంబు చేసిన నాస్తోత్రంబునకు సంతసించి శ్రీవిష్ణుప్రేరితంబై చక్రంబుజనుదెంచి మహాక్రూరులగు రాక్షసుల ఛిన్నాభిన్నంబులుగావించి నామునిఁ సంరక్షణచేసి యతని ప్రార్థనచే నాతీర్థంబులో నిల్చియుండుటచే దానికి చక్రతీర్థంబనిపేరు విశ్రుతంబయ్యె.

నొకసమయంబున రాక్షసులు చెలరేగి దేవతలపై దండెత్తి స్వర్గంబు చిందరవందరజేసిన దేవతలు దీనులై బ్రహ్మపాలికేగి తమ బాధలు జెప్పుకొన్న చతుర్ముఖుండు చింతించి యోమునులారా గంధమాదన పర్వతంబుమీఁద మహేశ్వరయజ్ఞంబు ప్రారంభించి నిర్విఘ్న పరిసమాప్తినొనర్చితిరేని రాక్షస హితంబగునని జెప్పిన బ్రహ్మయజ్ఞాప్రకారంబు దేవతలుబృహస్పతినిం బురస్కరించుకొని గంధమాదన పర్వతంబునకేగి మహేశ్వరదేవదాకరంబగు యజ్ఞంబునకు సంకల్పంబుచేసి బ్రహ్మకడకుబోయి రాక్షసులు విఘ్నంబుజేయుని స్థలంబేర్పరించమని యడిగిన గంధమాదన పర్వతంబుమీఁద చక్రతీర్థసమీపంబున ప్రారంభంబుసేయుచుండు నిర్విఘ్నంబుగాజన్నించు జరుగు నొకవేళబాధించిన చక్రతీర్థంబులోనున్న సుదర్శనంబును ప్రార్థించను రాక్షసనాశనంబు జేయుననెను.

అక్కడఁపోయి యహిర్బుధ్న్యునమస్కరించి యాయనయాజ్ఞ గైకొని తదాశ్రమసమీపంబున యజ్ఞవాటంబుగల్పించి దేవతలు మునులందరు గుంపులై నిలిచిరి. బృహస్పతి హోతయయ్యె జయంతుండు మైత్రావరుణుండయ్యె మరియునష్టమ వసువచ్ఛావాకుండయ్యె పరాశరుండు గ్రావస్తోతయయ్యె నిషావద్రుండ ధ్వర్యుండయ్యె విశ్వామిత్రుండు ప్రతిప్రస్థాతయయ్యె వరుణుండు నేష్టయు మహేశ్వరుండు ద్గాతయుపవిత బ్రహ్మయు వశిష్ఠుండు బ్రాహ్మణాచ్ఛంసియు శునశ్శేఫుండాగ్నీధ్రుం

www.mohanpublications.com

డును పాపకుండు బుతయు వాయువుద్గాతయు ముకుందుబ్రహ్మాతయు నగ్నస్త్యుండు ప్రహాగర్తయు మధుశ్ఛందుండు సుబ్రహ్మణ్యుండును ఈవిధంబున నేర్పడిరింద్రుండు యజమానుండయ్యె వ్యాసపుత్రుండగు సుకృండు ప్రదష్టయయ్యె. నివ్విధమాహేశ్వరయజ్ఞంబు నిర్వర్తింప సుదర్శన భయంబుచే రాక్షసులు రానెరచిరి. యజ్ఞంబు నిర్విఘ్న పరిసమాప్తి యయ్యె హుతాశనుండు హవిర్భక్షణంబు గావించుచుండె నధ్వర్యుండు కర్మజాకంబుగావించి మంత్రపూతంబగు పురోడాశంబు హోమంబు గావించి హుతశేషంబు విభజించి మహాత్ములగు ఋత్విక్కుల కొసంగ.

అంత సవితయత్యుగ్ర తేజంబును పాత్రినామకంబగు పురోడాశంబు హస్తంబుల గ్రహించిన స్వల్పమాత్రంబున కరంబులు భిన్నంబులయ్యెను. సూర్యుండు విషణ్ణుండై ఋత్విక్కులకై జూచి యోఋత్విక్కులారా యీపురోడాశంబు మదర్ప్య పాణిగవంబు జేసెనని చెప్పిన ఋత్విక్కులు చింతబడి దోచకయుండ నష్టావక్రుండో మునులారా నేను జీవించియుండ మీకు విచారంబేల నేనొకయుపాయంబు జెప్పెద ఋషుడవకుండునని చెప్పినంటిరా నాయెదుట నూరుకోట్లమంది బ్రహ్మలుపుట్టిరి జచ్చిరి. నేను జూచుచుంటి గావున నేననేకంబులు జూచినవాడ పూర్వకాలంబున లోకేశ్వరుండును బ్రహ్మవేళ శ్యామలాపురంబున షారిహారుండను విపుఁడుండెచ్చుటనుండి యొకదినంబున మహారణ్యంబులో సంచరించుచుండ నొకవ్యాధుండు గురివేయుచుండ నతనిపాదంబులకు తగిలి ఖండంబులయ్యె.

అప్పుడు మునులందరు విచారించుచు గంధమాదన పర్వతంబు మీద మునితీర్థంబున్న దందులో స్నానంబుజేయించిన పాదంబులు వచ్చునని యతని యాతీర్థంబుదరికి తీసుకొనిపోయి నాతీర్థోదకంబులదే స్నానంబుచేయించిన పాదంబులెప్పటట్ల సంధానంబులయ్యె గావునని

www.mohanpublications.com
సవితృదేవున కాతీర్థంబులోచేరిన యుదకంబుదెచ్చి చేతులపై చల్లిన వున రుద్భవంబులౌనని జెప్పిన తత్ప్రకారంబుజేసిరి సవితకుహస్తంబులువచ్చె గావున నీచక్రతీర్థప్రభావం బిట్టిదక్కడ స్నానంబాచరించి తదుపరి శివ తీర్థంబునకు బోవలయును.

## శివతీర్థ మహాత్మ్యము.

అదిమహోత్తమంబగు తీర్థంబు పూర్వకాలంబున కాలభైరవు నకు బ్రహ్మహత్యా నివృత్తియిచ్చిన తీర్థంబనిచెప్పిన యావృత్తాంతం బునం క్రమంబుగాజెప్పుమని యడిగిన మునులారా పూర్వకాలంబున బ్రహ్మవిష్ణులిద్దరును అహంజగత్కర్తా అహమేవజగత్కర్తాయనుచు పరస్పరకలహంబు జరిగి యిద్దరు మహోరంబగు మాటలు జరిగించు చున్న సమయంబులో సమస్తదేవర్షి సమూహంబు ముందర చతు ర్వేదంబులు మూర్తివంతంబులైన నిల్చి బ్రహ్మవిష్ణులు వీరునుండ వీరిద్దరు యీలోకంబులకు కర్తలుగారు పరాత్పరుండగు సాగరుండు యేలోకంబులకు కర్మస్థావరజంగమాత్మకంబగు నీలోకంబంతయు తన్మా యామోహితంబై ప్రవర్తించు.

మరియు నాశివుండు సర్వగీర్వాణ వంద్యుం డంబౌనహితుండు సత్యక్షమాది సుభలక్షణలక్షితులగు సృష్టియు పాలకుండుమహోర్తియు త్రిలోకాధీశ్వరుండయి వెలయుచుండు ననుచు వేదంబులు వక్కాణించి పలికిన విధియు విష్ణుండును యీశివుండు పార్వతీ లోలుండయి శరీర ధారియై ప్రమథులంగూడి సంచరించుచున్నవాడు సర్వరంగ వివర్జితుం డగు పరబ్రహ్మం బెట్లగునని యాక్షేపించి రెండు మీాదస్వరూపంబగు ప్రణవంబు చిద్రూపంబై మేఘగంభీర వచనంబుల తపోబ్రహ్మవిష్ణు సదాశివుండు పార్వతీ సహితుండని వచించితిరి.

www.mohanpublications.com

అతండాత్మశక్తి స్వరూపిణియగు పార్వతిం గూడుట యుక్తంబు గాదా శంకరుండు స్వప్రకాశుండు నిరంజనుండు విశ్వాధికారి మహాదేవుండు ప్రపంచంబునకు బహిరంతర్వ్యాప్తుండును సర్వాంతర్యామియు సకలతంత్ర స్వతంత్రుండు సర్వశక్తి చిదాభాసకుండును వెలుంగొందుచు నో చతుర్ముఖా నిన్ను జగత్సృష్టికొఱకు రజోగుణంబుచే సృజించెనో మాధవా నిన్ను సత్వగుణంబుచే లోకరక్షణార్థంబై సృజియించె. తమోగుణంబుచే రుద్రునిం గల్పించి భగవత్సంహారంబు జేయుచుండె. నా దేవుండే సర్వస్వతంత్రుండు గాని మీరిద్దరు స్వయంకర్తలుగారు నావిశ్వాధీనుండగు విశ్వపతివలన సృష్ట్యాదిశక్తిగాక సదానందభూతమైన పరాశక్తియగు పార్వతీ యోగశక్తి యని వచింపబడును.

కాన సదాశివుండు విశ్వపతియనియు స్వతంత్రుండనియు సకలదేవ వందనీయుండనియు దెలిసుకొనవలెను మీరు కర్తలుగారు శివునికంటె నధికులుగారు సములుగారు నాదిబ్రహ్మంబునకే మీరాయత్తవర్తులని వచించిన ప్రణవవాక్యంబు విని బ్రహ్మవిష్ణువులు మాయామోహితులై శంభుండే కర్తయని యెఱుంగజాలక యహంకరింపుచు చతురాననుం డద్భుతదర్శనుండై తపోబల విస్పష్టుండై యనంతాదిత్య సంకాశంబుగు బ్రకాశించుచు పంచమ శిరంబు జూపించి సమస్తదిగంతరాళంబులు తన కోపాగ్నిచే దహించు బడబాగ్నిబోలి ప్రజ్వరిల్లుచు నో నీలలోహితా నిను నెఱుంగుదు.

పూర్వకాలంబున మదీయలలాటంబున నుద్భవించినాడవు నా పుత్రుండవు రుద్రనాముండవనుచు గర్వించి బలికినవిని మహేశ్వరుండు కాలభైరవుండను నొకభటునిబంప నతండు శూలటంకాయుధధారియై బ్రహ్మపైకురికి తపోయుక్తంబతిశుభ్రంబగు ననిన నాశిరంబతిరోషంబున ద్రుంచుటచే చతురాననుండు మృతిబొందిన మహాదేవ ప్రసాదంబునకే పునర్జీవితుండగుచు వాసుకిప్రభృతి సర్వభూషణ భూషితుండును పార్వతీ

www.mohanpublications.com

సహితుండునునగు మహేశునింజూచి యోశశాంక భూషణా శరణాంగద రక్షకా నాతప్పుసహించి మన్నించవలయునని యనేకవిధంబుల స్తోత్రంబులుగావించి నమస్కరించిన సోమార్ధశేఖరుండా బ్రహ్మనోదార్చి శిరోహర్తయగు కాలభైరవుంజూచి యోయిభైరవా బ్రహ్మశిరఃఖండనంబు జేయుటచే లోకానుగ్రహార్థంబు బ్రహ్మకపాలధారివై భిక్షాశివై దిరిగి యొకసంవత్సరంబునను బ్రహ్మహత్యా నివృత్తినొందుమని యానతిచ్చెను.

అంత కాలకంఠుండు భైరవుంజూచినిట్లనియె ఓభైరవా నీకపాలంబుగొని భిక్షాటనంబు గావింపుచు నొకసంవత్సరంబుల తీర్థంబుల స్నానంబుగావించి తేరణాసింజేరితివేని యీబ్రహ్మహత్య చతుర్థాంశశేషంబగు పిమ్మట దక్షిణ సముద్రతీరంబునందు గంధమాదనంబున సర్వలోకోపకారార్థంబయి నాచేచేయబడిన తీర్థంబొండు గలదది శివనామంబుచేవెలయు నీవందు నియమకుండవై స్నానంబొనర్పుము దాని వలన బ్రహ్మ హత్య నిశ్శేషంబుగా నశించునని యాజ్ఞాపించి శివుండు కైలాసంబునకు బోయెను.

అంత భైరవుండా హత్యంబు లియ్యకొని కపాలధారియై భిక్షాటనంబుసేయుచు బ్రహ్మహత్యంగూడి దేవదానవ యక్షాదిలోకంబులం జరిగించుచు సర్వతీర్థంబుల సేవింపుచు కాశికింబోయిన బ్రహ్మహత్యపాదావశేషయయ్యె నంతభైరవుండు చతుర్థాంశ శేషితయగు నాబ్రహ్మహత్యంగూడి శంకరాజ్ఞచే గంధమాదనంబుజేరి యందు శివతీర్థంబున స్నానంబొనర్చి తన్మహిమాతిశయంబు భయంకరంబగు బ్రహ్మహత్యనిశ్శేషంబు గానవించె నంతయీశ్వరుండు సన్నిహితుండై వోభైరవా నీబ్రహ్మహత్యనశించె నింకనీవిందుండి కాశికింజని యందొకచోట కపాలనంబున స్థాపించిరమ్మని యాజ్ఞాపించి యంతర్ధానుండయ్యె నంతభైరవుండందుండి గదలి వారణాస్యంబోయి యీశ్వరోక్తప్రకారంబైన కపాలస్థాపనంబొనర్చె.

www.mohanpublications.com

ఆ బ్రహ్మహత్యను నిజాంశా శంభవుండగు కాలభైరవుని వెంట నంటించె.

ఓభైరవా నీవు వారణాశికినిబోయిన నిదివదలునని జెప్పి వారణాశిలో బ్రహ్మహత్యాదోషంబువదలి పిమ్మట గంధమాదన పర్వతంబు మీద శివతీర్థంబని నాచే నిర్మింపబడియున్న తీర్థంబులో స్నానంబు జేసితివేని నిశ్శేషంబగునని జెప్పిన కాలభైరవుండావిధంబున గృమ్మరి శివతీర్థంబులో స్నానంబుచేసిన మహాఘోరంబగు బ్రహ్మహత్య నిశ్శేషంబు నొందె. నాకపాలం బచ్చట స్థాపించె గాన దానికి కపాలతీర్థంబనికూడా నామంబు విశ్రుతంబయ్యె మునీంద్రులారా యక్కడ స్నానంబు లాచరించి తదుపరి శంఖతీర్థంబునకు పోవలయు.

## శంఖతీర్థ మహాత్మ్యము.

ఆశంఖతీర్థంబులో స్నానంబుజేసినవారికి కృతఘ్నదోష పరిహారాదులనేకంబులు గలిగెననిన సూతా దానివృత్తాంతంబు సమగ్రంబుగా జెప్పుమని యడిగిన మునులారా వినుండు పూర్వకాలంబున శంఖుండను మహాముని తన నామంబుచే నాతీర్థంబు గల్పించుటవలన నాతీర్థంబునకు శంఖతీర్థంబని వాడికగల్గె.

మరియు నాతీర్థప్రభావంబు గనుకొని వత్సనాభుండను ఋషీశ్వరుడచ్చట నిశ్చలుండై యనేక వర్షములు తపంబుజేసిన నతనిపై పుట్టలు బెట్టియుండె నదిజూచి యింద్రుండు తపోభంగంబు గావింపవలయునని యనామేఘంబుల నొక్కమారువదలి వర్షింపుమనిన సప్తదివసంబులహోరాత్రంబులు వర్షించె.

అంతట ధర్ముడను నొకముని వత్సనాభునికి తపోభంగంబుగా కూడదని తాను మహిషరూపుండై యతని కడ్డంబునిలిచి రానిక్కకాక

www.mohanpublications.com
యుండఁగానె యంతట నామునిసంకుల వర్షసందష్టంబుచే మేల్కాంచి కను విచ్చిచూచిన లోకంబంతయు జలక్లిన్నంబై యుండె.

తనసమీపంబున మహిషస్వరూపంబుతో నిలిచియున్న ధర్ముఁడనుమునినిజూచి మహిషస్వరూపంబైన యీతిర్యగ్యోని జంతువయ్యును నింత ధర్మంబాచరించి నన్నురక్షించెనని చిత్తంబులోఁ దలఁచుకొని యీ మహిషంబు చిరకాలంబు జీవించునని మనసులో దీవించి తపంబొనరింప మరియొకస్థలంబునకుబోయి మనంబులో బహుచింతనొంది మహావర్షంబులోనున్న నన్ను బాధనొందకుండ రక్షించినమహిషంబునకు ప్రత్యుప్రకృతినగావింపనిమూఢుఁడ మూర్ఖుఁడ కృతఘ్నుండ నాకురుమ్యలోకంబు డెట్లుగలుగునని బహుచింతనొంది యెవ్వరికైన ప్రాయశ్చిత్తంబు దొరుకునుగాని కృతఘ్ననికి నిష్కృతి దొరకదుగాన మృతిబొందుటమేలని మేరుపర్వతశిఖరంబెక్కి భూమిపైబడ నుద్యోగించెను.

అంత మహిషస్వరూపుఁడగు ధర్ముఁడో పుణ్యాత్మా ప్రాణఘాతచే దోషంబుగలుగునుగాన మానుమనిన వత్సనాభుండతనితో నోమహాత్మా నే మూఢుండ మూర్ఖుండ దురాత్ముండ నుపకారంబు చేసినవారికి ప్రత్యుపకారంబు చేయని పాపాత్ముని దేహంబు గాల్చుటే మేలుకృతఘ్ననికంటె దురాగతుఁడీ లోకంబులోనుండఁడుగాని శాస్త్రంబు వినుము.

శ్లో॥ కృతఘ్నతామహాదోషః కృతఘ్నే నాస్తినిష్కృతిః । కృతఘ్నస్యనహైలోకాః కృతఘ్నస్యనిబాంధవాః కృతఘ్నానరకంయాంతియేవ విశ్వాసఘాతినః॥

అని యున్నది గనుక నెవరికైనా ప్రాయశ్చిత్తంబు లుండునుగాని విశ్వాసఘాతకునికి కృతఘ్ననికి ప్రాయశ్చిత్తంబు దొరకదుగావున తల్లి

www.mohanpublications.com

దండ్రుల బోషించనివాడు గురుదక్షిణసమర్పించనివాడు కృతఘ్నుడు చచ్చునిటు మంచిదని యమ్మునీంద్రు డాత్మప్రాణంబుల తృణసమంబులుగా దలంచి మేరుపర్వతంబెక్కి యందుండి భూమింబడుట కుద్యుక్తుండైన ధర్ముండు మహీసురరూపంబు విడచి నిజాకారంబునొంది యావత్సనాభు నితో నిట్లనియె.

ఓమునీంద్రా నీవు బహుకాలంబు జీవించుము నీబుద్ధికింబరితుష్టి హృదయుండనైతిని ధర్మంబున నీకు సమానుండులేడు నిక్కువంబు నీకృతఘ్నులను నిష్కృతియాత్మ పరిత్యాగంబుగా దొకయుపాయంబు వచించెద వినుము గంధమాదనంబున శంఖతీర్థంబను నొకతీర్థంబుగల దండు స్నానంబొనరించిన కృతఘ్నుంబాసి విగతపాపుండవై చిత్తశుద్ధియు విజ్ఞానంబునుంగల్గి శాశ్వతంబగు పదంబునొందెదవు నేధర్ముండ నీవచనంబు నిక్కువంబనిన యామునీంద్రుండు శంఖతీర్థస్నానాభిలాషియై గంధమాదనకుంబోయి శంఖతీర్థంబునం దవగాహనంబొనర్చి విగతపాపుండై మనోస్థైర్యంబునొంది కొంతకాలంబునకు బ్రహ్మత్వంబునొందె ఓ మునీంద్రులారా శంఖతీర్థప్రభావంబువచించితి అందుస్నానంబొనర్చిన కృతఘ్నుండైన పాపవిముక్తుండగు మరియు మాతృ పితృ గురుద్రోహులు మొదలగు పాపాత్ములైన నాతీర్థస్నానంబునం బరిశుద్ధులగుదురు. లోకంబున మాతృ పితృ భరణం బొనర్పక గురుదక్షిణ యొసంగక కృతఘ్నతంబొందు నరునకు మరణంబుదప్ప నిష్కృతి గల్గనేరదు.

ఓ వత్సనాభా గంధమాదన పర్వతంబుమీద శంఖతీర్థంబుగలదది మహోత్తమ తీర్థంబను దానిలోస్నానంబుచేసి కృతార్థుడవై రమ్మనిన నాప్రకారంబు జరిగించి పవిత్రుండయ్యె గనుక నక్కడ స్నానం బాచరించి తదుపరి యమునా గంగా గయాతీర్థంబులకు బోవలయును.

www.mohanpublications.com

## యమునా గంగా గయాతీర్థత్రయ మహాత్మ్యము.

ఆమహాతీర్థంబు జ్ఞానస్రుతి రైక్వ మహామునివల్ల జ్ఞానసిద్ధుండయ్యెనని సూతా దాని కథావిస్తారంబు మాకు జెప్పుమనివేడి యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున రైక్వుండను మహాముని గంధమాదన పర్వతంబుమీద బహుకాలంబు తపంబొనరించి తపోమాహాత్మ్యంబున దీర్ఘాయుష్మంతుడయ్యె.

అతనికి జన్మంబు మొదలుకొని పంగుత్వంబుచేనడువజాలక శకటంబుపై కూర్చుండి తిరుగుటచే మునులందరు సంయుగ్వుండను నామంబుచే పిలుతురు నామునీంద్రుండు సంపూర్ణజ్ఞానియై గ్రీష్మకాలంబులో పంచాగ్ని మధ్యంబున వర్షాకాలంబులో జలాశయంబున తపస్సుగావించుచుండ నతనిశరీరంబు కృశించి యంతకంతకు కండూసహితుండై పామరోగబాధచే నసగా దురదగజ్జిచే బాధపడుచుండి బలహీనుడై కాలుమిచేకరలలేక తపస్సునొదలక దీక్షతోనుండి యొకదినంబున యమునా గంగ గయాతీర్థంబుల స్నానంబులు జేసిన నిహాపరంబులకు సుఖంబును పుణ్యంబును గలిగి రోగ పీడలు మానునని మనసులోదలచుచు పంగు శకటంబుమీద దూరగమనంబునే నేనుచేతునని దుఃఖాక్రాంతుడై యుండె.

మంచిది నాతపఃప్రభావంబున నాతీర్థత్రయంపి నాహ్వానంబు జేసెదనని శంకల్పంబుసేయు నాచమనంబుచేసి మనోదార్ఢ్యంబున నిశ్చల ధ్యానంబుజేయుచున్న నానదీత్రితయంబున భూమిపాటనంబు చేసుకొని యామునిసన్నిధినిల్చి యోమునీంద్రా నీమనోవాంఛాసిద్ధి కొరకేతెంచితి ముందు మార్గంబుదెల్పుమన్న కనువిచ్చిచూచి పూజించి యోపుణ్యనదులారా నాకోరికదీర్చితిరేని మీరు ముగ్గిరీ గంధమాదన పర్వతంబుమీద నివసించియుండవలెను. మీరుభూమిభేదించి వెడలినస్థలంబులు మీమీపేరట తీర్థరూపంబులై సర్వకాలంబు జెల్లవలెను. మీయందు

www.mohanpublications.com

స్నానంబులు జేసినవారికి సుజాన సంపత్తిగలుగవలయు ననుచు కోరి యాత్రార్థంబు సమీపంబున తీర్థంబుగావించుచుండె.

నాకాలంబులో పుత్రుండను రాజునకు పుత్రుండగు జానశ్రుతి యను రాజేంద్రుడు బహుదానశీలుండై యున్న ప్రభావంబున సర్థుల తృప్తినొందించుచును పట్టణంబు పల్లెలు గ్రామంబుల నగరంబుల కోటంబుల ఖర్వంబులు శాలసూపవస్యాతోహ్యా సమీపంబగు వినోదంబు ప్రతిమార్గంబున సంపూర్ణంబుగా నిలిపి మార్గస్థులు మొదలగు సర్వజనంబుల వేడి వేడి భోజనంబులు పెట్టుచుండె నాతనికీర్తి భూమినుండి దిక్కుల పిక్కటిల్లియుండె నిట్లురాజు మహాధర్మాత్ముండై సకల దానంబులుజేయుచు నొకనాటిరాత్రి సౌధంబుమీద చల్లగాలికి కూర్చున్నయెడ హంసలు గుంపులై పోవుచు నామేడమీద దిగి మరలిపోయ్యెడి సమయంబున నొక హంస హంసరాజుతో నిట్లనియె.

హంసశ్రేష్ఠమా యీపట్టణంబులో పుత్రునికుమారుండగు జ్ఞానశ్రుతియనెడి రాజోత్తముండు బహుధన్యుండు పుణ్యుం డన్నదానపరుండతని దర్శింపకపోవుటుచితంబేనా యనిన నోహంస యారాజును మహా స్తోత్రంబుజేసెదవు చిత్రంబు గుడ్డిగవ్వ వరహాయగునా యతనిదానం బెంత యతనిగుణంబెంత నతనిలెక్కయేమి రైక్వుండను బ్రాహ్మణుండు జన్మపంగుండు లేవలేడు మహాతపోబలాధికుండు బహునిష్ఠాగరిష్ఠుండతని పుణ్యంబెవ్వరెంచగలరతని యతిశయంబు నాలక్ష్యంబులో రాదనియును కొనుచు నాకాశమార్గంబున సత్యలోకంబునకు పోయెను.

అంతనారాజువిని బహుచింతాక్రాంతుండై నేనింతచేసిన పేరు లేదయ్యె. ఒకపక్షిచే నిరాకరించబడితినని యారాత్రినిద్రలేక గుందుచు ప్రాతఃకాలంబునలేచి యొక సారథింబిలిచి యోసారథీ నీవతి జవసత్వ సంపన్నంబులగు నశ్వంబులుగట్టిన రథంబుపై నెక్కి యడవులు దుర్గంబులు

www.mohanpublications.com

పర్వతంబులు మహారణ్యంబులు నదులు పట్టణంబులు గ్రామంబులు గోష్ఠంబులు మొదలగు స్థలంబులు వెదకి గావించి భూమి గృమ్మరించి రైక్వుండను మునీంద్రుని సెలవుగని రమ్మని బంపిన నాసూయగు వెదకి వెదకి నెందునుగానక చింతనొంది దక్షిణసముద్రతీరంబులో గంధమాదన పర్వతంబుమీఁద యమునా గంగా గయాతీర్థంబుల సమీపంబున బండి క్రింద గూర్చున్న పంగుడగు రైక్వునిం జూచెను.

అదివరకు తానువిన్న లక్షణంబు లతనియందుండుటచే నితఁడె రైక్వుండని నిశ్చయించుకొని సన్నిధినిజేరి శకటంబు క్రిందగూర్చున్న మునీంద్రునితో ఓతపోధనా నీపేరువినగోరెదనని యడిగిన నాపేరు రైక్వుండు శకటంబుపై నెక్కుడుగుటచే కొందరు మునులు సయుగ్వుండని వాడుదురని చెప్పిన యతని బ్రహ్మజ్ఞాననిష్ఠకు సంతోషించిమ్రొక్కి సమీపంబులో గూర్చుండి యనేకవిధంబుల బ్రహ్మశాస్త్రప్రసంగంబులు జేసిన నతని మనస్సు ద్రవ్యాపేక్షయందు నిరాశనొందిన విధంబుగాంచి యాశ్చర్యంబునొందుచు జానశ్రుతి సమీపంబునకు పోయెను.

రాజేంద్రా గంధమాదనంబుమీఁద యమునా గంగా గయాతీర్థ సమీపంబున మీరుజెప్పిన మునీంద్రునిజూచి వచ్చితినని జెప్పిన సంతోషించి గోగణంబును ధనసమూహంబును సర్వంబులు మొదలగు కట్నంబులుగొని యతని సన్నిధికిపోయి వందనంబులుసేయుచు మునీంద్రా వీటిని స్వీకరించి నాకుసద్వైత జ్ఞానానుభవ మార్గంబుజెప్పుమని వేఁడిన రాజా ఈద్రవ్యంబుయం దపేక్షగలిగినవాడు నీకుపదేశంబు సేయతగడు ధనాశాపరునకు జ్ఞానసిద్ధి కలుగనేరదు తానేజ్ఞానసిద్ధి లేనివాఁడొరులకు జ్ఞానోపదేశం బెట్లుజేయు.

స్వయంతీర్ణః పరాన్ తారయతి॥ యనుస్మృతికివిరుద్ధంబగు జ్ఞానోపదేశం బొరులుజేయ నిమిత్తంబులేదు. ప్రారబ్ధ క్షయంబైన కోరికలుడు

www.mohanpublications.com

గును. కోరికలుడిగి నిరాశుండయిన మనో నిశ్చయంబు గలుగును. మనోనిశ్చయంబున సువర్ణంబు లోష్ఠసమానంబై దోచునప్పుడు సన్మార్గ ప్రవర్తింబుగలుగు నప్పుడేపరిశుద్ధుండయి జ్ఞానప్రవర్తకుండయి శ్రవణమ నననిధిధ్యాసలవలన భక్తిజ్ఞానవైరాగ్య సిద్ధుండగు నతడేజ్ఞాని యద్వైవ తనిష్ఠుండు నీవె జ్ఞానంబుకోరితివేని యాతీర్థత్రయంబులో స్నానం బొన రింపుము పరిశుద్ధుండ వగుదువని సంకల్ప పూర్వకంబుగా స్నానం జేయించి నిష్కల్మషుండగుటంజూచి జ్ఞానమార్గంబుజూపె నారాజున దేశంబునొంది కృతార్థుండయ్యె మునీంద్రులారా యాతీర్థత్రయ మహా త్మ్యంబద్భుతంబు వింటెరిగదా యక్కడ స్నానాది క్రియలుజరిగించి కోటితీర్థంబునకు బోవలయు.

## కోటితీర్థ మహాత్మ్యము.

అది మహాపుణ్యతరంబగుతీర్థంబు శ్రీరామచంద్రుండు రావణ వినాశంబొనరించి బ్రహ్మహత్యా నివృత్తికొరకై రామేశ్వర లింగస్థాప నంబుగావించి తల్లింగాభిషేకంబుకొరకు జలంబుకై వెదకి దొరకకరామ భద్రుండు తనధన్నుకోటిచే భూమిఁద్రవ్వ నదిలోద్గమంబుగావించె గాన దానికి ధనుఃకోటియను నామంబు సార్థకంబయ్యె.

నాతీర్థంబులో రఘునాయకుండు ప్రథమస్నానంబాచరించి యా యుదకంబుచే రామనాథస్వామికి యభిషేకంబుజేసె మరియు ద్వాపరాం తంబున శ్రీకృష్ణమూర్తి తన మేనమామయగు కంసునివధించి మాతుల హత్యా నివృత్తికొరకు బ్రాహ్మణులవేడిన హేశ్రీకృష్ణా దేవదేవోత్తమా దేవకీవసుదేవులకిచ్చిన వరమునాఫల్యంబుకొరకు భూభారహరణార్థంబై బ్రహ్మచే ప్రార్థితుండవై దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనంబుకై యీలోకం బులో నవతరించిన పరమాత్ముడవు నీకు దోషంబులెక్కడివి సకలదోషం

www.mohanpublications.com

బులు భవద్దర్శనంబున దుర్దశనొందినైనను లోకానుగ్రహసంగ్రహార్థంబై ధర్మస్థాపకుండవయిన నీవుచరించిన లోకంబునడుచు.

కావున దక్షిణసముద్రతీరంబులో గంధమాదన పర్వతంబుపై శ్రీరామచంద్రుండు తనధనుష్కోటిచే స్వహస్తంబులనిర్మించి పవనవగాహనంబుజేసి రామేశ్వరలింగంబున కభిషేకం బొనరించి బ్రహ్మహత్యానివృత్తినొందిన తీర్థంబు గావున మీరును నచ్చటికరిగి ధనుష్కోటిలో స్నానంబాచరించి రామలింగస్వామి కభిషేకంబుగావించితిరేని మాతుల వధజనిత పాపంబు దూరంబులగు మీమనోవాంఛితంబు లన్నియు సిద్ధించుననిజెప్పిన శ్రీకృష్ణభగవంతుం డచ్చటకరిగి సంకల్ప విధానంబుగా ధనుష్కోటిలో స్నానంబుగావించి రామనాథేశ్వరున కభిషేకంబుజేసి మాతులవధజనిత దురితంబుతో దూరంబయ్యె మునులారా ధనుష్కోటి తీర్థమహాత్మ్యంబింత గొప్పదిగావున నక్కడ స్నానంబుజేసి సాధ్యామృత తీర్థంబునకు బోవలయును.

## సాధ్యామృత తీర్థమహాత్మ్యము.

అది మహోత్తమంబగు తీర్థంబు పూర్వకాలంబున ఊర్వశీ పురూరవులకు శాపమోక్షంబిచ్చిన తీర్థంబాతీర్థంబులో మనుష్యులస్థులు నెన్ని సంవత్సరంబులుండునో నన్నిసంవత్సరంబు లాతడు స్వర్గలోకంబులో క్రీడించగలడు. పూర్వకాలంబున ప్రజారక్షణ శీలుండు ధర్మాత్ముండు మహాపరాక్రమ శీలుండగు పురూరవుండు మిత్రావరుణ శాపంబున భాగ్యంబగు స్వర్గంబు విడిచి యూర్వశి భూమిపై చరించుచుండి యొక యరణ్యంబులో కోకిల మధుర స్వరంబుగా వీణావాద్యంబు చేయుచుండెను.

పురూరవుండశ్వారూఢుండై నపరితోలుతసైన్యంబుతో వనవిహారంబుసేయుచు నాధ్వనివిని తత్సమీపంబునకుబోయి పలుకరించి నాకు

www.mohanpublications.com

భార్యవు గావలయునని గోరిన రాజోత్తమా నేనొక సమయంబుగోరెద నేను పుత్రసమానంబుగా నీయురణద్వయంబును పెంచుచున్న దాన వీటికి భయంబు జెందకుండ రక్షింపవలయు. మఱియు నీవు మైథునకాలం బునదప్ప వివస్త్రుండవై నాకంటికి కనపడగూడదు నీయుచ్ఛిష్టంబు నాకొసగగూడదు. ఈప్రతిజ్ఞలు మూడును పాలించితివేని నీకు భార్యనై యభిమతంబులు దీర్తునని నతండియ్యకొని యా వూర్వశిని తన యింటికి దోడ్కొనివచ్చి సరస్వతీతీరంబున చైత్యరథాది యుద్యాన వనంబుల యభీష్టసుఖంబు లనుభవింపుచుండెను.

అంత నరువదివేలవత్సరంబులు గడిచె నిన్ని దినములూర్వశిరాక పోవుట కేమిహేతువని దేవేంద్రుడడిగి విశ్వావసుండను గంధర్వునితో దానివెదకి దోడ్కొనిరమ్మని జెప్పిన నతడు వెదక యున్నస్థలంబుగనుగొని యీరాజుకు దీనికి సాంగత్యమెడబాపకున్న రాదని యొకనాటి రాత్రి జీమూతబంధురమై వర్షప్రదమైయున్న సమయమున దాని పెంపుడు గొర్రియలబట్టి గొనిపోవుటకై యుద్యోగించిన నాగొర్రియలరువ నూర్వశి మేల్కొని స్వతల్పగతుడగు రాజుతో కఠినమగు మాటలాడిన యతడు ధృతుడై నీరాత్రిచీకటిలో దిగంబరుడనై పోయిన గానుపింపదని తొందరజెంది కృపాణపాణియై పరుగెత్తి యాగంధర్వుల బారదోలి మంది రంబునకు వచ్చుచున్న మెరుపుదీప్తితో యీరాజు దిగంబరుండై కన బడిన తక్షణంబున నూర్వశి యంతర్హితయై తన నివాసంబునకరిగె.

రాజు గొర్రియలవిడిపించుచు సంతోషించుచువచ్చి వెదకిన నూర్వశితల్పంబుపై లేకనిచింతనొందుచు గొర్రియలజూడ బోయిన నవియు గానరావయ్యె నంతట నాచక్రవర్తి విలపించుచు కఠినవనంబు లలో బయలుదేరి కురుక్షేత్రంబునకుపోయి యచ్ఛటకమల సంకీర్ణంబగు నొక తటాకసమీపంబున నల్గురుఅప్సరులతో విహరింపుచున్న నూర్వశిం గాంచి విలపించిన నోచక్రవర్తి నీవేల వెసరించెదవు నేనుగర్భవతినై

www.mohanpublications.com

యున్నదాన నొక సంవత్సరంబుదాటినప్పటికి విచ్ఛేయుము యొకరాత్రి నీమనోరథంబు దీర్చెదనని పలికిన నాటిదినము దాటించి మరల బోయిన రాజుంగాంచి యోనృపాలా సన్నుగోరెదవేని యీగంధర్వులం బ్రార్థింపుమనెను.

ఆగంధర్వులంజూచి యోదేవతలారా నేనీ యూర్వశింబాసి యుండజాలా నాకు దయచేయవలయునని యడిగిన నూర్వశి నీకు దొరక దీయగ్నిస్థాలిని యొసంగెదము. దీనినిగ్రహింపు మన్వల నూర్వశిదొరక గలదని యగ్నిస్థాలినిచ్చిన రాజు దీనవదనుండై మూఢుని పోలిక దీని నేనేమి సేయుదునని యాస్థాలి నరణ్యమధ్యంబున దిగవిడిచి స్వపురంబు నకుబోయి యర్థరాత్రివేళనే మూర్ఖుండనై యగ్నిస్థాలీవదలి వచ్చితినని తత్క్షణంబచ్చటికిపోయి యగ్నిస్థాలింగానక శమీగర్భంబగు యశ్వంబునుం గాంచి దాని నగ్నిస్థానంబుగా నెరింగి దీని పట్టణంబునకు గొనిపోయి నిరణిగావించి మదించి తదుత్పన్నాగ్నిచే యజ్ఞంబులొనరించి యూర్వశిని బొందగలనని శమీగర్భయశ్వద్ధంబు దెచ్చి యరణిగావించి యగ్నిని మథించి వేదచోదితంబులగు యజ్ఞంబులు గావించి గంధర్వలోకంబుజేరి యూర్వశిసహితుండై యనేకసౌఖ్యంబు లనుభవించుచుండె.

అంతనొకనాడు దేవేంద్రుని సభామంటపంబున రంభాద్యప్సర స్సంఘంబులతో నాడుచునృత్తాభినయ సామర్థ్యంబు జూపుచు గర్వించి పురూరవుంజూచిన యతడును విలాసంబుగా క్రీగంట దానిజూచె నాయిద్దరి యభిప్రాయంబులు గనుగొని నాట్యాచార్యుండగు తుంబు రుండు కోపించి దేవసభలో మీరు వ్యతిక్రమంబు గావించితిరి గాన మీకిద్దరికి వియోగంబుగా గలదని శాపంబొసంగె.

అంతట రాజేంద్రుండు దుఃఖాక్రాంతుడై పురుహూతుని శర ణంబువేడిన నింద్రుండు కరుణించి విచారించి నృపాలా నీకొక యుపా

www.mohanpublications.com
యంబుఁజెప్పెద గంధమాదనంబున యోగి బృందసేవ్యంబగు భుక్తిముక్తి ప్రదంబగు సకలపాప విమోచనంబగు సర్వైశ్వర్య ప్రదంబగు సాధ్యామృతంబను తీర్థంబు గలదచ్చటికి నీవేగి స్నానంబు జేసితివేని నీశాప విమోక్షణంబగు స్వర్గలోకనివాసంబునుంగలిగి మత్సన్నిధానంబులో సభామంటపప్రదేశంబున విహరించ గలవనిజెప్పిన బ్రీతమానసుండై భూవల్లభుండు తక్షణంబున నాగంధమాదనంబునకుబోయి సాధ్యామృత తీర్థంబులో సుస్నాంతుండై శాపవిముక్తుండయ్యె గాన నాతీర్థంబులో స్నానంబుగావించి సర్వతీర్థంబునకు బోవలయు.

## సర్వతీర్థ మహాత్మ్యము.

ఈతీర్థంబులో స్నానంబు జేసినవారికి సకలతీర్థావగహాన ఫలంబులును గాయత్రీపునశ్చరణచేసిన ఫలంబును చతుర్వేదపారాయణ ఫలంబును హరిహరపూజలొనర్చిన ఫలంబు నేకాదశి ప్రభృతివ్రత నియమోపవాసంబులనె ఫలంబులు సమకూరునో సర్వతీర్థస్నానంబున నంతఫలంబు సిద్ధించుననిన సూతా దానికి సర్వతీర్థంబని పేరు యేవిధంబున వచ్చెననియడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున సుచరితుండను మునీంద్రుడు బుడిభృగువంశ సంభవుండు యమనియమోపేతుండై దక్షిణసముద్రతీరంబున గంధమాదనపర్వతంబుమీద దేవదేవుడగు శంకరు నుద్దేశించి తపంబుగావించుచు త్రికాలస్నానంబొనరింపుచు ఫలమూలంబు భుజించుచు జలాహారుండయి వాయుభక్షుండయి శీతోష్ణసుకదుఃఖంబులకోర్చి భస్మత్రిపుండ్రాంకితఫాల ఫల్కుండయి జాబాలోపనిషత్ప్రకారంబున రుద్రాక్షమాలికా ధారణంబు సేయుచు తపంబుగావింపుచుండె.

అంత మహేశ్వరుండు కరుణాయత్తచిత్తుండై భూతసంఘసేవితుండై జటామండల మండితుండై భస్మభాసురశరీరుండై వామార్ధజాని కోటిసూర్యప్రభా విజిత మహాతేజోవిరాజమానుడై శేష వాసుకి

www.mohanpublications.com
ప్రభృతిమహానాగభూషణాలంకారుడై వృషభ వాహనుడై యామునీంద్రు నెదుటనిలిచి యామునలికి తాచనింబు లొసగిన నాబ్రాహ్మణుండు మహానందపానిరావార హాూన్నతమగ్నుండై లేచితంబగు సదాశివుని రూపంబు కన్నులనిండగాంచి స్తుతించెను.

ఓమహాదేవా నీవుబ్రహ్మాది సురసేవ్యుండవు త్రిపురనాశకుండవు యమనాశనకారివి కామారివి సంసారవైషమ్యుండవు బాలపాలకుండవు పుండవ్యయుండవు త్రిలోచనుండవు భక్తిరక్షణాధీక్షితుండవు వ్యోమకేశుండవు కారుణ్యవిగ్రహుండవు నీలకంఠుండవు మహేశ్వరుండవు పరమానంద విగ్రహుండవు గంగాధరుండవు శర్వుండవు కైలాసనాధుండవునిన్ను గొనియాడ నాతరంబె నన్నుంగాంచి కృపాళుండవై రక్షింపుమనియనేక విధంబులంబొగడిన నీలకంఠుండు ప్రీతుండై యిట్లనియె.

ఓమునీంద్రా నీతపంబునకు నేనుసంతసించి నీయాశ్రమంబునకు వచ్చితి నీవేమి వరంబుగోరిననిత్తుననిన నోమహేశా పార్వతీశా నేను జరాపదీడునడను సర్వతీర్థంబులలో స్నానంబుసేయు కోరికగలిగియు బోవశక్తిజాలక నీపాదంబులుసేవించితి నాకోర్కెదీర్చవేయని బ్రాహ్మణుండు విలపించిన నోభూసురా వెరునకు వరప్రదాతనగు నన్నుసేవించిన వారికి కొదవలుండవు నీమనోభీష్ట ప్రకారంబు నీవునిర్మించిన యీతీర్థంబులో సర్వతీర్థంబులు సన్నిధించునట్లు వరంబిచ్చితిమి నీకు దేశాంతరంబులో బనిలేదని యనుగ్రహించెను.

ఆమహాదేవుని ప్రసాదంబున గంగా గోదావరీ గోమతి యమునా కృష్ణా కావేర్యాది సర్వనదీవర్గంబు లాతీర్థంబులో మిశ్రమంబులై విశ్రమించుటచే నానదిసర్వతీర్థంబని దానికి త్రైలోక్య విశ్రుతనామంబు గలిగె. మరియు హరుండు యుమామానసుండై దీనియందు నాత్మస్వ్రష్ట

www.mohanpublications.com

బగుటచే దీనికిమానస తీర్థంబనియును వాడుక గలిగియు ప్రకాశించు నీవతడంబునంబొనరించి ముక్తుండవగుము.

మాయనుగ్రహంబున నీతీర్థంబులో స్నానముచేసిన వారలెంత యజ్ఞానులయిన మూర్ఖులయిన మూఢులయిన్నదరించి జ్ఞానగమ్యంబగు నిర్వాణపదంబునొందుదురు. సంసారనశారణ కారణంబగునని యాన తిచ్చి పరమేశ్వరుం డంతర్థానంబునొందె నాచరితుండను పరమేశ్వరుని యాజ్ఞాప్రకారంబు తీర్థస్నానంబు గావించిన రావిముక్తుండయి తిరుణుం డను సుందరస్వరూపుండయ్యె మహాదేవుని చిత్రప్రకారం బాతీర్థంబులో బహుకాలంబు నివాసంబుజేసి యాతీర్థప్రభావంబున కాలాంతరంబున నీశ్వరసాయుజ్యంబునొందె గాన మునీంద్రులారా యవశ్యంబు సర్వ తీర్థంబులో స్నానంబు గావించి బ్రహ్మహత్యాది పాపనాశనకరంబగు ధనుష్కోటికి బోవలయును.

## ధనుష్కోటితీర్థ మహాత్మ్యము.

అది మహోన్నతతీర్థంబు నాతీర్థనామస్మరణ మాత్రంబున పాపంబులు బాయు నందులో స్నానంబుజేసినవారి కెంత పుణ్యంబుగలదో భగవంతునకే తెలియును తదవగాహనంబుసేయువారలు, తాముక్రమంబును

## నరకంబులపేరు.

నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును కుంభీపాకంబును కాలసూత్రంబును అసిపత్రంబును క్రిమిభక్షణంబును అంధకూపంబును సరంశంబును శాల్మలియు లాలాభక్షణంబును వ్రాత్మిజాలంబును క్షార కమర్దపానంబును ప్రాణూస్యగ్ఛేదనంబును రక్షోగణాశనంబును దంద శూకాశనంబును తిరోధానాభిధంబును సూచీముఖంబును విషాగ్నిపీడ నంబును తప్తాగారకంబును ప్రతప్తసికతాపానంబును తప్తాయుపిండభక్ష

www.mohanpublications.com

ణంబును తప్తాయః పురుషాలింగనంబును తప్తాయ స్త్రీనిషేవణంబును ప్రతప్తయ్యారోహణంబును క్రకచభేదనంబును నరకంబులంబడుదురు.

యష్టావింశతి సంఖ్యాకంబులగు నరకంబులబాధలు ధనుష్కోటి లోస్నానంబుజేయుని వారలనుభవించగలరని సూతుండుజెప్పిన సూతా

## ఏపాపముచేసినవారేనరకంబులో బడుదురోదానివివరణా.

ఈనరకంబులు విస్తారంబుగా జెప్పితివేపాపంబుజేసినవారలే నరకంబులో పీడలబడుదురు. దానిమర్మంబులు జెప్పుమనిన.

మునులారా అగమ్యాగమనంబు జేసినవాడు పురుషుండయిన స్త్రీయైన తప్తాయః పిండాలింగనంబున బాధనొంది సూచీముఖ నరకంబులో ద్రోయబడును.

## సర్వజంతువధంబొనర్చినవాడు శాల్మలినరకంబులో వడును.

మరియు నెవ్వండైన వృషలీసంగమం బొనర్చి దురాచారుండైన వాని పూయవిష్టమూత్ర రక్తశ్లేష్మ పిత్తాదిపూరితంబగు భీభత్స నరకంబున ద్రోయంబడు.

మునీంద్రులారా తనయజమానిని జంపి యతని ధనాధులు హరించినవాడు స్వామిద్రోహియంధదామిస్రంబులో బడియుండును.

భ్రాతద్రోహంబుజేసి తనకుటుంబరక్షణచేయువాడు సర్వసంకులంబగు నరకంబులో ద్రోయబడును.

పశుపక్షిమృగాదుల స్వోదర పోషణార్థంబుకై జంపినవాడు క్రవ్యాదపీడితంబుల స్తంభకుంభీపాక నరకంబుల ద్రోయంబడును.

వేదమార్గం బుల్లగించి కుమార్గప్రవర్తకుండైనవాడు గౌరవంబగు నసిపత్రవన నరకంబుల ద్రోయంబడు.

www.mohanpublications.com

పవృషాలుండై స వధర్మంబున శిశుయొనర్చెనేని ప్రసూతరముఖ నరకంబున బాధనొందును.

దైవాధీన ప్రాణుల హింసించిన పాపాత్ముండంధకూప నరకంబులోబడును.

పంక్తిభేదం బొనరించి స్వాదుపదార్థంబు లనుభవించినవాడును పంచయజ్ఞంబు లొనరించనివాడును క్రిమిభోజనుండై క్రిమిభక్షితుండై క్రిమిరూపుండయి క్రిమిసంకులంబను నరకంబులో ద్రోయబడును.

మరియును యేమనుజుండయినను దుష్టుండయి వృషలీసంగం బొనర్చి త్యక్తిలజ్జుండును శౌచాద్యాచార రహితుండై పశుప్రాయుండై వర్తిలునతండు పూయవిష్ఠమూత్ర శ్లేష్మ పిత్తాదిపూరితంబగు అతి భీభత్సనరకంబున ద్రోయంబడు నతండయిన ధనుష్కోటియందవ గాహనంబొనర్చెనేని యీనరకబాధల బొందడు మరియును నెన్నినరకంబులు గలవానరకంబుల సేతుస్నానంబొనర్చిన నరుండు నరకములయందు పడడు మరియును ధనుష్కోటి స్నానంబొవర్చిన మనుజుండు అశ్వమేధ ఫలంబునొందు మరియు ధనుష్కోటి స్నానప్రభావంబున ఆత్మవిద్యయు చతుర్విధభక్తియుంగలుగు బుద్ధిపాపరహితంబుగానేరదు. దుఃఖంబు గలుగదు మనిన ప్రకాశించుమనియు తులాపురుషగో సహస్రదానంబుల నరుండేఫలంబు నొందునో నది ధనుష్కోటిస్నానంబునంబొందు మరియు నాతీర్థస్నానంబువలన బ్రహ్మహత్య సురాపానయుతంబును గురుదార గమనాయుతంబులు స్తేయాయుతంబును తత్సంసర్గకోటులు తత్సమాన దోషపుంజంబులు సకలంబును నాశనంబునొందు యీవిషయంబునకై సంశయంబువలదు జిహ్వాగ్రమంబున తప్తంబగు పరశువుధరించి జెప్పం జాలదు యెవ్వండయిన నీవాదంబ బద్ధవాదంబని వక్కాణించునతండు సర్వకర్మబహిష్కృతుండగు శంకరుండని చెప్పంబడు లోకంబున సర్వ పాతక నాశంబును అద్వైతజ్ఞానప్రదంబును భుక్తిముక్తిదంబును యిష్ట

www.mohanpublications.com

కామప్రదంబును అజ్ఞాన నాశనంబగు ధనుష్కోటిగల్గియుండ మనుజాధముం డాతీర్థంబుమాని యితరంబుల సేవించులయే మార్జాలంబు మరియు నాతీర్థప్రభావంబె వచింపంజాల నందుస్నానంబొనర్చిన వారలకు నరకభయంబులేదు. ఎవ్వరైనను ధనుష్కోటియందు స్నానంబొనర్చి నను స్మరించిన స్తుతించిన స్పృశించిన నమస్కరించినవారలు మరల జన్మంబునొంది మాతృస్తన్యపానంబొనర్పరనిన విని శౌనకాది మునీంద్రు లిట్లనిరి.

మునీంద్రులారా పాపంబు లగణ్యంబులు నరకంబుల సంఖ్యాతంబులు వెయ్యిసంవత్సరంబులు జెప్పిన దరగవు. ముఖ్యంబగుమానతి చెప్పెద నెన్నిపాపంబులుజేసిన నరుండయిన ధనుష్కోటిలో స్నానంబు జేసెనేనియు బ్రహ్మహత్యా గురుదారాగమన సువర్ణస్తేయాది మహాపాతకంబులైనను నిమిషంబులో నాశనంబగు.

ఈవిషయంబై తప్తపరశు జిహ్వాగ్రంబుపై నుంచుకొని ప్రమాణపూర్వకంబుగా జెప్పగలను యేనరాధముండు ధనుష్కోటి స్నానంబు మాని సంచరించునో వానిమూర్ఖంబునకు దరిలేదని జెప్పిన సూతా యాతీర్థంబునకు ధనుష్కోటినామంబెట్లు సంభవించెనని యడిగెను.

ఓమునులారా శ్రీరామచంద్రుండు రావణాసురునివధించి విభీషణునకు పట్టాభిషేకంబుజేసి యందరితో సేతువుమీద పాదగమనంబున వచ్చుచున్న సమయంబులో విభీషణుండు మ్రొక్కి రాఘవా యీ సేతువునిలిచియుండెనేని శత్రువు లెవ్వరైన నీమార్గంబున సులభంబుగా రాకడకు సాధ్యంబు దీనికేమి యుపాయంబని ప్రార్థించిన సర్వజ్ఞుండగు రామభద్రుండు దయావంతుండయి విభీషణా దీని కుపాయంబు కల్పింతుమని తన ధనుష్కోటిచే సేతువు ఛేదించిన నది ధనుష్కోటియని లోక ప్రసిద్ధిగాంచి యుత్తమతీర్థంబయ్యె నర్మదాతీరంబున తపంబున గంగా

www.mohanpublications.com

తీరంబున మరణంబున కురుక్షేత్రంబున దానంబున బ్రహ్మహత్యాది పాపనాశంబులగు నిక్కడ దర్శనమాత్రంబున సన్నియుగలుంగు ధనుష్కోటికి సమతీర్థంబు భూలోకములోలేవు.

తదుక్తం స్కాందే॥ శ్లో॥ రామనాథధనుష్కోటౌ మాఘమాసే సమస్తుయః।స్నాత్వార తేశివరాత్రౌచ నిరాహారో జితేంద్రియఇతి॥

తథాచ॥ యస్స్నానయాద్ధనుషఃకోట వర్థోదయ మహోదయే తస్యవశ్యాస్త్రయోదేవాః బ్రహ్మవిష్ణుమహేశ్వరాః॥

చంద్రసూర్యోపరాగేషు ధనుష్కోట్యవగాహనం। బ్రహ్మహత్యాయదిపాపానాం ప్రాయశిత్తమితీరితం॥

అతస్సర్వప్రయత్నేన సత్వంత్యక్త్వా మునీశ్వరాః । ధనుష్కోటి మహాపుణ్యం భుక్తిముక్తిఫలప్రదం॥

తత్రగత్వా పితృభ్యశ్చ కురుధ్వంపిండదాపనం । ఆకల్పమపితృప్తి స్స్యాదత్ర పిండప్రదాపనాత్॥

ద్రోణాచార్యసుతశ్చాయ మశ్వత్థామామునీశ్వరాఃసుప్తమారణ దోషేణ ఘోరేణ ముముక్షేక్షణాదితి॥

వింటిరా మునీంద్రులారా మహాపాతకనాశకంబును భుక్తిముక్తి ప్రదంబగునని చెప్పిన సూతా యశ్వత్థామకు దోషంబెట్లు సంభవించె పరిహారంబెట్లయ్యె మాకువినుపింపుమనిన మునులారా కురుపాండవయుద్ధంబు శాంతంబైనవెనక దుర్యోధనుని సైన్యంబులో కృపాశ్వత్థామకృతవర్మలు ముగ్గురు శేషించి వారు తొలిగిరి దుర్యోధనుండు తొలిగి యొక హ్రదంబులో జలస్తంభనచే కానరాక మునిగియుండగా పాండవులు కృష్ణమూర్తియు వెదకుచుబోయి భీమునివంటశాలలోకి మత్స్యంబులు తెచ్చె పెద్దవాళ్ళచే నాతనిమర్మంబుగని యచ్చటికి పోయి యనే

www.mohanpublications.com

కొంబులగుమాటలు వినిపించిన రోషంబుతో వచ్చి భీమునితో గదా యుద్ధంబుజేసె.

అప్పుడు తొడలు విరిగిపడిన తదనంతరంబున శ్రీకృష్ణమూర్తి యాలోచనప్రకారంబు దుర్యోధనుని శిబిరంబునకు భాండాగార రక్షణార్థంబు ధర్మరాజాదులరిగి అందుమీద కృతవర్మ కృపాచార్యాశ్వత్థామలు సూర్యాస్తమయంబైన వెనక వెదుకుచు దుర్యోధనునింగాంచి పరస్పరం దుఃఖంబు నొందినమీద దుర్యోధను నిచ్ఛాప్రకారంబున నశ్వత్థామ రాజ త్తమా నేను ప్రతిజ్ఞసేయుదు నపాండవంబు గావింతునని ప్రమాణంబుజేసి ముగ్గురు బయిలుదేరి ధర్మరాజు శిబిరమార్గంబుబట్టి చీకటిలో నొక విశాలంబగు న్యగ్రోధవృక్షంబుక్రింద విశ్రమించిరి.

కృతవర్మ కృపాచార్యులలసి నిద్రజెంది నశ్వత్థామ కార్యాలోచనచే మనస్స్వాస్థ్యంబుజాలక చింతించుచుండె నంత యర్ధరాత్రి నొక యులూకంబువచ్చి వటవృక్షంబుపై విశ్రమించియున్న కాకులం జీకాకుపరచి భీకరారావంబుతో కాకిమూకల బోకార్చిన కాకులశిరంబులు పాదంబులు ఖండంబులై పడుటజూచి యిదియొక ముఖ్యోపాయంబే కదా నిద్దురబోయెడి ధృష్టద్యుమ్నాదుల సులభంబుగా పంతంబు బొందింతునని సంతసించిలేచి వారినిద్దరిని లేపి శిబిరంబుల సమీపంబునకు బోయిరి.

అంత కృపకృతవర్మల శిబిరద్వారంబుననుంచి యశ్వత్థామ చీకటిలో లోపలికిబోయి ధృష్టద్యుమ్నుని రొమ్ముమీద కూర్చుండి వింటినారితో నతనికంఠంబుగోసి తండ్రిపగదీర్చి తదుపరి శిఖండిని యుధామన్యు యుత్తమౌజుల నైదుగురు పపాండవులు మొదలగు హతశేషంబులైన మూడుకోట్లమందిని గుఱ్ఱంబు లేనుగులతో నిశ్శేషంబుగా నేల గలిపె నంతట నర్జునభీమాదులు రాగలరని శంకించి కృతవర్మకృపా

www.mohanpublications.com
చార్యులోక మొగంబై పోయిరి యశ్వత్థామ నర్మదాతీరంబున రుషి వాటిండ్లకుంబోయెను.

అక్కడ మహాత్ములగు బ్రాహ్మణోత్తము లశ్వత్థామముఖంబు జూచి సుప్తబాలవృద్ధుల బలవన్మరణంబుగావించిన దోషయుక్తునిగా నెరింగి రేవాతీరబ్రాహ్మణులనేకవేలమంది యోరి బ్రాహ్మణాధమా నిదురించుచున్న శిశువృద్ధాదుల వధించినపాపివి నీముఖంబుజూడరాదు నిన్ను పలుకరించరాదు. నీతో ముచ్చటించిన వానికి పాపంబులంటు గావున మాగ్రామంబులో నీవుండగూడదు పొమ్మని బ్రాహ్మణోత్తములు నిషేధించి యశ్వత్థామను వెడలనడచిరి.

అట్లు మునీంద్రులచే నిందితుండై చింతించుచు నిందుకు ప్రాయశ్చిత్తంబుగోరి వేదవ్యాసుని యాశ్రమంబుజేరి నరిగి నమస్కారంబుజేసిన నోబ్రాహ్మణాధమానీవు దోషయుక్తుండవుగాన సంభాషించ నర్హుండవుగాదు బోవలయునని నిరాకరించిన దుఃఖించి మహాత్మా దీని నిష్కృతి నీవే వివరింపకున్న నాకు దిక్కెవ్వరని సెలవిచ్చిన వేదవ్యాసమున యోచించి యీపాపంబునకు శృతిస్మృతులవలన పరిహారంబు గానరాదు గాని యొక్కయుపాయంబు జెప్పెద వినుము.

దక్షిణ సముద్రతీరంబులో రామసేతువులో ధనుష్కోటియను తీర్థంబు గలదందులో మాసమాత్రంబు శాస్త్రవిధిగా స్నానంబొనరించి పంచాక్షరీ జపంబుజేసితివేని పరిశుద్ధుండవగుదువు పొమ్మని జెప్పిన.

తదుక్తంస్కాందే॥ శ్లో॥ దక్షిణాంబునిధౌపుణ్యే రామసేతౌవిము క్తిదే।ధనుష్కోటిరితిఖ్యాతం తీర్థమస్తిమహత్తరం॥

అస్తిపుణ్యతమంద్రోణే మహాపాతకనాశనం । స్వర్గమోక్ష ప్రదం నృణాం బ్రహ్మహత్యాదిశోధకం॥

www.mohanpublications.com

సర్వమంగళమాంగళ్యంసర్వాభీష్టఫలప్రదం । పవిత్రాణాంపవిత్రం చతీర్థానాంచ మహాత్తమం॥

దుస్స్వప్ననాశనంపుంసాం సరకక్లేశ నాశనం । అకాలమృత్యు శమనం పుణ్యంవిజయకారణం॥

దారిద్ర్యనాశనంపుంసాం మాయుర్వర్ధనముత్తమం । చిత్తశుద్ధి ప్రశమనం శాంతిదాంత్యాదికారణం॥

తత్రగత్వాధనుష్కోటౌ రామసేతౌవిముక్తిదే । స్నానంకురుష్వ ద్రోణత్వం మాసమాత్రంనిరంతరం॥

జపపంచాక్షరం మంత్రం మహాపాతకనాశనం । సుప్తమారణ దోషత్త్వం సద్యఃపూతో భవిష్యతీతి॥

ఇవ్విధంబున బాదరాయణుం డుపదేశించిన యశ్వద్ధా మవ్యాపోక్తప్రకారంబున నియమ పూర్వకంబుగా జరిగించిన పరమేశ్వరుండు ప్రత్యక్షంబాయెను.

యశ్వద్ధామ పాపవిముక్తుండై తపోవనంబుకరిగె మునీంద్రులారా ధనుష్కోటిప్రభావం బగణ్యంబు సుమీ మరియు నొక్కవ్యవహారంబు జెప్పెద వినుండు. పూర్వకాలంబున చంద్రవంశ వర్ధకుండగు నందుండను మహారాజు సత్యవ్రతుండు దయాశీలుండు దాతయై ప్రజాపాలనంబు గావించి తన పుత్రుండగు ధర్మగుప్తునికి పట్టాభిషేకంబుజేసి జితేంద్రియుండయి నిరాహారుండయి వనంబుచో తపంబు గావించుచుండె.

అంత ధర్మగుప్తుండు బుద్ధిమంతుడయి సకల సుగుణ సమృద్ధి బ్రాహ్మణ బద్ధుండయి దానశీలుండయి ప్రజలబాలించుచు నొకనాడు మృగయావినోదంబున నరణ్యంబులు సంచరించుచు సూర్యాస్తమయం బైన సంధ్యావందనంబొనర్చి క్రూరమృగభయంబున నొకవృక్షంబుపై

www.mohanpublications.com

నెక్కి కూర్చుండెను. ఒకసింహముచే తరమబడి యొకభల్లూకం బావృక్షమా రోహణంబుజేసె నదిజూచి రాజు భీతుండయిన నావృక్షంబున రాజ వెరవకు నీకుపకారంబొనర్తు సింహంబుచే భీతినొందివచ్చితి నీవుసుఖంబు గాయుండుమని కొంతసేపటికి రాజు బాలుండవు నిద్రాపరితుండవై తివి నాతొడలపై పరుండుము నీసంరక్షణంబు గావించెదనని నమ్మించిన రాజునిద్రించెను.

ఆవెనుక సింహంబు యోభల్లూకమా నేనాకలితో శ్రమనొంది యున్నదాన నీరాజు మనల చంపగల యుద్దేశంబుచే వేటమార్గంబునగా వచ్చియున్నాడు గావున నతనిని క్రిందికి ద్రోసితివేని నాయాకలినిండి నేబోదు నీవు నివాసమునకు బోవచ్చుననుచు జెప్పిన యామృగేంద్రా యీబాలుండగురాజు నమ్మిశయనించెను. మిత్రద్రోహజాల నేపాపము కైన నిష్కృతిగలదుగాని విశ్వాసఘాతక పాపమునకు ప్రాయశ్చిత్తము లేదు. నన్ను విరోధించవద్దనిజెప్పె నంత కొంతదడవునకు రాజు మేల్కాంచె మరియు భల్లూకంబు రాజునునమ్మి నిద్దురబోయె నాసమ యంబులో సింహంబు రాజా యిది క్రూరమృగంబు నాభయమునకు వెరచి నిన్ను బుజ్జగించిన దాని నీవొక్కరుండవైన భక్షించకవిడచునా.

కావున భల్లూకమును క్రిందికిద్రోయుము దాని భక్షించిన నేబోదు నాపై నీవు సుఖముగా నింటికిపోవచ్చు ననిన రాజకుమారుండు సంతోషించి యిది మంచిదీయుపాయంబని దలంచి నాభల్లూకమును క్రిందికిద్రోసిన దైవానుగ్రహమున నదిపడక మేల్కొని రాజుకై జూచి రాజా వింటివా విశ్వాసఘాతకుడికంటె ద్రోహి పాతకుం డన్యుడుండడను సుమీ వినుము.

శ్లో॥ విశ్వాసఘాతకొ లోకే మహాకష్టాం భవంతిహి । నహిమిత్ర ద్రోహాపాపం నశ్యేద్యజ్ఞాయుతైరపి॥

www.mohanpublications.com

బ్రహ్మహత్యాది పాపానాం కథంచిన్నిష్కృతిర్భవేత్ । విశ్వాస ఘాతినాంపాపం నశ్యేజ్జన్మకోటిభిరితి॥

ఇవ్విధంబున శాస్త్రంబుగలదు గాన మిత్రద్రోహీ నీవున్మత్తుండవై భూమిలో సంచరించుమని శాపంబిచ్చి సింహముకై జూచి యోమృగేంద్రా మనమిద్దరము శాపోపహతులమై యీజననంబునొందితిమి వింటివా నేను భృగువంశసంభవుండ ధ్యానకాష్ఠుండను నామంబుగలవాడ పైనగతిచే నీరూపంబునొందితి నోసింహంబా నీవు భద్రుండను కుబేరునిచూచివుండవు ధనమదాంధంబున నొకనాడు భార్యలంగూడి వివస్త్రుండత్తనిర్లజ్జచేగర్వించి గౌతమమహాముని యెదుటదిరిగిన కోపించి సింహంబు గమ్మని శపించిన శాపవిముక్తుండయి గంధర్వరూపంబునొంది గౌతముండు ధ్యానకాష్ఠుని సంభాషణంబుచే ముక్తుండవనగుదువని చెప్పిన మాటసత్యంబాయనిన సంతోషించి విమానారూఢుండయి వినోదంబున కుబేరుని జేరబోయె.

ఆ భల్లూకమును శాపంబునొంది యథారూపంబు జాల్చెనంతట రాజపుత్రుం డున్మత్తుండై పిచ్చివానిరీతి లోకములో దిరుగుచుండి దైవానుగ్రహంబున తనతండ్రియగు నందునియాశ్రమముజేరి యున్మత్తునిరీతి సంచరించుచుండ నతని తనకుమారునిగా నెరింగి యడిగిన వృత్తాంతంబంతయు జెప్పినవిని చింతించి జైమిని మహామునికడకు దోడ్కొనిపోయి పాదములపై వ్రాలి కథయంతయు జెప్పిన ధ్యానకాష్ఠుని శాపముద్రిప్ప శక్యంబుగాదుగాని దక్షిణ సముద్రములో రామసేతువులో ధనుష్కోటిలో స్నానముజేయించిన పవిత్రుండగునది మహాపుణ్యతీర్థమని చెప్పిన నామునీంద్రునకు నమస్కారంబు గావించిన నందుడాక్షణంబున పుత్రసహితుండై ధనుష్కోటికేగి పుత్రసహితుండయి స్నానంబుజేసిన పుత్రుని కున్మాదంబుమాని బుద్ధిమంతుడయ్యె.

www.mohanpublications.com

అంతట నందుడు తపోవనంబున కరిగె ధర్మగుప్తుం డనేకదానం బులు ధనుష్కోటిలోగావించి రామనాథస్వామి దర్శనంబుజేసి స్వస్థ చిత్తుండయి నిజనగరంబునకుబోయి రాజ్యంబేలుచుండె వింటిరా మును లారా ధనుష్కోటిపై భవంబు మరియొక్కటి వినిపించెద పూర్వకాలంబు నపరావనుండను బ్రాహ్మణోత్తముం డజ్ఞానంబున పితృవధ గావించి ధనుష్కోటిలో స్నానమాత్రంబున నాపాపనివృత్తిబొందెను. మరియొక వింత యితిహాసంబుజెప్పెద సృగాలవానరసంవాదంబెట్లనిన శ్మశాన భూమిలో నిద్దరుగూడి వానరుండును నక్కతో యాశ్మశానవాటికలో పూతిగంధాతి కుత్సితంబులగు నీశవంశంబులను భక్షింపుచు నీకష్టంబు లనుభవింతు మెందుకనెను.

నే పూర్వకాలంబున దేవశర్మయను బ్రాహ్మణపుత్రుండ వేద వేదాంగపారకుండనై యుండియు నొకబ్రాహ్మణున కుడపద్వయ ధాన్యం బిత్తునని వాగ్దత్తంబుజేసి యివ్వకపోవుటచేత నక్కనై పుట్టితి నీచంబనుభ వించుచుంటి నోవానరా పూర్వకాలంబున వేదనాథుండను బ్రాహ్మణు నకు పుత్రుండవై బ్రాహ్మణగృహంబులో జొరబడి శాకంబుహరించిన పాపంబున నీవు వానరుండవైతివి.

ఏపాపంబునకై నివృత్తిగలదిగాని బ్రాహ్మణ ద్రవ్యంబు హరిం చినవానికి ప్రాయశ్చిత్తంబులేదని దుఃఖింపుచున్న సమయంబున దైవాను గ్రహంబున భూతిరుద్రాక్షధారియు శివనామపారాయణుండును సింధు ద్వీపుండను బ్రాహ్మణు డక్కడికివచ్చెనజూచి యిద్దరుదుఃఖించి నతని పైబడి యాక్రోశించి దీనికి ప్రాయశ్చిత్తంబు జెప్పుమని ప్రార్థించిన నావిప్రుండు చింతించి దీనికి నివృత్తిలేదుగాని పూర్వకాలంబున సుమతి యను నొకబ్రాహ్మణుండు కిరాతిసంఘంబుసేయుచు మద్యపానరతుండై బ్రాహ్మణద్రవ్యం బనుభవించి దుఃఖింపుచు రామసేతువులో ధనుష్కోటి యందు స్నానంబొనరించి పాపత్రయ నివృత్తినొందె గావున మీరిద్దరా

www.mohanpublications.com

ధనుష్కోటికిబోయి స్నానంబులుగావించిన నీచజన్మరాహిత్యంబగును. సుగతి దొరుకునని జెప్పెను.

నారావిధంబున జరిగించి పునీతులైరి మరియు నొక్కవిశేషంబు మహోన్నతంబైన యితిహాసంబు జెప్పెద దురాచారుండను బ్రాహ్మణుండు దుస్సాంగత్యంబువలన బ్రాహ్మణహీనుండై భేతాళగ్రస్తుండై ధనుష్కోటిలో స్నానంబుజేసి ముక్తుడయ్యెనని జెప్పిన సూతా యాకథ విశదంబుగా వినుపింపుమనిన మునులారా స్వర్ణస్తేయీ సురాపాయీ బ్రహ్మ గురుతల్పగ వీరు నల్గురు మహాపాపులు॥ తత్సంయోగీతిపంచమః అని వారి సాంగత్యంబును జేసినవాడై నాపాపాత్ముండెట్లనిన.

నల్గురు పాపాత్ములతో నొకదినంబు శాంతంబు గూడిచరించిన బ్రాహ్మణ్యంబులో చతుర్థాంశంబు నశించును.

రెండోదినంబుగూడిన సగంబుమూడుదినంబులు గూడెనేని భాగ త్రయంబు నశించును.

దిన చతుష్టయంబైన పిమ్మట బ్రాహ్మణ్యవాచక హీనుండగును నాపైగలసి శయనాశన భోజనమజ్జనాదులగలసెనేని తత్తుల్యపాతకుండై దేహాంబు లేదు.

కావున నాదురాచారుండు బ్రహ్మణ్యహీనుండై బాహుళ్యంబు వలన భేతాళగ్రస్తుండయిన తనశరీరం బెరుంగక నున్మత్తుండయి యనేక దేశంబులు సంచరించుచు దైవానుగ్రహంబున ధనుష్కోటిజేరి యందు లోమునిగినంతమాత్రంబున పూర్వస్మృతివచ్చి నేను గౌతమీతీర దాసుండ సిద్ధిదలచేరం బెంపు కింటిమారంబు వచ్చితినని చింతింపుచుండె.

www.mohanpublications.com

అంత నానమీపంబున దత్తాత్రేయుండను మహాయోగినిజూచి పాదాభివందనంబుచేసి యోమహాత్మా నాపేరు దురాచారుండు గౌతమీ తీరవాసుండు నేనిచ్చటికెందుకువచ్చితినో తెలియదు మీరు సర్వజ్ఞులు గాన నాకు వివేకంబేర్పరుప వలయునని విలపించిన నాదయాళుండు ముహూర్తమాత్రంబు చింతించి ఓయీ నీవు మహాపాతకుల సాంగత్య దోషంబున బ్రాహ్మణ్యహీనుండవై తివని భేతాళుండు నిన్నావహించె మరియు ధనుష్కోటి తీర్థజలంబులు నీపై బడుటచే పూర్వజ్ఞానంబుగలిగె పాపపంజర విముక్తుండవై తివి మహాపాపాత్ముల సాంగత్యదోషంబు హరించె నిన్నుపీడించిన భేతాళుండు పూర్వకాలంబున బ్రాహ్మణుండు భాద్రపద కృష్ణపక్షంబులో మహాళయం బొనరింపని పాపంబుచేత నివి భేతాళత్వంబునొందె ధనుష్కోటి దర్శనమాత్రంబున భేతాళరూపంబు మాని విష్ణులోకప్రాప్తుండయ్యె.

## మహాళయపక్ష శ్రాద్ధ ప్రకరణము.

లోకంబులోభంబున భాద్రపదమాసంబులో మహాలయశ్రాద్ధం బొనరించనివారు దురాచారులు భేతాళరూపంబునొందుచు కతలదుకు సందేహంబులేదు మహాలయపక్షంబులో వేద వేదాంగపారగుండు శ్రోత్రియుండగు బ్రాహ్మణున కొక్కనికైన నిద్దరికైన ముగ్గురు నల్గురు కైన శ్రాద్ధవిధానంపోగా భోజనంబుబెట్టవలయు భాద్రపద బహుళమా వాశ్యమీ ప్రభృతిసూర్యుండు వృశ్చికరాశిలో ప్రవేశించువరకు నాదినం బులు పితృపక్షంబులో గణనీయంబులని యెరుంగవలయును.

భాద్రపద బహుళపాడ్యమీదినంబున శ్రాద్ధంబుజేసినవారలకు పితృమాత్రుం డష్టయిశ్వర్యంబు లొసంగు దేవతలు దశసహస్రవర్షం బులు తృప్తిపొందుదురు. మహాళయ శ్రాద్ధంబు చేయనివారికి గృహ క్షేత్రారామాదు లగ్ని హోత్రుండు దహించు.

www.mohanpublications.com

ద్వితీయాదినంబున మహాళయంబు జేసినవానికి పార్వతీనాథుండు సంతసించి సకలయిశ్వర్యంబులొసగు కైలాసవాసంబు నిచ్చుచు జేయని వాని పితరులు కాలసూత్రమహాభయంబుల బడుదురు వానికి బ్రహ్మ తేజం బడంగును.

దృతీయాదినంబున గావించినవానికి కుబేరుండు సంతోషించి మహాభాగ్యంబిచ్చును బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వానివెంటనుండు దురు పితరులు ముప్పదివేల కల్పంబులు తృప్తిబొందుదురు చెయ్యని వానికి దారిద్ర్యంబు సంభవించును.

చతుర్థిదినంబున జేసినవానికి గణపతిప్రీతుండయి విఘ్నంబులెల్ల దూరంబుసేయు పితృతృప్తిగలుగు. చేయనివానికి సకలకార్యంబులును విఘ్నంబులగును.

పంచమీశ్రాద్ధంబున లక్ష్మీదేవి ప్రీతిచే సకలభాగ్యంబులిచ్చు నాచంద్రతారకంబుగా కీర్తిగల్గును. గావించనివానియింట లక్ష్మీ పార్వతులుండబోరు.

షష్ఠితిథియందు శ్రాద్ధంబుజేసిన షణ్ముఖుండు ప్రీతుండగును. పుత్రపౌత్రాభివృద్ధిగలుగు చేయనివానికి జ్వాలా నరకంబుదొరకును.

సప్తమీ దినంబున శ్రాద్ధంబు జేసెనేని సూర్యుండు ప్రీతుండయి హిరణ్యాదులొసంగు చేయునివానికి క్షయరోగాది పీడగలుగును.

అష్టమీదినంబున మహాళయంబు చేసినవానికి మహాదేవుని దయచే కైవల్యంబు కరస్థంబై యుండును. పదివేలకల్పంబులు పితృగణం బులు తృప్తులగుదురు చేయునివానికి సకలదుఃఖంబులు సంభవించును.

www.mohanpublications.com

నవమీదినంబున మహాళయంబుజేసిన మహిషాసురమర్దని దుర్గా దేవి ప్రసాదంబున దేహావస్మారాదిరోగంబులుమాను మహదైశ్వర్యంబు దొరుకును. చేయనివానికి భూత ప్రేత పిశాచబాధలు గలుగును.

దశమీదినంబున మహాళయంబుజేసిన షోడశకళాపరిపూర్ణుండగు చంద్రుండు మహదైశ్వర్యంబులిచ్చు ధనధాన్యంబు లిచ్చు. జేయని వానికి కృషి భగ్నంబగు.

ఏకాదశిదినంబున మహాళయంబు జేసినవానికి మహాకాల రుద్రుండు ప్రీతుండయి సర్వశత్రుని నాశంబుజేయు. చేయనివానికి బ్రహ్మ హత్యాదోషంబులు సంఘటించు శత్రుబాధ గలుగును.

ద్వాదశీ దినంబున మహాళయంబు జేసినవానికి రమానాథుండను చతుర్భుజుండు ప్రీతుండై యుండు చతుర్దశ భువనంబులు సంతసించు శ్రీదేవి భూదేవులు సకలేప్సితంబు లొసంగుదురు. విష్ణుగదయగుకౌముది యపస్మారంబులు మాన్పును చక్రంబు విఘ్నచ్ఛేదంబు సేయును. శంఖంబు యాతుధానాది బాధలుమాన్పును చేయనివాడు మానవులచే బాధనొంది అక్షిచ్ఛేదన నరకంబులోబడును.

త్రయోదశీ దినంబున జేసినవానికి మన్మథుండు సంతోషించి స్వచ్ఛంద వనితాభోగంబులుగలుగు. చేయడేనిసుఖహీనుండగు.

చతుర్దశియందు మహాళయంబుగావించిన సదాశివానుగ్రహ పాత్రుండై యభీష్టంబుల బొందును. చేయనివాడు మహాపాపాత్ములతో తుల్యుండగును.

అమావాస్యయందు మహాళయంబు జేసినవానికి పితృగణంబు లమృత పానంబుగా తృప్తినొందుదురు. బ్రహ్మలోక నివాసులగుదురు

www.mohanpublications.com
సంపద వృద్ధిగలుగును యుమూరమూపతులిద్దరు సకలైశ్వర్యంబు లిత్తురు బ్రహ్మహత్యాదిపాపంబులు నాశనంబగును దేహాంతంబున బ్రహ్మైక్యానుసంధానంబుచే సాయుజ్యప్రాప్తుండగును చేయనివాని పితరులు పుణ్యలోకంబుల నుండినను సధఃపాతకు లగుదురు సంతతి నాశనంబగు.

ఓమునులారా భాద్రపదమాసంబు వచ్చిన పితృగణంబులు మా నామగోత్రంబులుచ్చరించి మాపుత్రులు బ్రాహ్మణుల కన్నంబు బెట్టుదురు, మాకు తృప్తిగల్గునని నృత్యంబు సేయుచుందురు భాద్రపద కృష్ణ పక్ష ప్రతిపత్తు మొదలుకొని ప్రత్యహంబును శ్రాద్ధంబుసేయుచు బ్రాహ్మణుల కభ్యంగనంబుగావించి ఘృతసూపభక్ష్యభోజ్యాది సమృద్ధిగా భోజనంబు బెట్టినవారికి పితృదేవత లాకల్పాంతంబు సుధాపానసమయంబుగా తృప్తిబొందుదురు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు తృప్తిబొందుదురు బహుభాషనంబులేల భాద్రపద బహుళపక్షంబున మహాళయశ్రాద్ధంబు గావించిన త్రిలోకంబులు తృప్తినొందు నిస్సందేహంబు పుత్రహీనులగు వారికి వారిభార్యలు జేయవలను. జేయనితీరుకు దానికినరకంబువచ్చును. ఆవశ్యంబు మహాళయంబు సేయవలెను.

దరిద్రుండయి ద్రవ్యంబు లేకపోయిన బ్రాహ్మణుల రాజుల వైశ్యుల భిక్షంబడిగి చేయవలెను భిక్షంబును దొరకకున్న నరణ్యంబు లోకిబోయి పితృదేవతలారా దరిద్రుండను భిక్షంబెత్తిన దొరకదాయనిన రోదనంబుసేయుచు తనహస్తంబుల నుదరంబుపై కొట్టుకొనుచు మహాధ్వనితో నేడ్చిన వానిపితరు లప్పుడు తృప్తిబొందుదురు.

గావున పితరులు శ్రాద్ధకాలంబున తమ గృహంబు నాశ్రయించియుందురు. (సుతులు లేనివారికి గతులు లేవనినట్లు) సుతులు శ్రాద్ధకాలంబుల పితరుల తృప్తిం బొందించక పోయినవారు శాపంబిచ్చి

www.mohanpublications.com

గృహంబు వెడల వారివారి నివాసంబులకు పోదురు. కాబట్టి పితరుల శ్రాద్ధకాలంబుల తృప్తులంజేయుట సుతులకు కర్తవ్యంబు.

మహాళయంబు జేసెనేనియు సకలతీర్థఫలంబును సకలయజ్ఞఫలంబును తులాపురుషాది దానఫలంబును చాంద్రాయణాది వ్రతఫలంబును చతుర్వేద పారాయణ ఫలంబును గాయత్ర్యాది మహామంత్ర జపఫలంబును సకలేతిహాస పురాణపారాయణఫలంబును బ్రహ్మ విష్ణు మహేశ్వర లోక ప్రాప్తి కారణఫలంబును సకలేప్సిత ప్రదంబునై మహాఫలదాయకంబగును.

వినుండు మునులారా పూర్వకాలంబున యయాతి దుష్యంత భరత నల హరిశ్చంద్ర కార్తవీర్యార్జున దశరథాంబరీష శ్రీరామ ధర్మరాజాదులు మహాళయంబులు గావించి వారివారిబాధల కష్టంబులబాసి పుత్రసంపత్తినొంది రాజ్యాభిషిక్తులై కీర్తికాములై భూలోకసౌఖ్యంబులనుభవించి స్వర్గాది పుణ్యలోకంబుల నివాసంబులు జేసిరి మరియును వశిష్ఠాత్రి భృగు గౌతమాంగీరస కుత్స కాశ్యప భరద్వాజ విశ్వామిత్రాగస్త్య పరాశర మృకండు ప్రభృతి మహామునులందరు మహాళయ శ్రాద్ధంబు లొనరించి యణిమాద్యష్టయిశ్వర్య సిద్ధులంబొంది జీవన్ముక్తులై విలసిల్లిరి.

కావున నైశ్వర్యంబు గోరినవారలు మహాళయశ్రాద్ధంబు గావించుట యవశ్యకరణీయ్యంబు నట్లుగావింపనివారలు భేతాళరూపంబు నొందుదురు మోదురాచారా పూర్వజన్మంబున నీవు మహాళయ శ్రాద్ధంబొనర్చని కారణంబున భేతాళ గ్రస్తుండవైతివి వైనను ధనుష్కోటి తీర్థంబున నీవిగాదబడుటచే నింతజ్ఞానంబుగలిగె.

తదుక్తంచస్కాందే॥ శ్లో॥ విప్రనిందాకృతాన్నరాణాంప్రాయశ్చిత్త మితీరితం। శూద్రాన్ననిరతానాంచ శ్రుతినిందారతాత్మనాం ॥

www.mohanpublications.com

కన్యావిక్రయిణాంవిప్రాః క్రయవిక్రయిణాంతథా । వేదవిక్రయిణాం దేవవిక్రయైనిరతాత్మనాం॥

విశ్వాసఘాతుకానాంచ కృతఘ్నానాంపనిష్కృతిః। భ్రాతృభార్యారతానాంను ధరవిక్రయిణాంతథా॥

తీర్థవిక్రయినాంపుంసాం ప్రాయశ్చిత్తంనవిద్యతే । తేషాంపాపాచినశ్యంతి ధనుష్కోటినిమజ్జనాత్॥

మాతృద్రోహపితృద్రోహయతిద్రోహరతాత్మనాం । గురునిందాపకాణాంచ శివనిందాపరాత్మనాం॥

సత్కథాదూషకానాంచ ప్రాయశ్చిత్తంనవిద్యతే । తేషాంచాత్ర ధనుష్కోటౌ స్నానాచ్ఛుద్ధిర్భవిష్యతి॥

ఏవంచ॥ కథితంవిప్రాః ధనుష్కోటీస్తునైభవం । యశ్శ్రుత్వాసర్వపాపేభ్యో ముచ్యతేమానవోభువీతి॥

వింటిరా మునులార ధనుష్కోటిమహాత్మ్యంబు స్కాందపురాణంబులో జెప్పిన విస్తారగ్రంథంబంతయు వివరించిన బహు వర్షంబులుగా వలెను మీరు సకల తీర్థయాత్రా సంగ్రహంబు వినగోరినవారు గావున గ్రంథబాహుళ్యంబగు నంక్షేపరూపంబుగా స్థాలీపులా న్యాయంబుగా దాని మహాత్మ్యంబంతయు గ్రహించవలెను.

## క్షీరకుండ మహాత్మ్యము.

మహానీయ గుణగరిష్టులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుం డిట్లనియె. ఓమునీంద్రులారా రామసేతువుంగల తీర్థంబులో ముఖ్యంబు వెలయు చక్రతీర్థాదులగు నరునదినాలుగు తీర్థంబుల తెరంగెరుంగించితిరి. ఇకమీాద నేది వినం కో రెదరెరుంగింపుమనిన శౌనకాదుండిట్లనిరి. ఓపౌరాణికోత్తమా చక్రతీర్థ

www.mohanpublications.com

సమీపంబుననుండు క్షీరకుండతీర్థంబున కానామధేయం బెట్లుగల్గె. తద్వైభవంబేలాగు సవిస్తరంబుగా నెరుగింపు మని వేడిన సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా దేవీపురపశ్చిమంబున ఫుల్లగ్రామంబున నొక ప్రదేశంబుగల దచటనుండి శ్రీరామచంద్రుండు లవణసముద్రంబులో సేతు బంధన ప్రారంభముగావించె తత్తీరంబున దర్శన స్పర్శన కీర్తన ధ్యానంబులొనర్చినమాత్రంబున సకలపాపక్షయకరంబగు క్షీరగుండంబు గలదు దాని ప్రభావం బెరిగించెద పూర్వకాలంబున వేదోక్తాచారసంపన్నుండగు ముద్గలుండను మునీంద్రుండు దక్షిణసాగరప్రాంతస్థిత ఫుల్ల గ్రామసమీపంబున నారాయణ ప్రీతికరంబగు యజ్ఞంబు గావింపుచుండ.

శ్రీమన్నారాయణుండు పీతాంబరధరుండై శంఖచక్ర కౌస్తుభాది భూషణ భూషితుండై శ్రీదేవీ భూదేవీ సహితుండై ముద్గలునకు ప్రత్యక్షుండై సాష్టాంగుడై యిట్లని స్తుతించెను.

లక్ష్మీనిరాజితోరస్కుండును కాలమేఘసమప్రభుండును పీతాంబరవిరాజితుండును కౌస్తుభాలంకృతకంఠుండును శంఖచక్రగదాపద్మ విరాజితచతుర్భుజుండును విజితానందలోముండగు పుండరీకాక్షుంగాంచి భక్తి పరవశుండై పులకాంకిత విగ్రహుండగుచు ఓరమానాయకా నీవు సకల జగన్నిర్మాతవు తత్పాలకుండవు తత్సంహర్తవు మత్స్యవిరూపివి నానావతారుండవు వరాహ నారసింహ వామన జామదగ్న్య రాఘవ బలభద్రకల్క్యాదిరూపధారివి విజ్ఞానస్వరూపుండవు నిన్నుగొనియాడ నాదరంబే నిర్లజ్జుండ కృపణుండ క్రూరుండ పిశునుండ డాంబికుండ పరదార పరద్రవ్య పరక్షేత్రలోలుడను నన్నుం గరుణాదృష్టి నవలోకించి రక్షింపు మని వేడిన.

ముద్గలః॥ ప్రథమజగత్సృష్టిపాలకాయతతఃపరం। సంహర్త్రేచ
తతఃపశ్చాన్నమోనారాయణాయతే॥

www.mohanpublications.com

నమోతత్వ స్వరూపాయ కరుణాయచిదాత్మనే । నమోపరాహ వపుషేనమఃపంచాస్యరూపిణె॥

వాసుదేవాయనమస్తుభ్యం జమదగ్నిసుతాయతే । రాఘవాయ నమస్తుభ్యం బలభద్రాయతేనమః॥

కృష్ణాయకలయేతుభ్యంనమోవిజ్ఞానరూపిణె । ఆత్మీయాంకరుణా సింధో నారాయణజగత్వతే॥

నిర్లజ్జంకృపణంక్రూరం పిశునండాంబికంకృశం । పరదారపరద్రవ్య పరక్షేత్రైకలోలుపం।అసూయావిష్టహృదయాంమాంరక్షకృపయాహరే॥

శ్రీవిష్ణుండు ముద్గలస్తోత్రంబునకు సంతుష్టుండై వరంబు వేడు మనిన నారాయణా మీదర్శనంబుకంటె వెక్కువ వరంబేమియున్నదై నను నాకు సాయంప్రాతకాలములయందు హోమంబుజేయనిచ్ఛ గలిగినదనిన విష్ణువు విశ్వకర్మనురప్పించి స్ఫటికశిలా కుట్టిమంబగు సర స్సును కల్పించుమని కామధేనువును రప్పించి క్షీరంబుతో నింపుమని యాజ్ఞయిచ్చిన తత్ప్రకారంబున జరిగించిరి. దానిచే సరిగా దానికి క్షీర కుండంబని నామం బిచ్చుట స్నానంబు జేసినవారికి మహాఫలంబు మరియు గాయత్రీ సావిత్రి తీర్థంబులు మహాత్మ్యంబులు వాటిలో నవగాహనం బవశ్యకరణీయంబు.

ఓమునీంద్రా నీయజ్ఞంబున ప్రత్యక్షరూపంబున హవిర్భోజనంబు గావింప నేతెంచితిననిన ముద్గలుండు సంతోషంబునొంది యిట్లనియె. ఓరమానాయకా నేధన్యుండనైతి నుత్పత్నియు సుతులును కృతార్థు లైరి నాజన్మంబును తపంబును వంశమంబును సాఫల్యంబు నొందె యోగీంద్రులు మనంబున నిరంతరంబును దలంచుచుండు నీవు సాక్షా త్కారంబు నొందితివి మదీయక్రతుకాలంబు సఫలం బయ్యెననుచు ఆవాహనాసనాది షోడశోపచారంబులం బూజించిన హరియుం బ్రీతుండై

www.mohanpublications.com

హవిస్సును భుజించి తృప్తింబొందె నంత నగ్నియు సకలామర సంఘంబులు చరాచరాత్మకంబులగు జగంబులన్నియు తృప్తిబొందె నానమయంబున లక్ష్మీకాంతుండు ముద్గలుంగాంచి ప్రీతుండయి వరము వేడుమనిన నతండిట్లనియె.

ఓ రమానాయకా నీవు ప్రత్యక్షంబునొంది భుజించుటవలనం గృతార్థుండనైతి నింక వరంబొందెద్ది గలదయినను నీయందు నిశ్చలంబును నిష్కపటంబగు భక్తింబ్రసాదింపుము మరియును బ్రతిదినంబును ప్రాతఃసాయంకాలంబుల పయోహోమంబు గావించుట శ్రుతిచోదితంబు గాన నేఁతత్ప్రీతింగోరి సురభిక్షీరంబున నిత్యంబు హోమంబు గావింపగోరెద నేనిర్ధనుండ నాకెట్లు సురభిక్షీరంబు గల్గునట్లు ప్రసాదింపుమని వేడిన నారాయణుండు అమృతాశనుండగు విశ్వకర్మనురావించి స్ఫటికశిలా భేదంబుల నొకసరోవరంబు నిర్మింపుమని యాజ్ఞాపింప నతండమొనర్ప సురభిరావించి యీగంపు మద్భక్తుండు మత్ప్రీతింగోరి నిరంతరంబు పయోహోమంబొనర్పం గోరుండెడన నీనీసరోవరంబును సాయంప్రాతఃకాలంబులం నరుదెంచి పయఃపూరంబులపూరింపు మితండు దాన హోమంబు గావించుచుండుననిన సురభియునంగీకరించె మాధవుండు ముద్గలుంగాంచి యిట్లనియె.

ఓతపోధనా నీనీసరోవర తీర్థంబగు సురభిక్షీరంబుచే నిత్యంబును సాయంప్రాతఃకాలంబుల మత్ప్రీతింగోరి హోమంబుగావింపుము గాన నేనంతుష్టినొందెద నీతీర్థంబు క్షీరకుండంబని లోకంబున ఖ్యాతిబొందు నీతోయంబున స్నానంబుగావించిన వారలు పంచమహాపాతకంబుల వలన నుపపాతకంబులనయినను బాసి పరిశుద్ధులగుదురు. నీవును దేహాంతంబున ముక్తిబంధనుండయి నన్నుంబొందెద యనియానతిచ్చి తిరోహితుండయ్యె. నంత నామునీంద్రుండును నారాయణు గూర్చి ప్రీతుండై యనేకశతసంవత్సరంబులు సురభిక్షీరంబున హోమంబు గావించుచు

www.mohanpublications.com

దేహాంతంబున శ్రీవిష్ణుసాయుజ్యంబునొందెద ఓ మునీంద్రులారా క్షీరకుండతీర్థంబునకా నామంబుగల్గిన తెరంగెరుంగించితి పూర్వకాలంబున కాశ్యపునిభార్యయగు కద్రువు కపటంబుజేసి సపత్నియగు వినతం బరాజితంగావించి దోషంబునొంది పిమ్మట భర్తృవాక్య చోదితయై యాతీర్థంబున స్నానంబొనర్చి పరిశుద్ధురాలయ్యె నెవ్వరైనను పరిశుద్ధమానసులగుచు నందు స్నానంబుచేయుదురో వారలకు వేదశాస్త్రంబులు యోగజపతపోనియమంబులు తీర్థంబునిషేవణంబులేల నాతీర్థబిందు సంయుక్తంబగు గాలిసోకినను బ్రహ్మలోక ప్రాప్తింబొందుదురు. మరియు నాతీర్థోత్తమంబున స్నానంబు చేసినవారలు సూర్యాగ్ని సమానతేజులై వెలయుదురు యెన్నడును వైతరిణ్యాది నరకంబులం బొందరు యేనరుండైన కామధేను సమంబగు నాతీర్థంబు గల్గియుండియు నితర తీర్థంబుల సేవింపంబోవుట గోక్షీరంబు సిద్ధంబై యుండ యర్కక్షీరంబు గోరుటకు సమానంబగు నేభుజాస్నానంబుగావించి వచించెద వినుండా తీర్థంబునందు స్నానంబుగావించిన వారల కలభ్యంబేదియునులేదు. ముక్తియుం గరస్తంబై యుండు సత్యంబు సత్యంబు సత్యంబు యేనరుండైన యధ్యాయంబు పఠించు వినునతండు క్షీరకుండ తీర్థస్నానఫలంబునొందు నిశ్చయంబు.

మరియు ఋణవిమోచనతీర్థంబుగలదు దానిలో స్నానంబుజేసి దేవర్షి పితృతర్పణంబులు జేసినవారికి ఋణగతి యవిమోచనంబగును. తదుపరి జపతీర్థంబున స్నానంబు చేయవలెను తదుపరి నలతీర్థంబున నవగాహానంబు మహాపుణ్యంబు తదుపరి సుగ్రీవ తీర్థంబును నీలతీర్థంబును గవాక్షతీర్థంబును. గజ, గవయ, శరభ, కుముద, సార, పనసాది వానర కల్పితంబులగు తీర్థంబు లనేకంబులు గల విభీషణ తీర్థంబు మహాపాతకనాశనకరంబు మహాహాన్నతంబు మునీంద్రులారా సకలతీర్థంబుల ప్రభావంబును వినుపించిరి.

www.mohanpublications.com

## కద్రూవ శాపవిమోచనము.

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణార్థవిశారదుండగు సూతున కిట్లనిరి. ఓపౌరాణికోత్తమా కద్రూ వినతలెవరితనూజలు కద్రూవేల ఛలంబున సపత్నింబరిభవించె పిమ్మట క్షీరకుండతీర్థంబున స్నానంబుచేసి యెట్లు ఆదోషంబువలన విముక్తయయ్యె. నాతెరంగంతయు సవిస్తరంబుగా నెరుంగింపు మనిన సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వంబున ప్రాజాపతి పుత్రికలగు కద్రూవినతలు కశ్యపుబరిణయంబై తత్ప్రసాదంబునొంది యుండిరందు కద్రువు శేషం వాసుక్యాద్యనేక పన్నగంబులంబడసె వినత అరుణ గరుడులను పుత్రుల నిర్వురంగాంచె యిట్లుండ కద్రు వొకసమయంబున నంతికంబున సంచరించుచు నుచ్చైశ్శ్రవుంగాంచి కపటంబు జేయుందలంచి వినత బిలిచి ఓ వినతా యీయశ్వంబు నీలవాలంబై ప్రకాశించెడు జూడుమాయనిన నావిని ఓకద్రూ ఈయశ్వరాజంబు శ్వేతవాలంబై యుండ నీలవాలంబని యేల వచించెదవనియె నిట్లాయిర్వురు వివాదంబుచేసి పరాజయంబు నొందిన వారలు దాసీభావంబు నొందునట్లు ప్రమాణంబుగావించిరంత కద్రువు నిజతనూజలగు సర్పరాజంబుకడకుంబోయి ఓపుత్రులారా నే దాసింగాక నుండునట్లు శ్వేతంబగు నుచ్చైశ్శ్రవు వాలంబు నీలంబుగా జేయుండన వారలంగీకరింపకయుండ కద్రువు రోషమూర్ఛితయై జనమేజయుండు సేయు సర్పయాగంబున నాశనంబు నొందుండని పుత్రులకు శాపంబొసంగ వారలలో కర్కోటకుండనువాడు దీనుండై జననిపాదంబులపయింబడి యోతల్లీ నేనుచ్చైశ్శ్రవాసంబు నీలంబుగాచేసెద భీతి బొందకుమని యాక్షణంబు స్వభోగంబుచే నుచ్చైశ్శ్రవు వాలంబంజన క్రమంబుగా చేసెనంత కద్రూవినతలు యుగాంతకాలంబున యోగనిద్రా విరాజితుండగు ఆదినారాయణునకు శయనంబును శశాంకశంఖమాణిక్య ముక్తైరావణకారణంబగు సముద్రోపాంతంబుననుండు నుచ్చైశ్శ్రవుంచేరిరంత వినతకృష్ణవాలంబగు దేవరాజ వాహనంబుగాంచి దుఃఖితయై

www.mohanpublications.com

కద్రువకు దాసియైయుండ తార్క్ష్యుండండంబువెడలి గిరిమాత్రశరీరుండై హుతాశనుంబోలె దేజరిల్ల నాతనిదేహ మహాత్మ్యంబున కచ్చెరువంది నిర్జరులనేకవిధముల బొగడిరి. భువనత్రయంబును భీతిబొందె నంత నతండ మ్మారూపంబు నొక్కించుకొని మాతృసమీపంబుజేరిన కద్రువ వినతంగాంచి ఓచేటికా నేనానాలయంబునకు బోవగోరెద నీవును నన్ను వహింపుము నీపుత్త్రుండగు గరుడుండు మత్పుత్త్రులవహించువని యాజ్ఞాపింప వినతగరుడుంగాంచి యోనందనా నీవీసర్పంబులు మోయుమనిన నతండు జననీవాక్యంబుల నంగీకరించి యాసర్పములవహించె. వినతయు కద్రువను వహించె నంతతార్క్ష్యుండు సహస్రాంశురథసమీపంబునకు వేగంబునంబోయిన చండకిరణు రశ్మిమండలంబుల వేడిమికోర్వనోపక నురగంబులు మూర్ఛంగూలిన కద్రువ సహస్రాక్షు ననేకవిధంబులంబొగడి తత్ప్రసాదాపాదిత జలాసారంబుల పుత్త్రులకెల్ల శాంతిగావించె నంత సరీసృపంబులు గరుడుగాంచి యిట్లనిరి.

ఓరీ చేటిపుత్త్రా ద్వీపాంతరములజూడ మాకభిప్రాయము గలదు గాన మమ్మువహించి యచటికిం బొమ్మనిన నాతండిట్లుగావించి యొక సమయంబున వినతంగాంచి యిట్లనియె. ఓజననీ నేయురగంబుల మోయుటకును నీవీకద్రువను మోయుటకును గారణంబేమి మరియు నన్నీయురగంబులేల చేటీపుత్త్రుండాయని పలికెద రిదియంతయు నిజం బెరుగింపుమనిన వినత యిట్లనియె. ఓతనయా నేపూర్వంబున నూరయుగు భగినిచే లఘమున పరాజితనై దాసినైతి తత్కారణమున నేను చేటీపుత్త్రుండని పిలువంబడుచు నీయురగముల మోసెదవు నేనీకద్రువను మోయుచున్నదాన నేనేమిసేయుదునని ఖిన్నయై యెఱింగించిన తార్క్ష్యుం డీదాస్యబేలాగునంబాయు నిందుకు జేయందగిన కార్యంబెద్ది యనిన వినత నీవిప్పుడ సర్పముల కడకుంబోయి యీదాస్య విమోచనంబున కుపాయంబడుగుమనిన నతండాక్షణంబు సర్పముల కడకుంబోయి ఓ యహీంద్రులారా మీరేదినైనం గోరిన నదిదెచ్చియిచ్చెద మాకీదాస్య

www.mohanpublications.com

విమోచనముగావింపుడనిన పన్నగము లమృతంబుగోరిన నాతండట్ల దెచ్చియిచ్చెదనని వచించి జననీసమీపంబునకుంబోయి యాతెరంగంతయు నెఱింగించి యమృతాపహరణమునకుంబోయెద నాకలి పుడమెడు భక్ష్యంబొసంగుమనిన వినత యోపుత్రకా సముద్రమధ్యమమున నుండు దుశ్చరిత్రులగు శబరులం భుజింపుము వారలయందొక విప్రుండు శబరీసంగ కౌతుకియైయుండు నతం డగ్నియుంబోలె బ్రహ్మతేజంబున కంఠంబు దహించు వానినెఱింగి పరిత్యజించుము నీశరీరంబంతయు మరుదాదిదేవతలు రక్షింతురుగాక యని యాశీర్వదించి యంపిన గరుడుండాక్షణంబ శబరాలయమునకుంబోయి వారలనెల్ల భక్షింపుచుండ నొక బ్రాహ్మణుండు గిరిధరం బ్రవేశించు విహంగముల విధంబున విస్తృతంబగు గరుడుని కంఠబిలంబున బ్రవేశించు శబరులలోనుండి కంఠంబు దహింప నయినదేతయుండెఱింగి యోవిప్రుండా నీవు పాపకారివైనను వధ్యుండవు కావు గాన త్వరితముగ కంఠము వెడలుమనిన నతండు మద్భార్యయగు శబరిని వెడలి మనివేడిన గరుడుం డట్లొనర్చె నంత నా విప్రుండు నిషాదీసహితుండై యథేచ్ఛంజనియె. నంతఖగోత్తముండా శబరులనెల్ల భక్షించి యతిశీఘ్రమున నిజజనకుండగు కశ్యపమునీంద్రుం జేరి యోతపోధనా మదీయ మాతృదాస్య నివారార్థంబై యమృతంబు దేవంబోయెద నాకాహారంబొసంగుమని వేడిన కశ్యపుండిట్లనియె.

ఓ వైనతేయా పూర్వంబున బ్రాహ్మణవంశ సంభవులగు సుప్రతీక విభావసులను భ్రాతలిర్వురు విత్తవిరోధంబుచే పరస్పర శాపంబులం బొందిరి వారలలో సుప్రతీకుండు షడ్యోజనోచ్ఛ్రాయంబున తద్విగుణాయామవిస్తర సంయుతంబగు గజంబయ్యె విభావసుండును త్రియోజనోచ్ఛ్రాయంబును దశయోజన విస్తృతంబగు కూర్మంబయ్యె నిట్లాయిర్వురు పూర్వవైరంబున పరస్పరజయంబునుగోరి యాసరోవరంబున యుద్ధంబు గావించుచున్నవారు వారలభక్షించితృప్తుండవై యమృతంబు దేవం బొమ్మని యాజ్ఞాపింప గరుడుం డాక్షణంబు మహాకాయంబులగు గజ

www.mohanpublications.com

కచ్ఛపంబున నఖంబులంగొని యొకతీర్థ సమీపంబునకుం బోవ నత్తిర
జంబున మహాచ్ఛాయంబగు రౌహిణేయంబనునగంబా గరుడుం
గాంచి శౌయిశతయోజనాయతంబగు మదీయశాఖపై నిగ్గజకచ్ఛపం
బుల దీవింపుమనిన నతండట్లొనర్ప నాశాఖపయిం గూర్చుండ నది
భగ్నంబయ్యెనని నాశాఖ నవలంబించి యధోముఖులై తపంబొనర్చు
వాలకిల్యమునీంద్రులంగాంచి యిదిభూమింబడిన నీమునిసంఘంబులకు
బాధయగునని దానంగొని యంబరంబునంబోవుచు జనకాజ్ఞచే నిర్జనం
బగు నగంబున నాశాఖవిడిచి గజకచ్ఛపంబుల భక్షించి తృప్తుండై
యమృతాహరణార్థంబై బోవుచుండ దినంబున మహోత్పాతంబులయ్యె
నంత నింద్రుండు బృహస్పతింగాంచి యోతపోధనా యీయుత్పాతంబు
లకుం గారణంబెరిగింపుమనిన నతండిట్లనియె. ఓపాకశాసనా పూర్వంబున
భవజ్జనకుండగు కశ్యపుండు జన్నంబుగావింప సకల సురసంఘంబులు
మునీంద్రులును యజ్ఞభారంబులంగొని యరుదెంచుచుండ నీవాసమయం
బున గోష్పదజలంబుల మజ్జనంబు గావించువారలను అంగుష్ఠప్రమాణ
దేహులును యజ్ఞసంచారయుతులగు వాలఖిల్య మునీంద్రులంగాంచి
పరిహాసంబు జేసితివిగాన నామునీంద్రులు క్రోధజ్వలితాననులై యింద్ర
శత్రులగు పుత్రుండు కశ్యపునకు దయించుమని హోమంబుగావించిరి
గాన గరుడుండు పుత్రుండై యుద్భవించి యిప్పుడు అముదాహారణంబు
గోరి యరుదెంచుచున్నవాడు గానసీయుత్పాతంబు లయ్యెడునని వాచ
స్పతి యెరింగించిన యింద్రుం డాక్షణంబ యమృతరక్షకులఁగావించి గరు
డుండమృతంబు గోరివచ్చుచున్నవాడు వీరలతిప్రయత్నంబున రక్షింపు
డని యాజ్ఞాపింప వారలియ్యకొని యాయుధపాణులై యుండ పక్షీంద్రుం
డును నచటికి మహావేగంబునంబోవ వారలు భీతిల్లి యస్త్రశస్త్రంబులం
గొని యుద్ధంబు సేయుచుండ సుపర్ణుండు కొందర తుండాగ్రంబుఁ గొందర
పక్షంబుల ఖండించుచు పక్షవిక్షేపంబుగావింప ధూళియాకసంబు గప్పె
నంత త్రినేత్రప్రేరితుండగు పవమానుండా ధూళిభుజంబు నిరసించిన ఖగేం
ద్రుండు క్రోధదీప్తుండై రుద్రవసు మరుదాది సురసంఘంబులనెల్ల పక్ష

www.mohanpublications.com

తుండంబులం బీడింప వారలును భీతులై పలాయనంబునొంది రంత పురోభాగంబున జ్వలింతు నగ్నిం గాంచినదీజలంబుచే శాంతింబొందించి యొకభ్రమచ్చక్రంబుజూచి సంక్షిప్తాంగుండైన దంతరాళంబున బ్రవేశించి యతిభయంకరరూపంబులై జనంబుల దర్శనమాత్రంబున భస్మంబు గావింప నోవు యహీంద్రద్వయంబుగాంచి వానిశిరంబుల కాలంద్రొక్కి యమృతంబెత్తుకొని యంతరిక్షంబునం బోవుచుండ రమానాథుండేతెంచి యోవైనతేయా నీప్రతాపంబునకుమెచ్చితి వరంబువేఁడుమని యానతిచ్చిన ఖగేంద్రుండు ప్రీతుండగు రమానాథుంగాంచి యోకమలామనోహరా నాకెల్లప్పుడు జరామరణంబులు లేక యుండునట్లును ప్రసాదింపవే యనియడిగిన నారాయణుం డంగీకరించి యావరంబొసంగి యంతర్ధానగతుండయ్యె నంత నాఖండలుండేతెంచి యాగరుడుని వక్షంబులపై కులిశంబువేచిన నతండానవ్వుచు పాకశాసనుంగాంచియిట్లనియె యోపురుహూతా త్వత్కులిశ పాతంబువలన నాకువేదన గలుగనేరదు అయిన నొక పర్ణంబొసంగెద దానిదినఫలోద్యోగంబగునని యొక పర్ణంబొసంగ సకలసురమునిసంఘంబు లాతిపర్ణంబులను స్థిరత్వంబునకుమెచ్చి సుపర్ణుండని పొగడిరంత గరుడుండింద్రునితో మరలనిట్లనియె. యోపురందరా నే సచరాచరాత్మకంబులగు సకలలోకంబుల వహింపంజాలను భవాదృశ సహస్రింబులైనను నాకుయుద్ధంబున లక్ష్యంబుగావు నీవేమి సేయనోపుదువనిన నిర్జరనాయకుం డతనిసామర్థ్యంబున కాశ్చర్యంబునొంది శాంతంబుగా నతనితో నిట్లనియె.

ఓ ఖగేంద్రుఁడా అజరుండవమృతుండవగు నీవమృతంబేల దీనినొరులకిచ్చిన వారలు జరామరణవర్జితులై మాకంటె నధికులై మమ్ము బాధింతురు గాన మరలనాకిమ్మన నతండింద్రుఁగాంచి యోసురనాయకా నేనమృతంబుగొనిపోయి యురగులకిచ్చి నామాతృదాస్యంబు బాపెద పిమ్మట వారలుపయోగింపకమున్న నీవాయమృతము గొనుమన దేవేంద్రుండు ప్రీతుండై వరంబువేఁడుమనిన సుపర్ణుండు కపటంబుచే సుజనని

www.mohanpublications.com

చాసింగాజేసిన యురగంబులెల్ల నాశనంబగునటు గావింపుమని వేడిన నింద్రుండావరంబొసంగె కంతి గరుడుం డమృతంబుగొని యురగులకడకుం జని యోపన్నగంబులారా యమృతంబుతెచ్చి కలశంబులపై నుంచితి మీరలింకమజ్జనసంబుగావించి పానంబొనర్పుండు మజ్జననీదాస్యంబు బాసెననిన సర్పరాజంబు లంగీకరించె నింద్రుండాతరి యమృతంబుగొని దివంబురకుబోయి యథాస్థానమునందుంచె నాసమయమున భుజగంబు లమృతంబుగానక నదియుంచిన దర్భలనాకుటవలన జిహ్వాంబుల కుశాగ్ర తాడితంబులై ద్వివిధములయ్యె. నాటంగోలెదోములెల్ల ద్విజిహ్వాలనం బరగె నమృతస్థితింజేసిన దలుపవిత్రంబులయ్యె నివ్విధంబున గరుడుండు జననీదాస్యమివాపి కపటమున నీజనవిదాసుంజేసుకొనిన కద్రువుంగాంచి కోపమున భర్తృవరిచర్య కరుగాకయుండుమని శాపంబొసంగి యథేచ్ఛం బోయె నంత కద్రూవినతలు భర్తృసమీపమునకుబోవ నామునిపుంగ వుండు కద్రువుకగాంచి కోపసంరక్తలోచనుండై లోదురాత్మకా వినతంగ పటమున కుంబరాజతంజేసితివిగాన మత్పరిచర్యకుండగవు యేమనుజుం డైనను యేయంగనయైనను పరులంగపటముగావించి జయమునొందు దురో వారలు మహాపాదకులనంబడుదురు తత్సంభాషణముగావించిన నరుండు బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణస్తేయాది దోషములంబొందు పిమ్మట నరకమునంబడుదురు. మరియును ఛలజేత్ర వంక్తిభుజించు వాడతి దారుణ నరకమునొందు మరియు నతని దర్శనముగావించినది రెండు పాపశాకక్తైతి సూర్యునైన జలమునైన పావకునై నవిలోకింప వలయు యచట నతండు వసించునచట నివాసముగావించిన వారలెల్ల నరకప్రాప్తులగుదురు గాన మత్సమీపననుండకుమని కదు)వను ధిక్కా రముజేసి స్వచశీలయగు వినతం బరిగ్రహించె నిట్లు కశ్యప మహా మునీంద్రుచే. నిరసింపంబడి యతని పాదపతితయై విలపింపుచున్నను నతండంగీకరింపక పోయిన వినతయిట్లనియె. ఓమునీంద్రా మన్నంగినిం దయాళుండవై రక్షింపు మజ్ఞానమున పాపముగావించె క్షమింపుము

www.mohanpublications.com

లోకమున ధనాఢ్యులగు సాధులెల్ల దయాళువులై యుందురుగదా యనివేడిన వినతంగాంచి కశ్యపుం డిట్లనియె.

ఓ వినతా యీపాపమునకు శాంతియొనర్పంగాని యీదురాచారింగైకొనవే ముమ్మారువచించె నిశ్చయంబనిన వినతయిట్లనియె. ఓమునీంద్రా యీపాపమునకు నిష్కృతిగావించి దత్పరిచర్యాహారమెట్లగు నది వచింపవేయనివేడిన నతండు కొంతదడవు చింతించి యిట్లనియె. దక్షిణసముద్రతీరమున విముక్తిదంబగు ఫుల్లగ్రామమున పాపవినాశంబగు క్షీరసరంబున బొకతీర్థముగలదు కద్రువచటికింబోయి స్నానంబొనర్చిన మాత్రమున దోషవిముక్తియగు నట్లుగావింపక ప్రాయశ్చిత్తాయుతము లొనర్చిన నీదోషము నశింపదని కశ్యపుండు వచించిన కద్రువ పుత్ర సహాయనియై కతిపయదినముల క్షీరసరంబునకుంబోయి విజితేంద్రియ యుస్రియతయునై సంకల్పపూర్వకముగా స్నానంబొనర్చి తిథిత్రయంబు పవాసముండి చతుర్దివసమున అదరపూర్వకముగ స్నానముజేయుచుండ అశరీరవాణి యిట్లనియె. ఓవనితా ఈతీర్థమున స్నానముజేయుటంజేసి గరుడోక్తశాపము నశించె భర్తృజాశిరోషణమున కహాఙ్గారాలవైతివి ఖలజేత్మదోషము నశించె నింక భర్తృ సమీపమునకుం బొమ్మతండు నిన్నుం బరిగ్రహించునని వచించిన కద్రువ యాయశరీరవాణికి వందనముగావించి యాతీర్థమునకు ప్రదక్షిణముజేసి పుత్రసహితయై భర్తృ సమీపమునకుంబోయె నంతనామునీంద్రుండు క్షీరసరోవరముల స్నానముగావించి ధూతపాపయగు కద్రువంగాంచి ఆత్మశిశ్రూణమున కంగీకరించెను. ఓమునీంద్రులారా కద్రూశాపవిమోక్షణంబగు వృత్తాంతంబెరుంగించితి మెన్నండయిన క్షీరసరోవరమున స్నానంబొనర్చిన ముక్తిం బొందు మరియును యేమనుజుండైయున యీయధ్యాయము భక్తియుక్తుండై పఠించు వినునతండు క్షీరకుండ స్నానఫలమును అశ్వమేధాదియజ్ఞఫలమును గంగాది సర్వతీర్థఫలమునుంబొందు నిశ్చయం బని శౌనకాది మునీంద్రులకు సూతుం డెరుగించెను.

www.mohanpublications.com

## కపితీర్థ మహాత్మ్యము.

(రంభా శాపవిమోచనము.)

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాది మునీంద్రులకు సకలపురాణాభిజ్ఞుండగు సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వంబున రావణాదులగు రాక్షసులు మరణంబునొందిన పిమ్మట వానరులందరు గంధమాదనంబున కరుదెంచి సర్వలోకోపకారార్థంబై యొకతీర్థంబు నిర్మించి యాతీర్థంబున స్నానంబుగావించిన మానవులు విధూతపాపులై నరక దారిద్ర్యంబునొందక ముక్తిబొందుదురు యాతీర్థంబున నెవ్వండైన నిరంతరంబు స్మరించుచుండు నతండేస్నేత పరంపరలనొంది పిమ్మటపరమపదంబునొందు నీతీర్థంబునకు సదృశంబులేక యుండునని వరంబులొసంగి రామచంద్రుకడకుంజని నమస్కార పూర్వకంబుగా ఓరఘునాయకా యీతీర్థంబునకు నుత్తమంబగు వరంబొసంగవేయని వేడిన రామచంద్రుండు ప్రీతుండయి యీకపితీర్థంబున స్నానంబొనర్చినవారలు గంగాది సర్వతీర్థస్నానఫలంబును అగ్నిష్టోమాదియజ్ఞ ఫలంబునుగాయత్ర్యాది మహామంత్ర జప ఫలంబునుంబొందుదురని వరంబొసంగె. నంత శశశేఖరుండును నలువయు సహస్రాక్షుండును యముండును వరుణుండును ఆదిత్యుండును మరియునుంగల నిలింపులును అత్రియు భృగువు కుత్సుండును గౌతముండును పరాశరుండును కణ్వుండును అగస్త్యుండును సుతీక్ష్ణుండును విశ్వామిత్రుండును నారదుండును మొదలగు మహర్షులందరు యీరామదత్తవరంబగు తీర్థంబనేక విధంబులంగొనియాడ యుండు స్నానమొనర్చి యీతీర్థంబు కపీంద్రులచే నిర్మితంబగుటంచేసి కపితీర్థంబను ఖ్యాతిం బొందునని వచించిరి గాన నది సకల తీర్థోత్తమంబయి వెలయుచుండు నాకపితీర్థంబున ముక్తింగోరువారందరు స్నానమొనర్పవలయు. పూర్వంబున రంభ కౌశిక శాపంబున శైలరూపము నొంది యాతీర్థమున స్నానమొనర్చి మరల నిజరూపంబునొందె నని న శౌనకాది ఋషులిట్లనిరి.

www.mohanpublications.com

ఓపారాశికోత్తమా విశ్వామిత్రుండేల రంభను శైలయగునట్లు శాపమొసంగె పిమ్మట శిలాభూతయగు యాసురాంగన యట్లాతీర్థంబు నకుపోయి స్నానమొనర్చి నిదియంతయు సవిస్తరంబుగ నెఱింగింపుమని వేడిన సూతుండిట్టులనియె. పూర్వంబునకు శికాన్వయంబున విశ్వామిత్రుండను భూపలూముండుదయించి యొకానొక సమయంబున సేనాపరివృతుండయి సకల దేశంబుల సంచరించుచు వశిష్టాశ్రమంబునకుపోవ నామహాత్ముండు కామధేనుప్రభావంబున నతనికాతిథ్యంబొసంగిన తృప్తుడయి కామధేను ప్రభావంబెఱింగి దానిం తనకిమ్మని వేడిన వసిష్టుండంగీకరింపకపోయె నంత కౌశికుండు బలాత్కారంబున కామధేనువు గ్రహింపంబోయి తద్విసృష్టలగు మేచ్ఛాదులచే పరాజయంబు నొంది మహాదేవునారాధించి తత్ప్రసాదంబున సకల దివ్యాస్త్రంబులంబడసి మరల వశిష్టాశ్రమ సమీపంబునకుపోయి బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రంబులనెల్ల బ్రయోగింప నామునీంద్రుండు బ్రహ్మదండంబుచేనని యల్లవారించిన విశ్వామిత్రుండు పరాజితుండగుచు బ్రాహ్మణ్యంబునకై తపమొనర్పగోరి పూర్వదక్షిణ పశ్చిమ దిక్కులయందు ఘోరంబగు తపమొనర్చి యచ్చట విఘ్నంబునొంది ఉత్తరాశంబునకుంజని హిమవతంబున పాపవినాశినియగు కౌశిక నదీతీరంబున జితేంద్రియుండును నిరాహారుండును జితశ్వాసుండును జితక్రోధుండును గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థుండును వర్షాకాలంబుల ఆకాశగుండును శిశిరంబుల జలమధ్యస్థుండునునై యత్యుగ్రంబగు తపంబు దివ్యవర్ష సహస్రంబులు గావింపుచుండ యింద్రాదులగు నిర్జరులు భీతిగలిగి రంభంగాంచి యిటులనిరి. ఓకామినీమణీ హిమవచ్ఛైలంబున కౌశికీ నదీతీరంబున దుగ్రతపమొనర్చు విశ్వామిత్రుకడకుంజని తత్తపంబునకు విఘ్నమొనర్పుమనిన నది సురలంగాంచి ఓ త్రిదశపుంగవులారా విశ్వామిత్ర మహామునీంద్రుం డతిక్రూరుండు నన్నుంగాంచి శాపమొసంగుగాన నేభయంబునొందెద మీరలు దయాపరులయి నన్నికార్యంబున నియోగింపక రక్షింపుండనిన జంభారి యిట్లనియె. ఓవనితా భీతినొందకుము నీవతిసుందరరూపంబునొంది యా

www.mohanpublications.com

మునీంద్రుఁ మోహింపఁజేయుము నేనును నీవెంట నరుదెంచెద ఈమన్మథుఁడును కోకిలాలాపమధురుండగు వసంతుండును నరుదెంతురనిన రంభయు విశ్వామిత్రాశ్రమంబునకుఁబోయి మనోహర విచ్ఛేష్టితంబులు గావింప మదనుండును మనంబున నానందంబుఁగావించె నంత మునిపుంగవుండా రంభఁగాంచి సంశయంబునొంది శతక్రతుకృతంబు విఘ్నంబుగా నెఱింగి క్రోధ సంరక్తలోచనుండై యిట్లనియె.

ఓరంభా నీవతిదారుణంబగు శిలారూపంబునొంది వర్షశతాయుతంబులుండుము పిమ్మట నొకబ్రాహ్మణునిచే రక్షింపంబడి స్వరూపంబు నొందఁగలవని శాపంబొసంగె నాక్షణంబ నదియు శిలారూపంబునొంది బహుకాలంబు విశ్వామిత్రాశ్రమ సమీపంబుననుండె నంతనామునీంద్రుండును మహోత్తరంబగు తపంబుఁగావించి వశిష్ఠవాక్యంబున రాపి న్యమలభంబగు బ్రాహ్మణ్యంబుఁజెందె నాయాశ్రమంబున నగస్త్యశిష్యుండగు శ్వేతుండను మునీంద్రుండు చిరకాలము మోక్షముగోరి తపంబు గావింపుచుండ నంగారకయను నొక రక్కసి మేఘస్వన మహాస్వనయగుచు మూత్రరక్త పురీషాదుల వర్షింపుచు మరియు ననేకవిధంబుల నామునీంద్రుని బాధింప నతండు వృద్ధుండయి కౌశికసుత కోపమొందిన శిలంగొని నాయమవ్యాస్త్రసంయోగ్యంబు గావించి యారక్కసిపై వైవ నదియు నానిశాచరిననుగమించె. నారక్కసియు భీతింబొంది దక్షిణ సముద్రతీరంబుననుండు కపితీర్థంబున మునింగిన నాశిలయు ననుద్రుతమై యుచటికింబోయి యారాక్షసశిరంబునంబడియె. నంత రంభయు కపితీర్థమజ్జన ప్రభావంబున శిలారూపంబువిడిచి నిజరూపంబునొంది కుసుమధారావర్షితయు దివ్యవిమానారూఢయు దివ్యాంబర విరాజితయు హారకేయూరకటకవరాభరణ భూషితయు నూర్వశ్యాది సఖీపరివృతయునగుచు నాకపితీర్థ మహాత్మ్యం బనేకవిధంబులం బొగడి శశిభూషణుండగు రామనాథు సేవించి యమరావతికింపోయె నారాక్షసియు పూర్వంబున ఘృతాచి యనువేశ్యారత్నం బదియును కుంభజన్మశాపంబున రాక్షసి

www.mohanpublications.com

రూపంబునొందియుండి యిప్పుడాతీర్థంబున స్నానంబొనర్చి మరల తొల్లింటి నిజరూపంబునొందె. ఓ మునీంద్రులారా యివ్విధంబున ఘృతాచీ రంభ లిరువురు అగస్త్యశిష్యుండగు శ్వేతమునీంద్రు ప్రసాదంబున రాక్షసి శిలా రూపంబులవిడిచి కపితీర్థప్రభావంబున నిజరూపంబులంబొందిరి గాన జనులందరు సకలప్రయత్నంబులనందు స్నానంబుగావింపవలయునని శౌనకాది మునీంద్రులకు సూతుండెరుంగించెను.

మరియు గాయత్రీ సావిత్రీ తీర్థంబులు మాహాత్మ్యంబులు వాటిలో నవగాహనం బవశ్యకరణీయంబు.

మరియు రుణవిమోచనతీర్థంబుగలదు. దానిలో స్నానంబుజేసి దేవర్షి పితృతర్పణంబులు జేసినవారికి రుణగతయు విమోచనంబగును.

తదుపరి దేవతీర్థంబున స్నానంబు చేయవలెను. తదుపరి సల తీర్థంబున నవగాహనంబు మహాపుణ్యంబు.

“ తదుపరి సుగ్రీవ, తీర్థంబును, నీల, తీర్థంబును, గవాక్ష, తీర్థంబును, గజ, తీర్థంబును, గవయ, తీర్థంబును, శరభ, తీర్థంబును, కుముద, తీర్థంబును, నార, తీర్థంబును.”

పవనాది వానర కల్పితంబులగు తీర్థంబు లనేకంబులు గలవు.

విభీషణతీర్థంబు మహాపాతక నాశనకరంబు మహాన్నతంబు మునీంద్రులారా సకలతీర్థంబుల ప్రభావంబును వినుపించితిని.

వింటిరా మునీంద్రులారా రామేశ్వర మహాత్మ్యంబు.

www.mohanpublications.com

## శ్రీరామలింగస్వామి సేవాకైంకర్యాదులవలన వచ్చే ఫలముల వివరణ.

మరియు రామలింగప్రభావంబు మహాద్భుతంబు జెప్పెద సావధానచిత్తులై వినుండు శ్రవణమాత్రంబున సకలపాపంబులు నశించును శ్రీరామచంద్రులచే ప్రతిష్ఠింపబడిన రామలింగంబును నేమనుజుండైన దర్శించెనేని వానికి పునర్జన్మంబులేదు ముక్తుండగును. మునీంద్రులారా రామలింగ మహాత్మ్యంబు నెవ్వరు వర్ణించగలరు నాకు తోచినంత వివరించెద.

తదుక్తంస్కాందే॥ శ్లోకాః॥ రామప్రతిష్ఠితంలింగం యఃపశ్యతి పరస్యకృతం । సరవరోముక్తిమాప్నోతి శివసాయుజ్యరూపిణీం॥

సచ్చిదానందమద్వైతం సాంబంరుద్రంప్రయాతివై । రామేశ్వరాఖ్యంయల్లింగం రామచంద్రేణపూజితం॥

తస్యస్మరణమాత్రేణ యమపీడావినోభవేత్ । రామలింగేశ్వరం లింగంయేచ్ఛయతి సత్ప్రస్నరాః॥

కిందానైః కింప్రతైస్తేషాం కింతపోభిః కిమధ్వరైః । రామేశ్వర మహాలింగం మానస్నాద్రిహారంన్పృణాం॥ శ్రోతవ్యం కీర్తితవ్యంచస్మర్తవ్యం ముముక్షుభిః॥ఇతి॥ వింటిరా మునీంద్రులారా.

ఏమనుజునకైన ధనుష్కోటితీర్థస్నానంబును రామనాథ సందర్శనంబునుగల్గు నతనికి గంగాస్నానంబువలన కార్యంబులేదు యేమానవుండైన గటికాద్వయకాలంబు రామనాథునిం జింతించు నతండిరువది యొకకులంబు నుద్ధరించి శివలోకమునసుండు నెవ్వండైన యొకదినంబున రామనాథుని దర్శించిన నతండిహంబున ధనవంతుండై యుండి యంతమున రుద్రత్వంబునొంది రామనాథమహాలింగ సేవవలన గలుగనిఫలం బితర ధర్మంబుల నెన్నడైనను గలుగదు. ఎవ్వడైన జీవితకాలమధ్యంబున నొకానొకప్పుడైన రామనాథ దర్శనముసేయని నతండు పిత్రుబీజ

www.mohanpublications.com

సంభవుండుగాఁడు శంకరుండని చెప్పంబడు నే మనుజుండైన రామనాథాలయంబు దారవులచే నొనర్చు నతండు త్రికోటి కులసంయుతుండై స్వర్గ సుఖంబులఁబొందు, యెవ్వండైన యిష్టకంబులచే గావించునతండు వైకుంఠంబునొందు, శిలాసమూహములనొనర్చు నతండు బ్రహ్మపదంబునొందు, యెవ్వండైన స్ఫటికాదిశిలాభేదంబులం గావించునతండు విమానవరంబునొంది శివలోక సుఖంబులంబొందు. యేమనుజుండైన తామ్రంబుల నొనర్చు నాతండు శివధ్యానస్థితుండై శివసామీప్యంబు నొందు, యేమనుజుండు రజితంబులనొనర్చు నతండు శివసామీప్యంబు నొంది మహాదేవుచందంబున నిరంతరంబు మోదించుచుండు, యెవ్వండైన భక్తియుతుండై స్వర్ణంబుచే నొనర్చు నతండు శివసాయుజ్య రూపిణియగు ముక్తిబొందు, లోకంబున హేమంబున నాశివాలయంబు నొనర్చిన ధనాఢ్యుండును మృత్సమూహంబుల నాయాలయబుంగావించిన దరిద్రుండును వీరిరువురును సమానఫలంబు నొందుదురు.

యెవ్వండయిన రామనాథాభిషేక సమయంబున రుద్రాధ్యాయంబును చమకంబును పురుషసూక్తంబును త్రిసువర్ణంబును పంచశాంతియు పావమానాదికంబును జపించునతండు నరకంబునొందడు. యేనరుండైన పంచగవ్యంబుల నామనాథమహాలింగ స్నానంబుగావించు నతండాక్షణంబున కల్పజన్మార్జితపాపంబులం బోలఁగు. మధుస్నానంబుజేయించిన మనుజుండు పాపరాశింబాసి బ్రహ్మలోకంబునొందు. ఘృతస్నానంబుగావించిన మనుజుం డఖిల జన్మకృతపాప సమూహంబులంబాయు. క్షీరస్నానంబుగావించిన మర్త్యుండేకవింశతికులోద్ధారణం బొనర్చి శివలోకంబునొందు దధిస్నానంబుజేయించిన నరుండఖిలపాపవినిర్ముక్తుండయి విష్ణులోకంబునందు తిలతైలాభ్యంగనంబొనర్చి మానవుండు కుబేరగృహంబునవసించు. ఇక్షు రసంబుల స్నానంబుచేయించిన మనుజుండు చంద్రలోకంబునందు లికుచామ్ర రసాసారంబున మజ్జనంబు జేయించిన నరుండు పితృలోకంబునందు నారికేళంబుల స్నానంబు

www.mohanpublications.com

గావించిన మానవుండు బ్రహ్మహత్యాది మహాపాతకంబుల నాశనంబు జేయు. మరియు రామనాథాభిషేకార్థంబై మృష్టటంబే నరుండొసంగు నతండింబున చిరాయువై సకలసమృద్ధులంబొందుఁ తామ్రకుంభంబొసంగిన మనుజుండు దేవేంద్రత్వంబు నొందు. రౌప్యకుంభ ప్రధానంబు గావించిన జనుండు పరమేష్ఠిలోకంబునందు హేమకుంభదానంబుచేసిన నరుండీశ్వర లోకమునందు రత్నకుంభదానంబుగావించిన మానవుండు శివసారూప్యంబునందు నేమనుజుండైన గోదానంబుగావించు నతండశ్వమేధఫలంబునొంది దేహాంతంబున ఈశ్వరలోకంబున కరిగి శివరూపధారియై వెలయు మహాక్షేత్రంబగు రామేశ్వరంబున రామనాథసన్నిధియందు వసించునతండు ముక్తింబొందు జనంబుల కాయువృత్వరితంబుగ నరుగు. లోకంబున రామనాథమహాలింగంబు పూజించి వీక్షించి వినిన స్మరించిన వారలకు దుర్లభంబెద్దియులేదు. రామనాథ సేవింపంబోవుచుండు మనుజుంగాంచిన సకలపాపములు క్షితింనొందు. రామనాథు వీక్షించువారికి వేదములు శాస్త్రములు తీర్థయాత్రలేల యేనరుండయిన చందన కుంకుమ, కోష్ఠ, కస్తూరి, గుగ్గుల సరళాదుల నొసంగు నతండు ధనాఢ్యుండగు ముక్తాభరణ వస్త్రాదుల నొసంగువాడెన్నండును దార్ద్యంబు నొందడు యెవ్వడైన సమాహృతంబులగు గంగాతోయంబున రామనాథ మహాలింగాభిషేకంబు జేయు నితండీశ్వరునకుం బూజ్యుండు నిందుకుసందియంబులేదు. ఏపర్యంతంబుమనుజులకు జరామరణంబుగల్గు నంతాక సకలలోకవంద్యుం డతిపూజ్యుండును స్తుత్యుండునునగు రామనాథుని భజింపవలయు, సకలపురాణంబుల శాస్త్రాదుల మనాథపూజాకాత్మిశంబ ధర్మంలేదుగాన భక్తియుక్తులై మహాకారునిండగు రామనాథేశ్వరు భజించి వారలు భూలోకంబున పుత్రదారయుతులై బహుభోగంబులంబొంది దేహాంతంబున శాశ్వతంబగు ముక్తింబొందుదురు. ఓమునీంద్రులారా రామనాథప్రభావంబెఱుంగించితిరి. ఇంక నేవ్యాఖ్యకథ వినగోరెదరో వచింపుడన శౌనకాదులు

ఓసూతా

www.mohanpublications.com

## శ్రీరామలింగస్వామి ప్రతిష్ఠాకథను మునులడుగుట.

శ్రీరామలింగప్రతిష్ఠా శ్రీరామచంద్రుం డెవ్విధంబునజేసె దానికథ సవిస్తారంబుగా వినువింపుమని యడిగిన సూతుండు ప్రీతుండయి ముని వాతంబుతో నిట్లనియె.

ఓమునీంద్రులారా శ్రీరామచంద్రుండు సుగ్రీవాది వానరసైన్యంబుతో సముద్రంబుదాటి సువేలాద్రిపై విడిదిజేసియున్నయెడ రావణాసురుండు సౌధంబుపై నెక్కి సైన్యంబుల జూచుచుండ సుగ్రీవుండు సహింపజాలక వాయువేగంబుతోపోయి రావణాసురుని కిరీటంబులు దన్నిన నవి నధఃపాతంబులయ్యె నతండు గృహాంబులోనికిపోయి రాక్షస సైన్యంబులంబంపిన పోరు ఘోరంబయ్యె నతికాయ మహాకాయ ధూమ్రాక్ష తామ్రాక్ష నరాంతక దేవాంతక ప్రభృతిమూలబలంబులు మడసినపిమ్మట శ్రీరామభద్రుండు రావణ కుంభకర్ణుల వధించిన బ్రహ్మాస్త్రపాతితుండగు దశగ్రీవునిగాంచి విద్యాధరాది సకలదేవసంఘంబులు మునీంద్రులు బహుసంతోషించి రాఘవేంద్రుని స్తుతియించి రింద్రాదులు పుష్పవర్షంబు గురిపించిరి.

అంత శ్రీరామచంద్రుండు విభీషణునకు పట్టాభిషేకంబుజేసి సీతా సౌమిత్రిసమేతుండయి కపిసైన్యాంబులతోడ రాగ గంధమాదన పర్వతంబునకు వచ్చిన నగస్త్యాది మునీంద్రులు సంతోషించి వినుతించిరి.

ఓరఘునాయకా నీవులోకానుగ్రహాకారివి రావణవధంబుగావింప భూతలంబున జనించినవాడవు తాటకదేహసంహారివి అహల్యా ముక్తసంధాయివి పాదపంకజ రేణుండవు హరకోదండ భంజనుండవు మైథిలీ పాణిగ్రహణోత్సవశాలివి రేణుకాపుత్ర బరాజయకారివి పితృవచనంబు సత్యంబుగావింప నై దేహి లక్ష్మణసహితుండవై యరణ్యంబున కరు

www.mohanpublications.com

పెంచితివి భరతునకు పాదుకాయుగళంబొసంగి శరభంగ మహామునీంద్రునకు కైవల్యంబొసంగితివి విరాధ ప్రాణనాశనంబు గావించితివి గృధ్రిరాజ సఖుండవైతివి మాయామృగ మారీచగర్వంబు వారించితివి కబంధుంబరిమార్చితివి శబరీపూజనంబంగీకరించితివి సుగ్రీవసఖ్యంబు గావించి వాలింబరేత నిలయంబకనిచితివి మహాగంభీరంబగు సముద్రంబున సేతుబంధనంబుగావించి రావణాది సకలరాక్షస బృందంబులవధించి లోకత్రయంబునుం గాంచితివి. మఱియును సంసారాంధిని సంతారహేతిః పాదాంబుజ ద్వయుండవు భక్తార్తిసంహారివి సచ్చిదానందరూపుండవు సర్వలోక సృష్టిస్థిత్యంత హేతుభూతుండవు కరుణామూర్తివి సద్భక్తరక్షణ దీక్షితుండవు మమ్ములఁగావుమని పలువిధంబుల బ్రార్థించి యగస్త్యాదు లూరకయుండిరి.

ఓతపోధనులారా నేసర్వమానవులచే విశుద్ధికొరకు సేవనీయుండను దృష్టిగోచరంబగు జంతువు మోక్షభాజనంబగు అట్లయినను శాంతులు నిరహంకారులు యథాలాభసంతుష్టులును సర్వభూత దయాళులును ఊర్ధ్వరేతులగు మునీంద్రులకు నిరంతరంబు నమస్కరింపుచుందు గాన బ్రాహ్మణ్యదేవుండనైతి మిమ్మొక కార్యంబువేడెద రావణవధంబునం గలిగిన పాతకంబునకుం బ్రాయశ్చిత్తం బెరుంగింపుడనిన మునీంద్రులిట్లనిరి. ఓ జగన్నాథా వో సత్యవ్రతా మహాపుణ్యంబును విముక్తిదంబగు నీగంధమాదనపర్వతంబున లోకోపకారార్థంబయి శివలింగప్రతిష్ఠగావింపుము దానవీనశానవధ దోషంబునశించు లింగస్థాపన పుణ్యంబు వచింప చతుర్ముఖుండయిన సమర్థుండుగాడు యీగంధమాదనంబున నీచేస్థాపితంబగు శివలింగదర్శనంబున జనంబులకు కాశిలింగావలోకన ఫలంబుకన్న కోటిగుణిత ఫలంబుగల్గు నిందుకు సందియంబులేదు మరియు నాలింగంబు భగవన్నామంబుచే రామలింగంబని ఖ్యాతింబొంది కాష్ఠపుంజంబుల దహనుండుంబోలె సకలపాపంబుల నాశనంబు చేయుచుండుగాన ఓకరుణాకరా విగ్రహాలింగస్థాపనంబున కాలస్యంబు సేయకు

www.mohanpublications.com

మని మునీంద్రులుపలికిన రామచంద్రుండు ద్వీముహూర్తంబగు పుణ్య కాలంబు నిశ్చయించి మహాబలుండగు హనుమంతుంగాంచి యిట్లనియె.

ఓహనుమంతా నీవతిత్వరితగమనంబున కైలాసంబునకేగి యొక దివ్యలింగంబునుదెమ్మని శ్రీరాముండానతిచ్చిన తత్క్షణంబున మహా వాయువేగంబున కెగసి కైలాసంబునకరిగి తపోనిష్ఠంజేయ పార్వతీ సహితుండై శివుండు ప్రత్యక్షంబై లింగంబొసంగిన మారుతి యేతెంచు చుండె.

అగస్త్యాది మునీంద్రులు యాజికంబు జేయించ జానకీకృతంబైన లింగంబును, శ్రీరామచంద్రుండు జానకీసహితుండయి సంకల్పంబుచేసి జ్యేష్ఠశుద్ధ దశమీ బుధవారంబున హస్తానక్షత్ర సంయుక్త గరజీకరణ వ్యతీపాత యోగపంచాంగ శుద్ధిఁజూచి కన్యారాశియందు చంద్రుండును వృషభ రాశియందు సూర్యుండును విలసిల్ల మహాపుణ్యస్థలంబగు గంధ మాదనపర్వతంబుమీఁద నైదేహీకృతసికతామయ లింగంబును బ్రహ్మ హత్యాది నివారణార్థంబు ప్రతిష్ఠించె.

తదుక్తంస్కాందపురాణే॥ శ్లో॥ రామరామమహాబాహో కాలో హ్యత్యేతినాంప్రతం । జానక్యాయత్కృతంలింగంసైకతంలీలయావిభో ॥

తల్లింగంస్థాపయస్వాద్యమహాలింగానుత్తమం । శ్రుత్వైవ తద్వచనంరామో జానక్యా సహితస్త్వరం॥

మునిభిస్సహితఃప్రీత్యాకృతకౌతుకమంగళం । జ్యేష్ఠమాసేసితేపక్షే దశమ్యాంబుధహస్తయోః॥

గరజీచవ్యతీపాతేకన్యాచంద్రేవృషేరవౌ దశయోగేమహాపుణ్యే గంధమాదనపర్వతే॥

www.mohanpublications.com

సేతునాదమహాదేవంలింగరూపధరంహారం । ఈశానంకృత్తివసనం గంగాచంద్రకళాధరం॥

రామోపిస్థాపయామాస శివలింగమనుత్తమం।లింగస్థంపూజయామాస రాఘవస్సాంబమీశ్వరం॥

లింగస్థస్సమహాదేవః పార్వత్యామహాశంకరః । ప్రత్యక్షమేవభగవాన్దత్తవాసర్వముత్తమమితి॥

వింటిరా మునీంద్రులారా యీవిధంబున రామచంద్రుండు ప్రతిష్ఠించిన సైకతలింగంబును నేమానవుండు దర్శించినను కథవినిన రామనాథసేవాఫలంబును కైవల్యంబును లభించును.

ఓమునీంద్రులారా యివ్విధంబున శ్రీరాఘవుండు సైకతలింగంబును స్థాపించి పూజించుచుండగా హనుమంతుండు లింగద్వయంబును దెచ్చి శ్రీరామునకు సమర్పించి వందనంబాచరించి సీతాదేవిచే నిర్మింపబడిన సైకతలింగమును శ్రీరాములు పూజించుటజూచి రోషావేశంబుతో నత్యంత క్రోధోద్రేకుడై దుఃఖలోచనుండై దీనరక్షకుండగు శ్రీరామచంద్రులతో నిట్లనియె.

ఓదేవా నేదురాసుండ లోకంబున క్లేశంబునకై జనించితి నేక్రూరకర్ములగు నక్తంచరానీకంబులచే ననేకవిధంబుల ఖిన్నుండనైతి నావంటిపుత్రునే వనితయుంగాంచకయుండిన మేలు నేభవసాగర నిమగ్నుండ వైభవదీయ సేవచేతను యుద్ధంబుచేతను బహుప్రకారంబుల ఖిన్నుండనై యనంత దుఃఖంబు నొందితి సుగ్రీవుండుకార్యార్థంబై విభీషణుండు రాజ్యహార్థంబై నిన్ను సేవించిరి నేనిర్హేతుకంబుగ నిన్ను సేవించుచున్నవాడ యనేక వానరానీకంబులో నన్ను కైలాసంబునకుం బోయి లింగంబుదెమ్మని యాజ్ఞాపించితివి నేను త్వరితంబుగ కైలాసంబు జేరి పినాకింబాగడి తత్ప్రసాదప్రాప్తంబగు లింగంబుగొని యరుదెంచితి

www.mohanpublications.com

నీవిప్పుడు సైకతలింగస్థాపనంబుజేసి దేవమునిప్రభృతులంగూడి పూజించెదవు నేకైలాసంబున నుండిదెచ్చినలింగంబు వ్యర్థంబయ్యె నేమందభాగ్యుండ భూభారంబునకై జన్మించితి యీదుఃఖంబు సహింపజాల నేనేమి సేయుదు నీచేనవమానితుడనైతి శరీరంబు విసర్జించెదనని యనేకవిధంబుల వచించి క్రోధశోకాకులుండై నమస్కరించిన రఘునాథుండు నవ్వుచు సర్వదేవ మునీంద్రులు చూచుచుండ నాతనినాశ్వాసింపుచు నిట్లనియె.

ఓయంజనేయా నీయొక్క శక్తినాకుదెలియును జాతుండు సుజాయమానుండును మృత్యువాతకంబడకపోరు సమస్తజీవములు తాను జేసిన కర్మములచే నిరయంబై నరకంబు నొందుదురు. నిరంజనుండును నిరామయుండునైన పరమాత్మ నెరుంగుము.

ఓయంజనేయా నేను సర్వంబు నెరుంగుదు జాతుండును జాయమానుండు మృతింబొందుదురు. సర్వజంతువులు స్వకర్మంబుల మృతింబొంది నరకంబు నొందుదురు. పరమాత్ముండు నిర్గుణుండై ప్రకాశించుంగాన నీతత్వంబెరింగి శోకింపకుము లింగత్రయ నిర్ముక్తంబును నిరంజనంబును నిరాశ్రయంబును నిర్వికారంబగు పరమాత్మనెరుంగుము తత్వజ్ఞానబాధకంబగు శోకంబు నొందకుము యెల్లప్పుడు జ్ఞానంబునొంది యుండుము సంతతంబును స్వయంప్రకాశంబగు పరమాత్మం భజింపుము. తత్వజ్ఞానవిరోధకంబగు దేహాదులయందు మమతయుంచకుము నిరంతరంబు ధర్మంబుభజింపుము. ప్రాణిహింస గావింపకుము సజ్జనుల సేవింపుము యింద్రియంబుల నిగ్రహింపుము యితరదోషంబు లెంచకుము. వశిష్ఠాదులం బూజింపుము అశుభంబుమాని సత్యంబ నిరంతరంబు పలుకుము ప్రత్యగ్బ్రహ్మైక్యతాజ్ఞానంబు లేకపోవుటవలన వస్తుజాలంబులయందు మోహంబుగల్గెడు శోభనాశోభనంబులభ్రాంతి యదార్థంబుగ గల్పింపంబడు పదార్థంబులండెల్ల మోహాతిశయనంబున శోభనంబు

www.mohanpublications.com
లభ్యాస్తంబులగు భ్రాంతచిత్తులగువారలకు రాగంబుజనించు దేవ తిర్య
జ్మనుష్యాదులలో రాగద్వేషాదులంగూడు మానవులు ధర్మాధర్మనిశం
తులై నిర్ణయంబు నొందుదురు అతిశోభనంబులగు చందనాగరు
కర్పూరాదులచే శరీర స్పర్శమున మలినంబునొందు నాశరీరంబెట్లు సుఖ
కరంబగు మరియు భక్ష్యభోజ్యాదిపదార్థములచే శరీరసంగమువలన శిష్టం
బగు నాశరీరంబెట్లు సుఖకరంబగు మరియు సుగంధియు శీతలంబగు
తోయంబే యంగ స్పర్శంబున మూత్రంబగు నాగాత్రంబెట్లు సుఖకరంబగు.

ఓయాంజనేయా సేబంపాసరోవరంబున జానకీన్వేషార్థంబు సంచ
రించుచుండ నీవరుదెంచి సుగ్రీవసఖ్యంబొనరించి బహుయోజన విస్తా
రంబుగల నుదధియు నాయాసంబున తరించి సీతంజూచి నాయానవాలం
దిచ్చి లంకగాల్చి మరియు ననేక యద్భుత కార్యంబులంజేసి జానకి
యంగుళ్యంబుదెచ్చి నాకిచ్చి నాదుఃఖంబుదీర్చిన ఆపద్బాంధవుండవు.

ఓవాయునందనా పరమార్థం బెరుంగించెద వినుము. సంసార
గర్తంబున కించిత్సౌఖ్యం బయినను లేదు. మానవుం డజ్ఞానంబుజేసి
జన్మంబునొంది పిమ్మట వార్థిక్యంబును మరణంబునుంబొంది మరలం
బుట్టుచుండు అజ్ఞాన నివృత్తిగల్గెనేని సుఖంబుగల్గు నది జ్ఞానంబువలనం
గలుగుగాని కర్మాదులవలనం గలుగనేరదు. వేదవాక్యంబగు జ్ఞానంబె
పరబ్రహ్మంబని యెరుంగుము. అజ్ఞానంబు విరక్తునకుంగలుగుగాని యిత
రులకుంగలుగదు. ఆచార్యప్రసాదంబున యాజ్ఞానంబుగలుగు నేమను
జానకయినను మనంబున కామాదులు వర్తించుచుండు నతండు వ్యాతుం
డగు యెవ్వడయిన జ్ఞాననిష్ఠుండయియుండు నతండు పరబ్రహ్మంబు
నొందు లోకంబున మెలుకొన్న వానిని నిద్రించువానిని భుజించువానిని
చరించువానిని కృతాంతుండు క్రూరుడై సంహారింపుచుండు సర్వంబును
క్షయంబులగు వృద్ధిలంబులగు నవియెల్లను పతనంబునొందు సంయో
గంబులు విప్రయోగంబునొందు జీవితంబు నిధంబునొందు. లోకంబున

www.mohanpublications.com

పక్వఫలంబునకు పతనంబుకంటె భయంబెట్లు లేకయుండు నట్లు సకల జనంబులకు మరణంబుకంటె మరియొక భయంబుగలుగదు మరియును దృఢస్తంభంబగు గృహంబెట్లు కొంతకాలంబునకు జీర్ణంబయి నశించు నట్లు మానవులు జరామృత్యు వశంగతులయి నాశనంబునొందుదురు లోకంబున మానవుల కహోరాత్రగమనంబున నాయుర్వ్యయంబగు చుండు ఆత్మంగూర్చి శోకింపు మితరులపై శోకింపనేల లోకంబున మనుజుం డెచటనున్నను యెక్కడికి బోయినను మృత్యు వనుసరించి వధించు శరీరంబు వయఃప్రాప్తంబగుచుండ శిరోరుహంబులు శ్వేతంబు లగు జరయ శ్వానకాదులు నాక్రమించు అర్ణవంబున కాష్ఠద్వయంబు సంయోగంబునొంది కొంతకాలంబునకు పిమ్మట వియోగంబునొందు కరణి నీమార్గంబున నుండు మనజుండును సంచరించుటనుం గలసి కొంత దవ్వరిగి పిమ్మట యథేచ్ఛజనువిధంబునను భార్యాపుత్రక్షేత్ర ధనాది కంబులు సంయోగ వియోగంబుల ంబొందుచుండు నదిస్థిరంబుగా దందుకు చింతింపందగదు మనుజుండు జన్మించిన మృత్యువుంజనించి కాలంబెరింగి వధించు నందుకేమియుం బ్రతికారంబు లేదు.

గావున నాంజనేయా నీవు బుద్ధిమంతుడవు నీకు తెలియనియర్థం బులు లేవుగాని వత్సామత్సమంబున నీవుత్సహించి కుత్సితంబులగు భీభత్సకార్యంబులు నేయకు మతీమర్త్యంబులగు కృత్యంబులు మృత్యుం జయునిపై జెల్లునా నివర్తించునుగాని ప్రవర్తించవుగావున దురత్యంబులు మాను మంపకున శంకలేక లోకశంకరు శంకరుర్ఝుంకించిన కింకరులకే వంక దగులునని గాని శంశాక శేఖరుండు దలంకడని శ్రీరామచంద్రుం డుపదేశించిన నేదదీరిలేచి నమస్కారంబులు నేయుచు స్తుతించెను.

ఓశ్రీరామచంద్రా, ఆశ్రితపారిజాతుడవు, సీతామనోహరుడవు, దీనజనావనుండవు, వైకుంఠనాథుండవు అఘవినాశుండవు మారివినుతుం డవు, సర్వగీర్వాణ వరేద్యుండవుగు నీకు ప్రొమొక్కెదననుచు ననేకవిధం

www.mohanpublications.com

బుల సీతారాములస్తుతించిన ప్రసన్నులై సకలమునీంద్రులు వినుచుండ శ్రీరామభద్రుండు వానర శ్రేష్ఠాద్యేవాది దేవుడును దివ్యప్రభావుండును, సదాశివుండగు సాంబమూర్తికి యపరాధంబు జేసుటచే నింతహానికరం బయ్యెనింతటినుంచి నీవెవ్వరు శివద్రోహంబు సేయకు శివద్రోహి కనేక భవంబులు దురితంబులు భరితంబులయి నిరతంబు బాధించు వేధించు ఛిదించు క్రోధించు సాధించు విరోధించు నిరోధించుననుచు బోధించిన నాంజనేయుం డంజలి బద్ధుండయి యుండిన వత్సా నీవుదొరలి పొరలిన

### హనుమత్కుండ ప్రభావము.

### హనుమల్లింగ ప్రతిష్ఠాది మహాత్మ్యము.

గుంట హనుమత్కుండంబని త్రిలోకవిశ్రుతంబా నిందులో స్నానంబులు జేసినవారికి పంచమహాపాతకంబులయిన భగ్నంబులౌను, నీవుకదలించుటచే గంగాధరుని జటాజూట విశ్రుత గంగాజలంబులచే నీకుండంబు నిండె గావున గంగా యమునా కావేరీ గోదావరీ గోమతి మొదలగు నదులకంటె పవిత్రాతితరంబై పుణ్యలోకంబు లొసంగు నీహనుమత్కుండ సన్నిధిని సవిధానంబుగా శ్రాద్ధంబొనరించి తిలతర్పణంబు జేసినవారి పితరలు తృప్తులయి పుణ్యలోకంబులు జేరగలరు దురాచారుం డెవ్వడేని జేయడేని వాని జన్మంబు వృథాజన్మంబగును జీవన్మృతినిభంగి నిహలోక పరలోకంబుల వికలుండగును ప్రకటంబిదియని నమ్మవలయునని చెప్పి నీవు దెచ్చిన లింగంబు ప్రతిష్ఠించుమని జెప్పిన రామలింగేశ్వర స్వామి కుత్తరప్రదేశంబున హనుమల్లింగంబు ప్రతిష్ఠితంబయ్యె. నిప్పటికి రామలింగస్వామికి మారుతివాల వెష్టంటుననవళిత్రయంబు నిదర్శనం బిచ్చుచున్నదని జెప్పిన శౌనకాది మహర్షులు మహాశ్చర్యంబునొంది సంతోషించి సూతా యీకథ బహువిచిత్రంబు బహుపవిత్రంబు పాప లతాలవిత్రంబీకథ యేపురాణంబులో వివరింపబడియె నని యడిగిన సూతుండు మునీంద్రులారా వ్యాసప్రోక్తంబున స్కందపురాణంబులో కథ యిదయనిన సంతసించి లోకద్రోహియగు రావణాసురుని జంపుటచే

www.mohanpublications.com
బ్రహ్మహత్యసంభవించినదని చెప్పితి విది యాశ్చర్యంబు బ్రాహ్మణుని వధించిన బ్రహ్మహత్య సంభవించుగాని రాక్షసునిజంపిన బ్రాహ్మణ

— రావణాసురుని జన్మప్రశంసా బ్రాహ్మణ్యశిద్ధి హేతువ. —

హత్యకేమి కారణంబని యడిగిన మునులారా రావణుండు బ్రాహ్మణుండు చతుర్ముఖ బ్రహ్మకు అగస్త్యుండు కుమారుం డతనికి విశ్రవసుండు తన యుండయి మహాతపోనిష్ఠాగరిష్ఠుండై తపంబుసేయుచు నిల బిలా సంయోజనంబున కుబేరుండను మహాధనాఢ్యుండగు పుత్రుంబడిసిన నది జూచి సుమాలి యను రాక్షసుండు తత్సమీపంబున తపంబు సేయుచు కుబేరశదృశుండగు దౌహిత్రునిం బడయగోరి విచారించి తన పుత్రియగు కైకేసిని బిలిచి యిట్లనియె.

ఓతనయా నీవు విశ్రవసుం బ్రేమించి పుత్రుం బడయుము. వాడు మహాబలాఢ్యుడవునన నామె నట్లు విశ్రవసుంజేరి నమస్కరింప నాతపస్వి యాయమవృత్తాంతమెల్ల దెలుసుకొని ఓసాధ్వీ నీకోరిక సిద్ధించునుగా నిసాయాహ్నంబున సమాగమం బగుటవలన నీకుద్భవించు పుత్రులు క్రూరులు కుచ్చితులుగానుందురన, నావనిత భయాక్రాంతు రాలయి గడగడవడకుచుండ నాతపోధనుడు దయాళుండయి నీకు మూడవకుమారుండు యోగ్యుడు విష్ణుభక్తుండుగా జననంబయి నీవంశ మును పావనముజేయు. మరియు జననకాలంబున నారావంబొనర్పుట వలన రావణాసురుండని యతనికిపేరు లోకవిశ్రుతంబయ్యె తదనంతరం బున మహాదంష్ట్రుండును మహాకాయుండును లోకభయంకరుండును దురాచారుండును దుశ్శీలుండునగు కుంభకర్ణుండు సంభవించె తదుపరి శూర్పణఖ ముద్భవించెను. నాపై వేదశాస్త్రమార్గ ప్రవర్తకుండును ధర్మశీలుండును బుద్ధిమంతుండగు విభీషణుండు బుట్టె గావున రావణా సురుండు బ్రహ్మ బీజోత్పన్నుండగుటచే బ్రహ్మహత్యసిద్ధించె. మునీంద్రు లారా శ్రీరామభద్రుండు శివలింగప్రతిష్ఠాపనంబు జేసుటచే బ్రహ్మహత్యా

www.mohanpublications.com

విమోచ నియమ తీర్థంబును కల్పితంబయ్యె. ఆతీర్థంబులో నవగాహనంబు జేసినవారికి మహాపాపంబులు భస్మంబగునని చెప్పిన శౌనకాది మహామును లత్యాశ్చర్యానందభరితులయి సూతు ననేక విధంబుల గొనియాడిరి.

## శ్రీరామచంద్రులు బ్రహ్మహత్యా విమోచనతీర్థకుండ భైరవ ప్రతిష్టాదులు జరిగించిన మహాత్మ్యము.

అవలికథ యానతీయవెయని మునులడుగ పౌరాణిక శ్రేష్టుం డిట్లనియె. ఓ మునులారా మీరడజెప్పిన స్థలంబున నొక బిలముండంగని దానిపై శ్రీరామచంద్రుండు మంటపంబుగట్టించి క్షేత్రసంరక్షణార్థంబై భైరవ ప్రతిష్ఠగావించె నాబిలమందే బ్రహ్మహత్య మగ్నంబై యున్నది మరియు రామనాథ మహాలింగంబునకు దక్షిణంబుగా శివార్థ శరీరిణి యగు పార్వతియు పార్శ్వంబుల సూర్యచంద్రులును పురోభాగంబున నందికేశ్వరుండును యున్నవారు రామేశ్వరలింగంబునకు పూర్వభాగంబు మొదలుకొని యష్టదిగ్భాగంబుల నింద్రాది దిక్పాలకు లెనమండ్రుగురును కాపున్నవారు మరియు విఘ్నేశ్వర షడానన వీరభద్రాదు లచ్చటచ్చట నివశించి రామనాథక్షేత్ర రక్షణజేయుచున్నవారు మునీంద్రులారా శ్రీరామచంద్రుండు రామలింగప్రతిష్టజేసి పూజార్థంబై బ్రాహ్మణులనిలిపి వారికి యనేక భూషణాంబరాదు లొసంగి యనేకంబులగు నగ్రహారంబు లిచ్చినిలిపె మరియు శ్రీరామలింగమహావిభవం బొక్కటి విన్నవించెద సావధాన చిత్తులై వినుండు పూర్వకాలంబున శంకర నామధేయుండగు పాండ్య దేశాధిపుండు వేటమార్గంబున ననేక సైన్యంబుతో వేటకాండ్ర వెంబడించుకొని మహాఘోరంబగు విపినంబులో ననేక క్రూరమృగంబుల సంహారింపుచు భక్ష్యార్హంబులగు వరహా శరభ సారంగాది మృగంబుల హింసింపుచు చలరేగి వేటలాడుచు నతని సమానంబగు నొక శరంబు వ్యాఘ్రింబుపై వైచిన నది దప్పించుకొనిపోయె నాబాణంబు నొక్క

www.mohanpublications.com

మునిదంపతులకునగిలి యావృద్ధులిద్దరు మృతిజెందిరంతట వారిపుత్రుండును మహాక్రోశంబున దుఃఖింపుచుండ నచ్చటి ఋషిగణంబులు నోదార్చ నొక్క మహాకలకలంబగు ధ్వనివెడలిన రాజువిని విషణ్ణుండై యచ్చటి కేగిజూచిన వృద్ధ బ్రాహ్మణ మిథునంబు మరణంబు నొంది పడియున్న చింతాక్రాంతుండై నేనింత పాపాత్ముండ జీవించిన ఫలంబేమి యీ శరీరంబేల నగ్నిహోత్రంబులోబడవైచి భస్మంబుగావింతునని యుద్యుక్తుండై లేచి యోహోవ్యవహా బ్రాహ్మహత్యానివృత్తికొరకీ దేహంబు నీలోవైచి భస్మంబుగావింతు బ్రాహ్మణదంపతులమరణంబువలన బ్రహ్మహత్యయు స్త్రీహత్యయు రెండుసంఘటించె. నో మునీంద్రులారా వినుండు నవద్వారంబులుగలిగి చర్మమాంసాస్థి మేదోమజ్జాది దుర్మలినసిక్తంబై బుద్బుదాకారంబై కామక్రోధ లోభ మదమాత్సర్య మోహాదియుక్తంబయి పరద్రవ్యపరదారాసక్తంబయిన యీదేహంబు కాల్చుటే మేలని నిశ్చయించితినని వినిపించి విలపించి మంత్రులపుత్రుల బిలిపించి రప్పించి రాజ్యభారం బప్పగించి కాష్ఠంబులు దెప్పించి యగ్నిజ్వాలగావింపుడని యారాజు యాజ్ఞాపించిన మంత్రులు రోదనంబుజేయుచు నగ్నిప్రజ్వలనంబుగావించిన రాజు స్నానాదిక్రియలు నిర్వర్తించి పరిశుద్ధుండై మునీంద్రులకు నమస్కారంబులు గావించి మహాదేవుని మనస్సులో ధారణావశంబున నిల్పి యగ్నిహోత్రంబులో జొర నిశ్చయించు సమయంబున నాకాశంబున లోక విదితంబుగా నొక ధ్వని వినపించెను.

ఓరాజా అనలంబున దేహంబు వృద్ధినొందుచునే యుండునుగాన నిన్నిమిత్తమునగణంబు నీకేల ప్రత్యహంబును సేతుస్నానంబు సేయుచు శ్రీరామలింగస్వామిని దధిక్షీర మధుఘృతంబుల నభిషేకంబుల సేయుచు గంధపుష్పాక్షతంబుల భక్తిపూర్వకంబుగా నర్చింపుచును సంపన్నంబగు [illegible] నన్నంబులు భక్ష్యభోజ్యాది పదార్థంబులు నివేదించుచునుండిన పాపంబు భస్మంబగు నిన్నిమిత్తంబుగా నగ్నిలోబడిన దేహంబే భస్మం

www.mohanpublications.com
బోనుగాని పాపంబులు సంచితంబులయి వదలకనే యుండునని యశరీర వాణి వినబడిన మునీంద్రు లాశ్చర్యంబునొంది.

శ్లో॥ గచ్ఛశీఘ్రింమహారాజరామసేతుంవిముక్తిదం । రామనాథస్య మాహాత్మ్యమజ్ఞాత్వాస్మాభిరీరితిమితి॥

ఇవ్విధంబున బ్రాహ్మణోత్తము లుపదేశించిన రాజేంద్రు డనుజ్ఞగొని గంధమాదనంబునకుబోయి యాకాశవాణి వినిపించిన ప్రకారంబు సేతుస్నానంబున రామలింగార్చనంబును యథాశాస్త్రంబుగా జరిగించిన సంవత్సరాంతంబున రామనాథస్వామి కటాక్షించి ప్రత్యక్షంబయిన నారాజు బహువిధంబుల స్తోత్రంబులుజేయ నారంభించె.

ఓరామనాథా, ఓఉమానాయకా, నన్నుంగావుము కృపాళుండవై బ్రహ్మహత్యనివారింపుము, స్త్రీహత్యావిమోచనము జేయుము ఓత్రిపురనాశకా నీవు మహాదేవుడవు, కాలకూటవిషాదివి దయాసింధుండవీస్త్రీహత్యం బాపుము వోవిరూపాక్షా నన్నుం గృపాదృష్టిం నవలోకించి మదియ్యంబులగు పాపంబులనాశనంబుజేయుము. ఓకామాంతకా ఓరాఘవేశ్వరా త్వత్కటాక్ష వీక్షణంబున నన్నుం బరిశోధునిగా జేయుము. ఓమార్కండేయభయత్రాణా, ఓమృత్యుంజయా, ఓయవ్యయా, నన్నుం నిష్పాపుంజేయుము. ఓశంకరా నన్ను వేదోక్తాచార యోగ్యుంగాజేయుము. ఓదేవా నీవుసూర్యోదయంబుల హరించితివి రామదేవుండవు, దేవదేవుండవు అనంత సచ్చిదానంద స్వరూపుండవు, వృషభ ధ్వజుండవు, రామనాథుండవు నీకనేకవందనంబులు గావించెద మదియ్య పాతకంబులహరించి నన్నుం గావవేయని స్తుతించు నాభూపాలకు ముఖంబుననుండి యతిభయంకర రూపంబును, రక్తశిరోరుహాయు, నిలవస్త్రధరయు క్రూరయబ్రహ్మహత్య వెడలినంగాంచి.

www.mohanpublications.com

పరమశివుండు పార్థివా నీబ్రహ్మహత్యలు రెండును విడిచెను గదా జడవకు నుడిగిడిననీశరీరంబుబడలిక దీరును నీసేనంబుజేరి నీరాజ్యంబు పాలించుమని యనుగ్రహించిన భక్తవత్సలా నీపాదంబులపై భక్తివదల కుండ నీస్తోత్రంబు విన్న జదివినవారి కిహాపర సౌఖ్యంబులు గృపసేయు మని గోరిన ననుగ్రహించి యంతర్ధానంబునొందె మునీంద్రులారా యివ్విధంబున స్కాందపురాణంబులో జరిగిన వృత్తాంతంబు మీకు ప్రత్యయార్థంబు స్వల్పాత్స్వల్ప తరంబుగా సూచించితి యీవిధంబున పాండ్యఘుండు పవిత్రుండయి రామనాథస్వామిచే నాజ్ఞ గైకొని స్వసైన్యంబుతో పట్టణంబు ప్రవేశించి యథాసుఖంబుగా రాజ్యపరిపాలనంబు గావించెనని జెప్పినవిని మునీంద్రులు మహానందభరితులై మహాశ్చర్యంబు నొంది సూతా రాజుచే మృతినొందిన బ్రాహ్మణమిథునం కేమిగతి యయ్యెనని యడిగిన మునులారా మృతిబొందిన తల్లిదండ్రుల జూచి వారికుమారుండు మహారోదనంబుసేయ నచ్చటి మునులేతెంచి రాజహాకృత ద్రోహంబునకు చింతించు నతనిని నోదార్చి యోకుమారా వీరికి దుర్మరణంబు సిద్ధించిన దిందుకు నీవు దుఃఖించిన వినియోగంబు లేదు దైవకృత్యంబులకు మనుష్యులేమిచెయ్యగలరు జాతస్యమరణం ధ్రువంబని శాస్త్రంబెరుంగవాయని బహుప్రకారంబుల నోదార్చిన తన తలిదండ్రుల కగ్నిసంస్కారంబు నిర్వర్తించి యస్థి సంచయనంబుచేసి మునుల యాజ్ఞాక్రమంబున హాలాస్య నగరంబు బయలుదేరి రామేశ్వరం జేరి సేతువులో నస్థిస్థాపనంబు గావించి సపిండీకరణాది పరలోకక్రియలు గావించిన నారాత్రి స్వప్నంబున నతని తల్లిదండ్రులు విమానారూఢులై శంఖచక్ర గదాదిధారులయి వైకుంఠనగరంబునకు బోయినట్లుకన్నులకు ప్రత్యక్షంబైన సంతోషించి హాలాస్యనగరంబునుజేరి వృత్తాంతంబంతయు బ్రాహ్మణునకు వినిపించిన సంతోషించి మునీంద్రులారా రామనాథ మహాత్మ్యంబు నవిస్తారంబుజెప్ప నెవ్వరికి శక్యంబుగాదని సూతుండువినిపించిన సంతోషించి సూయరామలింగప్రతిష్ఠచేసిన తదనంతరంబున జరిగిన వృత్తాంతంబు వినిపింపుమని యడిగిన మునీంద్రులారా స్వామిని

www.mohanpublications.com
ప్రతిష్ఠించి శ్రీరామచంద్రుండు సౌమిత్రియు జానకియు సుగ్రీవుండు మొదలగు సమస్తసైన్యంబులు స్తోత్రంబులు జేసిరి సక్రమంబుగా వినవలయును.

శ్రీరామలింగస్వామిని,

శ్రీరామచంద్రుడు, దేవఋషి, మునులు, వానరులు, మొదలగు

సమస్తమైనవారలు స్తోత్రంబులు జేసిన

శ్లోకంబులు.

శ్రీరామచంద్రః ॥ శ్లో॥ నమోమహాత్మనేతుభ్యం మహిమామాయాయశాలినే । స్వపదాంబుజభక్తార్తిహారిణేసర్వహారిణే ॥ నమోదేవాదిదేవాయ రామనాథాయసాక్షిణే । నమోవేదాంత వేద్యాయయోగినాం తత్వదాయినే॥సర్వదానందపూర్ణాయవిశ్వనాథాయసంభవే । నమోభక్తభయచ్ఛేద హేతుపాతాబ్జరేణవే ॥ నమస్తేకిలనాథాయ నమస్సాక్షాత్పరాత్మనే। నమస్తేద్భుతవీర్యాయ మహాపాతకనాశినే ॥ కాలకాలాయకాలాయ కాలతీనాయతేనమః । నమోవిద్యానిహంత్రే తే నమఃపాపహారాయచ ॥ నమస్సంసారతప్తానాంతాపళన్యాశనహేతవు । నమోమద్యపిహ్మామహాత్యాయయానాశినేగరళాశినే ॥ నమస్తేపార్వతీనాధకైలాసనిలయాప్యయ। గంగాధరవిరూపాక్షు రక్షమాంసకలాపదః ॥ తుభ్యంపినాక హస్తాయనమోమదనహారిణే । భూయోభూయోనమస్తుభ్యంసర్వవస్తానుసర్వదేతి॥

ఇవ్విధంబున శ్రీరామచంద్రుండు స్తుతించినవెనుక లక్ష్మణుండు.

నమస్తేరామనాథాయ త్రిపురఘ్నాయ శంభవే । నమఉగ్రాయ భీమాయమహాదేవాయసాక్షిణె ॥ సర్వజ్ఞాయవరేణ్యాయ వరదాయహరాయతే । శ్రీకంఠాయనమస్తుభ్యం పంచపాతకభేదినే ॥ నమస్తేస్తుపరానందసత్యవిజ్ఞానరూపిణె । నమస్తేభవరోగఘ్నస్థాయూనాంపతయేనమః॥ పతయేతస్కరాణాంతే వహానాంపతయేనమః । గణానాంపతయే తుభ్యం విశ్వరూపాయసాక్షిణే ॥ తత్రతత్రపదద్వంద్వే భవతోభక్తిరస్తుమే । అస

www.mohanpublications.com

న్మార్గేగతిర్మాభూద్భవతఃకృపయావిభో ॥ పార్వతీజీవితేశాయగణేశస్కందసేవినే । నమస్తేసూర్యచంద్రాగ్ని లోచనాయకపర్దినే ॥ నమశ్శివాయ సోమాయ మార్కండేయభవచ్ఛిదే । నమస్సర్వప్రపంచస్య సృష్టిస్థిత్యంతహేతవే ॥ ఇతి ॥

ఇవ్విధంబున లక్ష్మణుండు స్తోత్రంబు జేసిన తదనంతరంబు సీతాదేవియు॥

శ్లో॥ పరమకారణశంకరధూర్జటే గిరిసుతాస్తనకుంకుమశోభితః మమపతౌపరిదేహిమతింసదానవిషమాంతరపూరుషగోచరాం ॥ గంగాధరవిరూపాక్ష నీలలోహితశంకర । రామనాథనమస్తుభ్యం రక్షమాంకరుణానిధే ॥ నమస్తేదేవదేవేశనమస్తేకరుణాకర । నమస్తేభవ భీతానాంభవభీతివిమర్దన ॥ నాథత్వదీయచరణాంబుజచింతనేన నిర్ధూమధాస్కుర సుతాద్భయమాశుశంభో । నిత్యత్వమానుగతవాజ్ఞానమ్యకంచుపుత్రఃకింవానవధ్యతితవాశ్రయిణాంపరేశ ॥ పరేశపరమానంద శరణాగతపాలక । పాతిపిత్వం మమసతాదేహితుభ్యంనమోనమః ॥ దేవదేవజగన్నాథం రామనాథకృపానిధే । తత్పదాంబోరుహగతానిశ్చలాభక్తిరస్తుమే । నమస్సదాయరూపాయ రామనాథాయ శంభవే॥

ఇవ్విధంబున సీతాదేవి స్తుతించిన వెనుక నంగదుండు.

శ్లో॥ యస్యభాసాజగత్భాతియత్ప్రకాశం వినాజగత్ । నభాసతేనమస్తస్మైరామనాథాయసంభవే॥

జాంబవాన్॥సర్వానందోయదానందోనచతేపరమార్థతః । రామనాథనమస్తుభ్యంపరమానందరూపినే॥

నీలః॥ యద్దేశకాలదిగ్భేదైర్నభిన్నంసర్వదాద్వయం తస్మైరామేశ్వరాయాస్మైనమోభిన్నస్వరూపిణే॥

www.mohanpublications.com

నలః॥ బ్రహ్మవిష్ణు మహేశాద నాదవిద్యావిజృంభిత । నమోవి ద్యావిహీనాయ తస్మైశ్రీరామేశ్వరాయతే॥

కుముదః॥ యత్స్వరూపరిజ్ఞానా త్కార్యాణాం పరమాణవః । కల్పితాః కారణత్వేనతార్కికైః పరమాస్తికైః ॥ తదహంపరమానందం రామనాథంమహేశ్వరం।ఆత్మరూపతయానిత్యముపాస్తేసర్వసాక్షిణం॥

గవాక్షః॥ అజ్ఞానపాశ బద్ధానాంపశూనాం పాపమోచనం । రామే శ్వరంశివం శాంతముపైమిశరణంసదా॥

గవయః॥ నమామిజగదాధారం చంద్రచూడముమాపతిం। రామ నాథశివంనందే సంసారమయభేషజం॥

శరభః॥ అంతఃకరణమాత్మేతియదజ్ఞానాద్విమోహితైః । భజ్యం తేరామనాథంతమాత్మానం ప్రణమామ్యహం॥

గంధమాదనః॥ రామనాథముమానాథం గణనాథంత్రియంబకం। సర్వపాతక సుద్వర్త ముపాస్తేజగధీశ్వరం॥

సుగ్రీవః॥ సంసారాంబోధిమధ్యేమాం జన్మమృత్యుజరాగ్రహాదే । పుత్రదారధనక్షేత్రవీచిమాలాసమాకులే। మజ్జన్ప్రహ్మేండమండేచపతితం సత్పసాగరే । క్రోశంతం రక్షమాంనాథరామనాథనమోస్తుతే॥

విభీషణః॥ సంసారవనమధ్యేమాంవినిష్టంనిజమార్గతః । శోభనాం పదవీశంభో దేహిరామేశ్వరాధునా॥

సర్వేవానరాః॥ నింద్యావంద్యేషుసర్వత్ర జనిత్వాయోనిషుప్రభో కుంభీపాకాదినర కేపతిత్వాచపునస్తథా ॥ జనిత్వాచపునోర్యసాకర్మశేషే ణాకుత్సతి । సంసారేపతితానస్మాన్ రామనాథదయానిధే । అనాదదానవ త్పాపేనాక్ క్రోశంతః పాహిశంకర । నమస్తేస్తుదయాసింధో రామనాథ మహేశ్వర్॥

www.mohanpublications.com

ఇవ్విధంబున నందరుస్తుతించిన తదనంతరంబున బ్రహ్మేంద్రా దిశ్యాది దేవతాసమూహంబు॥

బ్రహ్మ॥ నమస్తేలోకనాథాయ రామనాథాయశంభవే । ప్రసీద మమసర్వేశ మమావిద్యావినాశయ॥

ఇంద్రః॥ యస్యశక్తిరుమాదేవీ జగన్మాతాత్రయీమయి । తమహంశంకరంవందే రామనాథముమాపతిం॥

యమః॥ పుత్రౌగణేశ్వర స్కందౌవృషోయస్యచవాహనః। తంశ్రీ రామేశ్వరంవందే సర్వజ్ఞాననివృత్తయే ॥ యస్యపూజాప్రభావేన జితమృత్యుర్మృకండుజా । మృత్యుంజయముపాస్యేహంరామనాథంసదాశివం॥

కుబేరః॥ అహీశవిలసత్కర్ణ కుండలాభరణాయచ । లక్షారుణశరీరాయనమో రామేశ్వరాయతై ॥

ఆదిత్యః॥ నమస్తేస్తుమహాదేవ రామనాథత్రియంబక । దక్షాధ్వర వినాశాయనమస్తే పాహిమాంశివ॥

చంద్రః॥ నమస్తేభస్మదిగ్ధాయశూలినే సర్వమాలినే । రామనాథ దయాంభోధే సర్వపాపహరాయతే॥

అగ్నిః॥ ఇంద్రాద్యఖిలదిక్పాలసంసేవితపదాంబుజ। రామనాథాయ శుద్ధాయ నమోదిగ్వాసనేనవా॥

వాయుః॥ హారాయనిజరూపాయ వ్యాఘ్రచర్మధరాయచ। రామనాథ నమస్తుభ్యం మమాభీష్టప్రదోభవ॥

బృహస్పతిః॥ అహంత్వాసాక్షినేనిత్యంప్రత్యగద్వయవస్తునే। రామనాథమమాజ్ఞాన మద్యనాశయతేనమః॥

శుక్రః॥ పంచకానా మలభ్యాయమహామంత్రాక్షరూపినే । నమోదై న్యావిహీనాయ రామనాథాయశంభవే॥

www.mohanpublications.com

అశ్వినౌ॥ ఆత్మరూపతయానిత్యం యోనినాంభాసతేహృది। అనన్యభావవేద్యాయ నమస్తేరాఘవేశ్వర।

అగస్త్యః॥ ఆదిదేవమహాదేవ విశ్వేశ్వరశివావ్యయ । రామనాథాంబికానాథప్రసీదవృషభధ్వజ ॥ అపరాధసహస్రంమేక్షమస్వవిధుశేఖర। మమాహమితిపుత్రాదౌఅహంతాంమమమోచయ॥

సుతీక్ష్ణః॥ క్షేత్రాణిరత్నానిధనానిదారాఃమిత్రాణివస్త్రాణిగృహాశ్చపుత్రాః।నైవోపకారాయహిరామనాథమహ్యంప్రయచ్ఛత్వమతోవిరక్తిం

విశ్వామిత్రః॥ శ్రుతాని శాస్త్రాణ్యపనిష్కళానిత్రయ్యప్యధీతావిఫలానినూనం।త్వయీశ్వరేచేన్నభవేద్ధిభక్తిశ్శ్రీరామనాథేశివదేవశివేహరే ॥

గాలవః॥ దానానియజ్ఞాని రామాస్తపాంసిగంగాది తీర్థేసునిమజ్జనాని।రామేశ్వరత్వాంసమంతియేతువ్యర్థానితేషామితివిచ్మయాత్ర॥

వశిష్ఠః॥ కృతానిపా పాదకిలానిలోకాస్త్వామేవరామేశ్వర భక్తియుక్తాః।రమేతచేత్తానిలయంవ్రజేయుర్యదాంధకారోరవితేజసైన॥

అత్రిః॥ దృష్ట్వాపిరామేశ్వరమేకదాసిస్పృష్ట్వానమస్కృత్యభవంతమీశ।పునర్నగర్భంసనరఃసమాయాత్కింత్వద్ద్వయంతేలభతేస్వరూపం॥

అంగిరసః॥ యోరామనాథం మనుశోభవంతం పేత్యబంధూన్ప్రణామస్స్మరేత।సంసారయాత్రానపిసర్వపాపాత్కిముచ్యతంతస్యకృతార్థయాం॥

గౌతమః॥ శ్రీరామ నాథేశ్వరగూఢ మేతదవ్యక్తభూతం పరమేశతత్వం । త్వత్పాద మూలంభజతాంనృణాంయేసే వాన్సృకుర్వంతిహితేపి ధన్యాః॥

శతానందః॥ వేదాంతవిజ్ఞానరహస్యవిద్భిర్విచేయమేతత్త్రిముముక్షుభిస్తు।శాస్త్రాణిసర్వాణివిహాయదేవత్వత్సేవలంయద్రఘువీరనాథ॥

భృగుః॥ రామనాథతవపాద పంకజద్వంద్వవందనవిధూతకల్మషః నిర్భయంవ్రజతిసత్ సుఖాద్వయంత్వాంప్రయంప్రభుమతీవచిన్మయం ॥

www.mohanpublications.com

కుత్సః॥ రామనాథతవపాదసేవ సంభోగమోక్షవరదం నృణాం ! రౌరవాదినరకప్రణాశనం సకఃపుమాన్న భజతేరసత్రమాః॥

కాశ్యపః॥ రామనాథతవపాదసేవి నాం గ్రకింవ్రతై రుతతపోభిరధ్వరైః । వేదశాస్త్రజపచింతయాచకింస్వర్గసింధుపయసాచకింఫలం॥

ఆంగిరాః ॥ రామనాథత్వమాగత్య శీఘ్రింమమో త్క్రాంతికాలేభవాన్యాచనాకంమాం ప్రాపయస్వాత్మపదారవిందం శోకంవిమోహంసుఖంచిత్స్వరూపం॥

గంధర్వాః॥ రామనాథత్వమస్మాకంమజ్జతాంభవసాగరే । అపారే దుఃఖకల్లోలేనిత్యంత్వేనాగతిర్భవః॥

కిన్నరాః॥ రామనాథభవారణ్యేవ్యాధివ్యాఘ్రభయానకే । త్వామంతరేణనాస్మాకం పదవీదర్శకోభవేత్॥

యక్షాః॥ రామనాథేంద్రియారాతిర్భ్యఃకోదుస్సహాస్సదా । తంవిజేతుంసహాయస్త్వమస్మాకంభవధూర్జటే॥

నాగాః॥ అచింత్యమహిమానంత్వాం రామానాథనయంకథం । స్తోతుమల్పధియశ్శక్తా భవిష్యామోంబికాపతే॥

కింపురుషాః॥ నానాయోనౌచజననంమరణంచాప్యనేకశః । వినాశాయతతజ్ఞానం రామనాథనమోస్తుతే॥

విద్యాధరా॥ అంబికాపతయేతుభ్య మనంగాయ మహాత్మనే । నమోస్తురామనాథాయ ప్రసీదంవృషభధ్వజ॥

పనసః॥ రామనాథగనేశాయ గణబృందార్చితాంఘ్రియే। గంగాధరాయసర్వాయ నమస్తేపాహింస్సదా॥

విశ్వేదేవాః॥ క్షప్తిమాత్రై కసిష్టానా ముక్తిదాయసుయోగినాం రామనాథాయశాంబాయ నమోస్మాన్రక్షశంకరః॥

www.mohanpublications.com

మరుతః॥ పరతత్వాయతత్వానాంతత్వభూతాయవస్తుతః । నమొ రామనాథాయ స్వస్వభావాయశంభవే॥

సాధ్యాః॥ స్వాతిరిక్తవిహీనాయజగతుప్తిప్రదాయినే । రామేశ్వరాయదేవాయ నమోవిద్యావిభేదినే॥

వానరాః॥ సచ్చిదానందసంపూర్ణం ద్వైతవస్తువివర్జితం బ్రహ్మాత్మానంస్వయం బాసమాదిమధ్యాంతవర్జితః ॥ అపి క్రియమనంగంచపరిశుద్ధంసనాతనం । ఆకాశాదిప్రపంచానాంసాక్షీభూతంతిరాత్పరం ॥ ప్రమాతీతంప్రణానామపి బోధప్రదాయినం। అవిర్భావతిరోధానసంకోచరహితం సదా॥నిర్లేపంపరమానందంనిరస్తసకలప్రియం । భూమానందమహాత్మానం చిద్రూపంభోగవర్జితం॥ రామనాథవయంసర్వేసర్వపాతకశుద్ధయే । చింతయామస్సదాచిత్తే స్వాత్మానంద బుభుత్సవః ॥ రక్షాస్మాన్కరుణాసింధో రామనాథనమోస్తుతే । రామనాదాయరుద్రాయ నమస్సంసారహారిణే । బ్రహ్మవిష్ణ్వాదిరూపేణ విభిన్నాయ స్వమాయయా॥

విభీషణః॥ వరదాయవరేణ్యాయత్రినేత్రాయత్రిశూలినే । యోగధ్యేయాయనిత్యాయ రామనాథాయ తేనమః॥

వ. అనుచు నివ్విధంబున సీతా లక్ష్మణ సహితుండగు శ్రీరామచంద్రుండును నంగదాది కపులును బ్రహ్మాది దేవతలును బృహస్పతి శుక్రాది మహామునులును స్తుతించిన రామలింగేశ్వరస్వామి సంతోషించి శ్రీరామచంద్రులు మొదలగు నందరి నుద్దేశించి రామనాథేశ్వరుండో శ్రీరామచంద్ర మహాబాహో యోజానకీరమణప్రియ యో హాలక్ష్మణ యోజానకీ యోసుగ్రీవ యోయంగద యోఆంజనేయా యోవానరులారా యోచతుర్ముఖ యోయింద్ర యోబృహస్పతీ యో శుక్ర యోఅగస్త్య యోవిశ్వామిత్ర యోదేవతలారా మునీంద్రులారా ఓహోప్రజలందరు వినండి.

ఈ యధ్యాయంబు వ్రాసిన జదివిన వినిన వినిపించిన వారందరికి మాదర్శనంబుజేసి మాసేవలు జేసిన ఫలంబులభించు నొక వత్సరంబు

www.mohanpublications.com

సేతుధనుష్కోటి స్నానంబుజేసిన పుణ్యంబు లభించగలదని రామనాథ స్వామి గంభీరంబుగా శ్రీరామబద్రిమల కందరికి వినిపించిన నందరు కృతాంజలులయి సంతోషంబున గ్రహించిరి మునీంద్రులారా సేతు మహాత్మ్యంబును రామలింగస్తోత్రంబును చదివిన విన్నవారలు పునరావృత్తిశాశ్వతబ్రహ్మలోకంబు నొందగలరు సందేహంబులేదు సత్యంబు సత్యంబని వినిపించిన సూతా మమ్ముల పునీతులంజేసితివి నీఋణంబు దీర్చజాలము మాసంతోషంబే నీకు పరమాశీర్వాదంబని పలికి ముందు వృత్తాంతంబు వినుపించుమని కోరిన సూతుండిట్లనియె.

## సేతుమాదవస్వామి మహాప్రభావ వృత్తాంతము.

మునీంద్రులారా బహువినోదంబగు చిత్రకథగలదు వినపించెద సావదానచిత్తులయి వినుండందువలన సంసారతారకంబును మనోహ్లాదంబు గలుగునని జెప్పిన మహాసంతోషంబుతో మునీంద్రులడిగిన సూతుండిట్లనియె.

పూర్వంబున పుణ్యనిధియను నరేంద్రుండు సోమకులంబున జన్మించి హాలాస్తేశ్వర భూషితంబగు మధురంబాలింపుచు నొకానొక సమయంబున చతురంగబలంబు లతఃపురజనంబులు తోడరాగ నిజ పుత్రు రాజధురంధరుంగావించి రామసేతుపురంబోయి యచట గంధమాదనంబున నివసించి ధనుష్కోటియందును మరియుంగల తీర్థంబులందును నిత్యంబును స్నానము గావింపుచు బహుకాలంబుండి పిమ్మట విష్ణుప్రీతికరంబగు యజ్ఞంబుచేసి తదనంతరంబు బృథస్నానంబొనర్చి సపరివారుండును భార్యాసమేతుండయి రామనాథుం బూజింపుచుండె నాకాలంబున నిందిరాదేవి విష్ణుదేవునితో వినోదకలహంబు గావించి యొకసమయముజేసి యాపుణ్యనిధీ నరేంద్రుభక్తి బరీక్షింపంగోరి విష్ణు ప్రేరితయై వైకుంఠంబునుండి గంధమాదనంబున కేతెంచి యష్టవర్షకన్యారూపంబునొంది ధనుష్కోటితీర్థంబున సంచరించుచుండె నాసమయంబున నరేంద్రుండు ధనుష్కోటిస్నానంబు జేయుంగోరి సఫలుండయి యరుదెంచి

www.mohanpublications.com

స్నానంబుజేసి తులాపురుషాది దానంబులుగావించి మంచి స్వకీయ గృహంబునకు బోవుచుండి అష్టవర్షయు శుచిస్మితియు చారువిలోచనయు బింబోష్ఠియు తనుమధ్యయునగు నొకకన్యకం గాంచి, ఓబాలకామణి నీవెవరికూతురవే యిచ్చటనున్నదాన వెరుగింపుమని యడిగిన నాకన్య యిట్లనియె. ఓనరేంద్రా నాకుం దల్లిదండ్రులు బాంధవులులేరు. నేను భర్తృరహితనై యున్నదాన నెవండైన నన్నుం బలాత్కారంబునం గ్రహించు నాతని శపించెదనేని నాగృహంబున నిన్ను జనకుంగా దలంచుచు బుత్రికనై యుండెద ననిన నృపుండట్లొనర్చెదనని సంగీకరించి నాకొకబుత్రుండు గలడుగాని పుత్రికలులేరు వోకన్యామణీ మద్గృహంబున కరుదెంచి యంతఃపురంబున నాభార్యకుంబుత్రికవై యుండు నేపురుషుని యందు నీకిష్టంబుగల్గు నాతనికొసంగెదనని యాకమలలోచన నొడంబరచి స్వగృహంబునకుం గొనిపోయి వింధ్యావతియును స్వభార్యహస్తంబుననిడి యోపత్నీ నీకన్యకను నిరంతరంబును మనకుం బుత్రికయని భావించి రక్షింపుమనిన నదియు నంగీకరించె. ఇట్లాకన్య పుణ్యనిధి నరేంద్రునిచే రక్షింపంబడుచు సుఖంబుండె. నంత గొంతకాలమునకు జగన్నాథుండగు విష్ణుదేవుండు గరుడారూఢుండై వైకుంఠంబువెడలి రమాదేవిని వెదకుచు సకలదేశంబుల సంచరించి యెందుంగానక గంధమాదనంబుజేరి సేతుసమీపంబున సంచరింపుచుండె నపుడా కన్యారత్నంబు సఖీసమేతయగుచు నాభవనోద్యానంబున పుష్పంబులం గోయుచుండంగాంచి విష్ణుదేవుండు ప్రరూపమునుండి గంగాజలము స్కంధంబునందును దక్షిణకరంబున కుశగ్రంథి పవిత్రంబును ఛత్రంబును వహింపుచు భస్మోద్ధూళిత సర్వాంగుండును త్రిపుండ్రావళి శోభితుండును ధృతరుద్రాక్షమాలికుండును, శివనామపారాయణుండును స్తోత్రనీయుండును, నగుచు గంగాస్నానంబుగావించు విప్రవేషంబుధరించి యచట నుండ నాకన్య యావిప్రుంగాంచి భీతినొందె అంత వాసుదేవుండు పుష్పంబులుగోయుచున్న నిజవల్లభంగాంచి సత్వరుండయి కరంబుల గ్రహింప నాకన్యయు సఖీపరివృతయై యాక్రోశింప నారవంబాలించితల్లి

www.mohanpublications.com

యగు వింధ్యావళియను తండ్రియగు పుణ్యనిధియును మరియు పరిజనం
బులును హృదయంబులు కరతలంబులనోదుగొనుచు కోపోద్దీపిత మాన
సులై ధర్మాధర్మ విలక్షణంబుసేయక నాబ్రాహ్మణుని బలాత్కారంబున
బట్టి నిగళనిర్బంధిత పాదద్వయునిజేయుచు రామనాధాలయ మంటపంబు
లోని కీడ్చుకొనివచ్చి బద్ధునింజేసి కన్యనోదార్చి గృహంబులోనికనిచి
తాను నంతఃపురంబు ప్రవేశించి శయనించియుండ స్వప్నంబున నా
విప్రునిశంఖచక్రగదాపద్మ వనమాలావిరాజితుండును కౌస్తుభాలంకృతో
రస్కుండును పీతాంబరధారియు కాలమేఘవిభయు గరుడోపరిసంస్థితుం
డును చారుమందస్మితుండును మకరకుండల విరాజితుండును విష్వక్సేన
ప్రభృతి పరివారసేవితుండును శేషశాయియు నారదాది స్తుతుండును
నయిన విష్ణుంగాజూచి నిజపుత్రికను ధృతపంకజహస్తయు నీలకుంచిత
మూర్ధయు విష్ణువక్షస్థలయు మున్నతపయోధరయు దిగ్గజాభిరక్తాం
గియు శ్యామయు పీతాంబరవృతయు స్వర్ణపంకజమాలాలంకృత మూర్ధ
యు అనర్ఘ్యరత్నఖచిత దివ్యాభరణ విరాజితయు హారతారభూషిత
యునై వెలయు రమాదేవింగాంచి కల్పంబుననుండిలేచి కన్యాగృహంబు
జేరి తాను స్వప్నంబు గనినవిధంబుననుండు పుత్రింగాంచి సూర్యో
దయంబున మంటపంబుచేరి యచట హరిరూపుండగు విప్రుంగాంచి
యాదేవదేవు మహాభయభక్తివినయ గౌరవంబు లుప్పొంగ నాభూసు
రోత్తముని ముందుగలనిలిచి మంగళతరంబగు స్తోత్రంబుసేయందొడంగె.

ద్విపద – శ్రీమించురామేశ్వరమాధవేశా – స్వామిన్ దయానిధే
నగుణసంకాశా – సోమార్కకోటిభాసురచిద్విలాసా – శ్రీమానినీమాన
చిత్తాబ్ధివాసా – నారదాదిమునీంద్రునయగానవిమత – నారాయణానంత
నాగేంద్రశయనా – పదివేములస్వామిప్రహ్లాదవరదా – పండ్రెంటతళ్వార్ల
పతనప్రతాపా– రూపసుందర రూపదేదీప్యా – ఆపదోద్ధారకా అఖిలాంత
రాత్మా–కంబుకంఠీర సుభాకారదతాహోరా – డాంబీకశ్రీరామేశ్వరసేతు
మాధవేశా॥

